# ప్రథమాశ్వాసము

## శ్రీ వీరప్పయ్యగారు అన్నాజయ్యతో భూతభవిష్యద్వర్తమానములు చెప్పినక్రమము

ముందు తాను బ్రహ్మ లోకమునందు 72 బ్రహ్మకల్పములు రాజ్య పరిపాలనము చేసితి ననిచెప్పెను. అందుండి రజతాద్రికి బోయి 53 బ్రహ్మకల్పము లుంటిమి. పిదప వైకుంఠమునకు చని 3000 యోజనముల పొడవున కూర్మసింహాసనము నిర్మించి అచ్చట 33 బ్రహ్మ కల్పములు రాజ్యపరిపాలనముచేసి, వైకుంఠమున మరల మాధవానంతస్వామిసేవ 297 బ్రహ్మకల్పంబులు సేయ, నా స్వామి చతుర్విధ ముక్తి ఇచ్చెను. తర్వాత స్వామి వైకుంఠమున 10 దివ్యవర్షము లుండి బనగానిపల్లెచేరి, ఆదికాలమందు భూప్రదక్షిణము 150 మార్లుచేసి, సిద్ధాంతశిరోమణియగు ఆనందాశ్రమముల వద్ద సకలవిద్యలు అభ్యసించి, కాలమృత్యువు కడజేసి, ఆయోగముచే దివ్య శరీరినై 3,333 బ్రహ్మకల్పము లుంటిమి. అది మొదలవతారమూర్తినై -

ప్రథమావతారమున ఆనందాశ్రమమునకు శిష్యుండనై 999 కోట్లు 7665 బ్రహ్మకల్పము లుంటిమి. 2వ అవతారమున ఆనందాశ్రమములకు శిష్యుండనై 765 బ్రహ్మకల్పము లుంటిమి. 3వ అవతార మెత్తి ఆనందాశ్రమములకు శిష్యుండనై 18వేల యేండ్లుంటిమి. 4వ అవతారమెత్తి ఆనందాశ్రమములకు శిష్యుండనై 1170 బ్రహ్మకల్పము లుంటిమి. 5వ అవతరామెత్తి ఆనందాశ్రమములకు శిష్యుండనై 4 ఖర్వాలు 350 బ్రహ్మకల్పము లుంటిమి. 6వ అవతారమెత్తి ఆనందాశ్రమములకు శిష్యుండనై 77 కోట్లు 237 బ్రహ్మకల్పము లుంటిమి. అటుతర్వాత 7వ అవతారమెత్తి ఆనందాశ్రమమునకు శిష్యుండనై 735 బ్రహ్మకల్పము లుంటిమి. పునః 8వ అవతారమెత్తి ఆనందాశ్రమములకు శిష్యుండనై 2 లక్షలు, 260 బ్రహ్మకల్పము లుంటిమి. 9వ అవతారమెత్తి ఆనందాశ్రమములకు శిష్యుండనై యజ్ఞేంద్రునకు కుమారుడనై 73 కోట్ల 360 లక్షల 3360 బ్రహ్మకల్పము లుంటిమి. 10వ అవతారమెత్తి ఆనందాశ్రమములకు శిష్యుండనై 73 కోట్ల 36 లక్షల కనకగిరి నివాసుండనై 70,665 ఏండ్లుంటిమి. 11వ అవతారం మనుష్యావతారమెత్తి

బనగానిపల్లెలో 25 ఏండ్లు తపస్సు చేసినవెనుక, అంతట మనుష్యావతారం, వికారినామసంవత్సర ఆషాఢశుద్ధ త్రయోదశీనాడు విడిచి, అంతట ఆరభ్యం 32 ఏండ్లు అయిన వెనుక, తిరుగా వీరభోగ వసంతరాయలదే సింహాసనమన్నారు గనుక నందిమండల క్షేత్రమున పరబ్రహ్మవంశమందు ప్రఖ్యాతమయ్యేము అందుకు -

## రాయపట్నాల వివరం

శాలివాహన శకవర్షంబులు 1258 అగు నేటికి ధాతనామసంవత్సర వైశాఖశుద్ధ౩లు హరిహరరాయలు ఆనగొంది 7 ఏండ్లు ఏలెను. స్వభానునామ సంవత్సర వైశాఖమాసమున విజయనగరము నిర్మాణము జేసిరి. అక్కడ పాలించినవ త్సరములు 7. ఉభయం 14. అతని తమ్ముడు బుక్కరాయలు పట్టము గట్టుకొని యేలినయేండ్లు 29 నెలలు 8. రెండవ హరిహరరాయలు పట్టము గట్టుకొని యేలినయేండ్లు 22, విజయబుక్కరాయలు ఏలినయేండ్లు 17. పల్లెబుక్కరాయలు ఏలినయేండ్లు 16. గండదేవరాయలు ఏలినయేండ్లు 21. రాజశేఖర రాయలు ఏలినయేండ్లు 6. విజయబుక్కరాయలు ఏలినయేండ్లు నెలలు 10. ప్రౌఢదేవరాయలు ఏలినయేండ్లు 21. విరూపాక్షరాయలు ఏలినయేండ్లు 4. మల్లికార్జునరాయలు ఏలినయేండ్లు 6. రామచంద్రరాయలు ఏలినది 1 సంవత్సరం. రెండో హరిహర రాయలు ఏలినయేండ్లు 12. అంతట కురుపట్నాలు 13 కి ఏలిన యేండ్లు 155. స్వతంత్రముగా సాళువ నరసింహరాయలు ఏలిన యేండ్లు 5. అతని కుమారుని ముందర బెట్టుకొని నరసరాయలు ఏలిన యేండ్లు 13. అతని కుమారుడు వీరనరసింహులు తమ్మరాయలను చంపించి రక్తాక్షినామ సంవత్సరం ఆరభ్యం ఏలిన యేండ్లు 5. నరసారాయని రెండవకుమారుడు కృష్ణరాయలు శుక్లనామ సంవత్సర వైశాఖమాసం ఆరభ్యంగాను ఏలిన యేండ్లు 21. అచ్యుతరాయలు కుమారుని చంపించి ఏలిన నెలలు 8. శోభకృతునామసంవత్సర జ్యేష్ఠమాసం ఆరభ్యంగాను ఏలిన యేండ్లు 22. సదాశివరాయలను ముందరబెట్టుకొని రామరాయలు ఏలినది 22. రామరాజుతో విజయనగర పాలనము కడఆయిపోయెనుగనుక, అవాంతరము ఏండ్లు 7. అటుతర్వాత ప్రమోదూతనామ సంవత్సరమున తిరమల రాయడు పెనుగొండ పట్టణము గట్టుకొని ఏలిన నెలలు 10. అతనికుమారుడు శ్రీరంగరాయలు ఏలిన యేండ్లు 14. పార్థివనామ సంవత్సర



మాఘమాసం ఆరభ్యంగాను వెంకటపతిరాయలు ఏలినయేండ్లు 28 నెలలు 7 దినములు 15. ఆమీదట సోమవంశమువారికి పట్నాలు లేవుగనుక బహుధాన్య సంవత్సర నందన సంవత్సర మధ్యమందు పుట్టుఉత్పాతాలు చెప్పెదము. పర్వతమున మల్లికార్జునుని గుడిలో పొగమంటలు వెడలీని. గుళ్లలో దేవళ్లకు మూర్తిమంతములు వచ్చి, ఊర ఊర నాట్యమాడీని, దోషకారులకు చింతలంబుట్టీని, శ్రీశైలమల్లికార్జునుడు సాక్షాత్కారముగా ప్రజలతో మాట్లాడి పొయ్యాని, వీరవసంతరాయలు వచ్చీని అని చెప్పీని, అంపవర్షం కురిసీని, కంచికామాక్షమ్మ ఉగ్రము వల్ల దక్షిణ దేశముదొరలు, శిశువులు ప్రజలు, నష్టమౌదురు. దేశ దేశములకు దేవతాపంపుల వివరము. కర్నాట దేశమునకు కాళిపంపు, తురకాణ్య దేశమునకు దుర్గిపంపు, అరవరాజ్యమునకు అర్కసోముల పంపు. మొరసరాజ్యమునకు భద్రకాళిపంపు. సందు గొందుల దేశములకు భైరవుని పంపు. ఆమీదట అష్టదిక్కులను బాలురు మొదలు, నల్లగాలి పోసి నడినెత్తి వ్రక్కలై గండమాలపుండ్లు, రాచపుండ్లు, అబ్బలు, బొబ్బలు, ఆసనమున పుండ్లు పుట్టి చత్తురు. సందేహము లేదు. విచిత్ర వ్యాధులచేత ఉట్టిపడ్డట్టుగానే కూర్చున్నవారు అట్లే మడియుదురు. ఆకాశమున నాలుగు చుక్కలు పుట్టును. తమకు ప్రాణాలు లేవని వెతపడి చచ్చేరు. అష్టకుష్ఠువులు నోట్లో ముఖములో పుట్టి చచ్చేరు. ఆకాశమున ధ్వనిబుట్టీని, అందువలన కొందరు నొచ్చేరు. పశువులు, మేకలు, గొఱ్ఱెలు ఆకాశముజూచి అహోయని అరచును. భోభోయని భూదేవి పలుకును. అందువలన కొందరు నొచ్చేరు. జలములోనున్న జీవజంతువులు తాముచచ్చితిమని పలుకుతూ వచ్చును. భూమిమీదనున్న దుష్టులెల్లా నిర్వంశమై పొయ్యేరు. పర్వతమునకు ఒక మొసలివచ్చి 8 దినములుండి భ్రమరాంబగుడిలో మేకపోతువలె అరచి మాయమయ్యాని. శ్రీశైలశిఖరమున నిప్పులు రాలీని, తేజమే తేజమే అనే వాక్యములు పుట్టీని. ఊరఊర ప్రజలు రచ్చకొట్టముల వద్ద మొత్తుకునేరు. దేవిదేవి అనేశక్తి బెబ్బులివలె వాచరచీని. నానా తోయాల వాక్యములు పర్వతము మీదనే బుట్టీని. బసవేశ్వరుని కంట నీళ్ళు గారీని. మహాదేవునికంట నీళ్ళుగారీని. కటకటా యని రంకె వేసీని. ధణంధణమని కాలు దువ్వీని. సూర్యమండలమందు వాక్కు వాక్కు అనే ధ్వని బుట్టీని, ఆకాశమున ధర్మదేవత వాచరచీని. మహాదేవుని కంట నిప్పులు రాలీని. బసవేశ్వరుని కన్నుల

నీళ్ళు గారీని. జడలు ఎగసియెగసి ఆడీని. త్రిశూలడమరుకములు కదలీని. పర్వతము మీద పుట్లకంబము మీద ప్రతిమ మాట్లాడీని. భ్రమరిముందట బసవేశ్వరుడు తోక విదలించుకున్నదే గుర్తు. గుగ్గిళ్ళరాయడు ఏలూరు ఏనుగుచేత చచ్చీని. తిరుపతి వెంకటేశ్వరుని గుడిలో మ్లేచ్ఛులు ఆడిపాడీరు. కపిధ్వజం కదిలీని, ఘం అనే శబ్దము పుట్టీని, నానాదిక్కులకు పంపులు ఎగసియెగసి ఆడీని. తిరువళ్ళూరు వీర రాఘవస్వామికి తిరుమేన చెమట పుట్టీని. లక్ష్మీదేవి కన్నుల నీళ్ళుగారీని. వినాయకుడు ఊరూర వేదమంత్రములు చదివీని. నదులలో స్త్రీలు జోలలు పాడేరు. స్త్రీల కన్నుల నెత్తురు కురిసీని. ఊరూర బెబ్బులులు మనుష్యుల కరచి చంపీని. దుర్గస్థలాలకు తురకలు పాటి గొల్లలై యుండేరు.

## వీరవసంతరాయలు వచ్చేటప్పుడు పుట్టే కార్యాలు.

సామవేదఘోషణాలచేత బాల్య, యౌవన, ప్రౌఢలు వీరభోగవసంత రాయల చారిత్రాలు పాడేరు. పువ్వులవాన గురిసీని. ఆ మీదట అమావాస్యనాడు చంద్రోదయ మయ్యీని. సూర్యనందిననే మాపటింతల భూమి కదలాడీని. ఆకాశము ఎర్ర నయ్యీని. ఆకాశమున ఘుగుళ్ళఘుగుళ్ళ మనే ధ్వని పుట్టీని. గ్రామాంతరాల పట్నాల లక్ష్మీదేవి యేడ్చీని. నెత్తురువాన కురిసీని. పట్నాల లక్ష్మీదేవి ఉద్భవమయ్యీని. సూర్యనందిని ప్రకాశమయ్యీని. వీరయోగి వస్తూ ఉన్నాడని భూమి పలికీని. చతుర్వేదాలు తనలోతానే చదివీని. ఆమీదట ఆకాశంనుండి గంగోదకం కురిసీని. సముద్రాలు ఉప్పొంగీని. వాద్యాల చప్పుళ్ళు వినబడీని. మహానందిలో పదిహేనుదినాలు ఉండి భూమిమీద ప్రకాశమయ్యేము. ఆ మీదట తత్పూర్వమందు ధర్మ మెట్లానడుచునో, ఆతీరుగానే ధర్మము ముందర నడిపిస్తూ ఉన్నాము. నానావర్ణాదులయందు సజ్జనులైన వారెవరున్నారో వారిని రక్షింతుము. ఇది తప్పరాదు. ధర్మం నిజమైతే ఇది నిజమయ్యీని.

భూత భవిష్యద్వర్తమాన కాలాలకు నానాదేశాలకునూ వ్రాయించినది. మూడు లక్షల ముప్ఫై రెండువేల (3,32000) గ్రంథములు. వీరభోగవసంత రాయలు రాజ్యం చేసేది ౧౦౪ యేండ్లు. వారి వారి సాంప్రదాయకం వారు చేసేది వెయ్యి యేండ్లు. ఈతీరున ఈ పత్రిక లిఖియించి ఆనందాశ్రమములకు వినిపించెను. సంతోష చిత్తుండాయెను.

# ద్వితీయాశ్వాసము

శ్రీమద్రాజాధిరాజ రాజ పరమేశ్వర, రాజచూడామణి, పంచరాజ, బహురాజ, పరమరాజ, రాజోత్తమ, చరాచరజగత్తు సంతానసముచ్చారణ సంకల్ప నిర్గుణ నిర్వికల్ప బహుగుణ ప్రకల్పిత ప్రకృతిరూప, సహస్రరూప, స్వరూప, సదానంద స్వరూపులైన అంతర్యోగ బహిర్యోగ, పాలనయోగ, పరమయోగ, భావయోగ, భక్తియోగ, ప్రకటయోగ, ప్రకృతియోగ, ప్రపంచకయోగ, వియోగులైన, విద్యాత్మ, వేదాత్మ, వివిధాత్మ, విజితాత్మ, జీవాత్మ, నిర్జీవాత్మ, పూర్ణాత్మ, శతాత్మ, అనంతాది సర్వాత్మనాయకులైన కుటిలసాగర, గుణసాగర, అగ్నిసాగర, సోమసాగర, సూర్యసాగర, సర్వసాగర, మహాసాగర, అర్థివంతులై, ప్రణవాక్షర పాలనశీల, విశాలకులగోత్రమిత, అమిత, చిత్రవిచిత్ర, వీరపురుషాధిఖ్యాత నామకులైన, త్రేతాండయోగ, అజాండయోగ, సర్వాండయోగ, వీరశక్త, వియోగపురుష, కుపురుష, సత్పురుష, నిరుపమ, పరమ పురుష, నిర్వికార, నిరంజన, నిగమవేద్య, నిఖిలాంతరవాస, నిష్కళంక, నిర్వాణ, నిర్వికల్పవినోద నాదమోదితులైన, మహితహర, దురితహర, తామసహర, దైత్యహర, గుణహర, అజహర, అండజ హర, హరణ మేకోనారాయణ నామక, సోమవంశోత్తమతేజ, వీరభోజరాజ, మహారాజ రాజముఖాంతరాంతాది దశావతార విహార ప్రకాశ, అనంతావతారప్రకాశ, అత్యంతవిహార, వీరనారసింహనామ ఖండాగ్రశేఖర, భీమప్రతాప, అఖండనాయకులైన, దివ్యగణ, మునిగణ, శక్తిగణ, సౌమ్యగణ, అవతారగణ, అఖిలగణ, అఖిలశక్తిగణ, పరమగణ, సుగుణ సంపన్నులైన, అనంతవేదరహస్యజ్ఞాత, విఖ్యాత చరిత్ర, పవిత్రాంగ, సత్యస్వరూపులైన నిత్యానంద కృత్రిమావతార, విహార, అత్యంతగోప్య గూఢ జన్మప్రకాశ, కారణజన్మ, కార్యాంగధార్య, ఆర్యసేవాధురీణులైన, అంతరంగ, ఆత్మసంగ, బహి ప్రకాశ, ప్రపంచకసంగ, నిస్సంగ, సంగమధ్వంసక, హంసావతార వీరపురుష సేవాంతరంగ, శ్రీగురవే నమః

ఆనందకందళిత హృదయారవిందులైన, అలజాపురి ప్రతినామక దురితహరపురనివాసులైన, భూసురోత్తమ, మర్త్యప్రవర్తక, మహా రాజసోత్తములకు, మమసమాగమ మహత్తు, మనోలయ, జననలయ, స్థానసంప్రాప్తఫలం సఫలమయ్యే ఫలమౌనట్లుగాను, ఆశీర్వదించి అంపించిన ఆర్యాగ్రజ నిగ్రహానుగ్రహ సమగ్రవక్కాణితమైన ముఖ్యమైన ముఖ్యలేఖ.

మీకు ఏకాదశేంద్రియ వ్యాపార పారంపరివాసమైన దివసం గల్గీని. విలయ కాలానుగుణ్యమైన కార్యాలు గలిగీని. గజిబిజి అయ్యీని. ఘనసమూహములు కలకబారీని, కంఠగత వాత ఘాతుకమైన కాక పుట్టీని. కల్మషంబులు కాయంబుతోనే కరిగీని. గ్రహతులు సుగతులు దప్పితిరిగీని. కాలమాన కల్పంబులకు వికల్పంబులు పుట్టీని. అధ్యాత్మ యోగపురుషుని మహాప్రకాశమయ్యీని. మహామన్నీలు కాలుమడచేరు. ముక్కాండమల్లయ్యకు మొక్కులు చెల్లీని. లంకమల రామేశునిరాక నిజమయ్యీని. సోమశిలగండి కనుమమార్గాననే దుర్గాధిపతి ధురితభంజనుడై ధూర్జటి పర్యాయనామ  సంవత్సర, ద్విగుణకాలాంతర త్రయీమాసాన, భాసురభానువారాన పంచాక్షర ప్రకాశ ప్రళయ నక్షత్ర, దక్షిణకాలానను, పక్షద్వయాన, ప్రవేశ మయ్యీని, బంగారు జంగమయ్య లింగాగ్ని ప్రజ్వరిల్లీని. లీలావతారంబులు లీనమయ్యీని. అంగాంగాలు హరించీని, ఆర్తజనానందమయ్యీని. అంబుజసంభవుని వ్రాత అంతమయ్యీని. అధిక తేజః పరమేష్ఠి ప్రకాశ పరమనదీప్రాంత పట్టణ ప్రవేశమయ్యీని పరమయోగీశ్వరుల కాలానకు పదులుమూడు పంచక మొకటి పైమాసాలు పదింటిమీదట మమకుమార మహత్ప్రకాశ మయ్యీని. మలినంబులు మాసీని. మార్గశిరమాసానకు మందిరము చేరీని. మహానందిమార్గమున, మరుగు కొండలు మూడు దాటి పోగా, ఆడగాను నెవ్వరుందుఖో, వారే వచ్చే వీరయోగియని వక్కాణించినాము. ఇది మీకు ఆనవాలు. ఇదిగాక మీకు మాకు మాలిమియైన మధ్య సుఖ జన్మస్థానమందిరం. అడయాళం ఆదిసప్తసందర్శనం సఫలమాట గురుతు, మరిన్ని సపరివారసమేతముగా, శంకరసన్నిధానం సాక్షి. సర్వసాధారణమైన గురి, సంతతమున్ను, సర్వఋషిసమాగ, సపరివారసమేతముతో నేనున్ను నిజ భక్త హృదయాంతరాళమందు నిలిచి, నిఖిలవేద రహస్యతత్త్వ, మహాతత్త్వ, ఆదికాలాన కథాసందర్భమున్నూ,అఖిలయోగిజ్ఞాన,  భక్తిజ్ఞాన,గత్యేష్య జ్ఞానంబులున్ను, గ్రంథరీత్యా, బంధురమైన, బోధకముగా, బోధిస్తూ ఉన్నాము గాన ఇన్నిటికిన్ని హెచ్చైన ఆనవాలు గాన, మానసంబున నిస్సంశయులై, నిజముగా ఉండేది. నిర్ఘాతవాత జాత ఘాతుక మయ్యీని. సకలచరా చరంబులకు, సంతానంబులకు సంతాపంబులు పుట్టీని, మహోత్పాతంబులు నలువంకల వినబడీని. సర్వజీవంబులు సంక్షోభించీని. సుజనునకు జనోపకారమైన పనిగనుక స్వామిద్రోహులకు సుగతిమార్గంబులు కలిగీని.



ఆదిప్రేరితమైన శక్తి భీకరాకారియై, కదాచిత్తుగా కనబడీని. దాని అర్పులచేత అఖిలభూతంబులకు మనోవికల్పంబు లయ్యీని, ఆ సమయాన మీరున్ను మీ సహచరులున్ను, సమానులున్నూ, సద్భక్తులున్ను, సపరివార జనంబులున్ను సకలజన సంయుక్త సగుణధ్యాన అస్మద్దివ్యనామ పఠనపరులై ఆనందాన ఉండేది.

# తృతీయాశ్వాసము

శ్రీలక్ష్మీసమేతుండై నారాయణుం డొక్కరుండు, శంకర బ్రహ్మలను దలంచిన వారు వచ్చి సాష్టాంగ నమస్కారంబులు గావించి లేచి, ముకుళిత హస్తులై నిలుచున్న వారిని చూచి ఓయిశంకరా! ఓయి బ్రహ్మ! మనము ముప్వురమును యుగయుగంబుల జగంబుల నవతరించి దుష్టజన నిగ్రహమున్ను శిష్టజన పరిపాలనమున్ను చేయించి నియమించుట మనకు కర్తవ్యముగదా ! అటుగనుక, కృత, త్రేతా ద్వాపరయుగంబులు చనిన పిమ్మట, కలియుగంబుగదా! అది మహాపాపయుగంబు, మనము దేవరూపంబులు దాల్చక, నరరూపంబులు ధరించి పుణ్యస్థలముల నిలిచి, మనము తలంచిన వాక్యములు రెండు నిర్వర్తింప వలయు. అటుగావున, ఓయిశంకరా ! నీవు కలియుగంబున నవతరించి ఆనందభైరవయోగి యను నామంబు ధరియించి, గృహప్రవేశమున కాశీపురంబున నుండుము. ఓయిబ్రహ్మ ! నీవు బ్రహ్మానందులనే నామధేయంబు వహించి, సన్యాషివేషంబున దివ్యస్థలంబుల నుండుము. మేమున్ను, వీరంభట్లయ్య వారనే నామధేయంబు వహించి, హరిహర పురంబున సూర్యోపాస్తి పరుడనై యుండి, ఓయిశంకరా! అష్టైశ్వర్యప్రదంబునునై చతుర్విధమోక్ష ప్రదంబునైన ఒకదివ్యమంత్రము నీకు ఉపదేశమిచ్చెద. అది మనము రెండవ అవతారమున కలియుగంబున మనకున్ను పరమభక్తులైన వారికిని వారు ఒకరివలన కారణగురు విశ్వాసంబుతో నుపదేశంబైన, ఇహపరుడు పరబ్రహ్మ స్వరూపమైన ఆదినారాయణ మూర్తి, వీరంభట్లయ్య దేవుడై జన్మించి, హరిహర పురమున నున్నాడని తెలిసి, సంతోషచిత్తుడై నేడు పరబ్రహ్మమైన స్వామిని గంటిని. కాశీస్థలము తరలిపోయి, వాయువేగ మనోవేగంబుల దర్లి హరిహర బ్రహ్మపురముజేరి, అందు సూర్యోపాసనాపరుడైయున్న వీరంభట్లయ్య దివ్య పాదారవిందములకు సాష్టాంగ నమస్కారములు గావించి, లేచి అంజలిజేసి పరమపురుషా ! పరమాత్మా ! పరతత్వస్వరూపా ! అనంతావతారా! ఆదిగోచరా ! ఆనందమయా! అంబుజనాభా ! అంబుధిశయనా! ఆదిమధ్యాంతరహితా! అఖిలాండకోటి బ్రహ్మాండనాయక, అభేద్యా! అండజవాహన ! వేదాంత వేద్యా ! వేదగోచరా ! వేద స్వరూపా ! పరమగురవే! నీ మహత్వంబు నుతింప, నేనెంత వాడను, చరాచర జంతు, పరిపూర్ణంబైన బ్రహ్మాండంబులు పుట్టింపను, రక్షింపను, సంహరింపను, నీవే కర్తవై యుండి నన్ను



వినోదంబుగా కల్పించి నియమించుట, అది మీదయా విశేషంబు పరమగురూ! నన్ను రక్షింపుమా ! అని భక్తిపూర్వకంబుగా నుతింప, పరమానందభరితుడై, ఓహోశంకరా! నేను, నీవు, బ్రహ్మ, మన ముప్వురము, భైరవానందులు, బ్రహ్మానందులు, వీరాచార్యుల నామంబులు వహించి, అవతరించి కలియుగంబున, దుష్టజన నిగ్రహము, శిష్టజనపరిపాలము చేయుట కొరకేకదా ! నీయభీష్టము నెరవేర సంకల్పించుచున్నాను. అప్పుడు పరబ్రహ్మ స్వరూపమైన వీరంభట్లయ్యగారు, సకల లోకోపకారముగా, పరమ రహస్యమైన తమ దివ్యమంత్రమును ఆనతిచ్చుచున్నారు.

## శ్రీవీరనారాయణ మహామంత్రము

ఓం అస్య శ్రీవీరనారాయణమహామంత్రస్య, పరబ్రహ్మఋషిః దైవీగాయత్రీ ఛందః శ్రీవీరనారాయణోదేవతా, శం బీజం, హం శక్తిం శ్రీవీరనారాయణ ప్రసాదసిద్ధ్యర్థే చతుర్విధ మోక్షఫలసిద్ధ్యర్థే జపనియోగః ప్రాణాయామమంత్రం కృత్వా, తదనంతరం, శాం అంగుష్ఠాభ్యాం నమః శీం తర్జనీభ్యాం నమః శూం మధ్యమాభ్యాం నమః శైం, అనామికాభ్యాం నమః శూం, కనిష్ఠకాభ్యాం నమః శౌం, హృదయాయ నమః శీం, శిరసే స్వాహా, శూం శిఖాయై వషట్, శైం కవచాయ హుం, శౌం నేత్రత్రయా వౌషట్, శం అస్త్రాయఫట్ భూర్భువస్సువరోమితి దిగ్బంధః

### ధ్యానము

శ్లో. వీరం వీరభయాది తత్వభరితం వీరాసనస్థం గురుం
వీర శ్రేష్ఠనుతం విరించివినుతం వీరాధివీరం హరిమ్
వీరేంద్రం ఘనయోగిమానస చరం వేదాంత విద్యాకృతిమ్
వీరాచార్య మహం భజామి సతతం శ్రీవీరనారాయణమ్.

ఓం నమో పరబ్రహ్మణే శ్రీవీరనారాయణాయ స్వాహా, ఇతిమంత్రజపం. ఇంక పూజాప్రకారంబు దెల్పెద.

ఆదివారనియమంబున నుపవాసముండి, మధ్యాహ్నకాలమున స్నాన సంధ్యాదికృత్యములు దీర్చి, రక్తచందనమున సూర్యమండలము లిఖించి, ఆజాడ మూడు వలయంబులు దీర్చి, నడిమివలయంబున నా నామధేయంబులలో ముప్పది

రెండింటిలోను, వీరాచార్య, వీరగురవే, వీరబ్రహ్మణే అని నామంబులు వ్రాసి, ఆ నామంబులనడుమ నన్ను రత్నసింహాసనస్థునిగా భావించి, రక్తాక్షతలు రక్తపుష్పము లతో మా ముప్పదిరెండు నామంబులు పూజింపుమా, అవి యేవియంటేను.

1 ఓం వీరాయ నమః
2. ఓం వీరాసనస్థాయ నమః
3. ఓం వీరబ్రహ్మణే నమః
4. ఓం వీరాధివీరాయ నమః
5. ఓం వీరేంద్రాయ నమః
6. ఓం వేదాంత వేద్యాయ నమః
7. ఓం వేదగోచరాయ నమః
8. ఓం వీరాగ్రగణ్యాయ నమః
9. ఓం ఆదిమధ్యాంతరహితాయ నమః
10. ఓం సూర్యమండల మధ్యవర్తినే నమః
11. ఓం సూర్యనారాయణాయ నమః
12. ఓం సర్వవ్యాపినే నమః
13. ఓం సర్వతీర్థగోచరాయ నమః
14. ఓం పరతత్వాయ నమః
15. ఓం పరమ పురుషాయ నమః
16. ఓం త్రయీమయాయ నమః
17. ఓం జ్యోతిర్మయాయ నమః
18. ఓం వరదాయ నమః
19. ఓం చతుర్విధ మోక్ష ఫలప్రదాయ నమః
20. ఓం అభేద్యాయ నమః
21. ఓం అనంతాయ నమః
22. ఓం ఆశ్రితపారిజాతాయ నమః
23. ఓం ఉత్పత్తిస్థితిలయ హేతుభూతాయ నమః
24. ఓం మహాలక్ష్మీ ప్రదాయ నమః



25. ఓం సాంద్రసింధు వేదాయ నమః
26. ఓం ఆనందాశ్రమ ఆశ్రయాయ నమః
27. ఓం వీరధర్మజ స్వామినే నమః
28. ఓం వీరగురు పరబ్రహ్మణే నమః
29. ఓం వీరాచార్యాయ నమః
30. ఓం కాలజ్ఞాన విదితాయ నమః
31. ఓం పద్మనాభాయ నమః
32. ఓం త్రిమూర్తి స్వరూపాయ నమః

అని పూజించి, బ్రహ్మణపూజ చేసి బ్రాహ్మణోత్తముని నా మర్యాదగా భావించి, షడ్రసోపేతంబుగా అన్నము పెట్టి తృప్తుని చేసినవారు, నాకు ప్రీతిచేసినవారు, వారు నాయంతవారు, వారే పరమపుణ్యులు. వారే పరమ భాగవ తోత్తములు, వారు ఇహపర సౌఖ్యంబులు కొల్లలాడుదురు. వారికి నేను వశవర్తినై యుందును. ఓయీ భైరవానందయోగి ! ఈ మంత్రంబు, ఋగ్వేద, యజుర్వేద, సామ, అధర్వంబులతో సమానము. ఈ మంత్రమును, దూషణతిరస్కారంబులు చేసినవారు నరకముననుండి, క్రిమిభక్షణంబు చేతురు. అందు అనంతబ్రహ్మ కల్పంబు లుందురు. ఈ మంత్రమును, ఎవ్వరైననేమి, భక్తిపూర్వకముగా పూజచేసినవారు, దండ నమస్కారములు చేసిన వారు, అనేక శివకల్పాలు, నాతో జోడుగూడి సంచరింతురు. ఇది పరమరహస్యము. గురూపదేశమునగాని సిద్ధింపదు. అటుగనుక నీకు ఉపదేశమిచ్చితిని, అంతట యోగి సంతోషంబున మరిన్ని దండనమస్కారములు గావించి లేచి, వీరగురవే, నీ దివ్యమంత్రోపదేశమున కృతార్థుండనైతిని. ఈ మంత్రమునకు, దండనమస్కారములు, భక్తి పూర్వకముగా, ఎవరు చేయుచున్నారో, వారు ఆయురారోగ్య, ఐశ్వర్యాభివృద్ధియు, పుత్ర, పౌత్రాభివృద్ధియు, నిరంతర సకలశుభములు కలిగి వర్ధిల్లుదురు.

## సంకర్షణ మార్కండేయ సంవాదము.

శ్రీమద్రాజాధిరాజ, రాజపరమరాజేశ్వర, రాజచూడామణి, పంచరాజ, బహురాజ, పరమరాజ, రాజోత్తమ, చరాచర, నారాయణ నామక, ఆత్రేయగోత్రపవిత్ర సోమవంశోద్భవ కేతననామకులైన వెంకటనామపుత్ర జగన్నాథ, గర్భరత్నాకర కనక

గిరినివాసులైన అంగిరస సంవత్సర చైత్రశుద్ధ గురి గురి నాగురి ముద్దుగురి బాలగురి యిభూదేవి ఆకాశవాణి అమరసోమ యిజగన్నాథు ఈ జగత్రయమెల్లా ఈ కుమారునికీర్తి యిస్తి మనస్సులో శంకలరంగా వర్ణ బ్రహ్మముమీద జగదేకనాథాసర్వేశా చక్రధరాత్మా సర్వేశా రాజేంద్రురంగని మహిమ. లక్ష్మీకళత్ర కారుణ్యము మీద దినదినము కనుపిస్తిమి. మహిమాత్మము శ్రీరంగజయకుమారా! శ్రీవీరాత్మ ! జయజయ ధర్మజపుత్ర, జయజయ కస్తూరిరంగా, మానవనాథా, వెంకటేశా, జయజయ ఆచంద్రసూర్యకాంతులుగా రంగరాజనేవార్త పట్టాభిషేకంబు పరమపుణ్యము మీదగాని రంగని మహిమ తెలియంగలేరు. ధర్మజుని పుట్టుబడి యెరుగలేరు, తెలియరాదు. కారణ మెవ్వరు కానంగలేరు. తూర్పున గురు మకరమందు శ్రీఘ్రశీఘ్ర సంభ్రమోస్తు ! ఐశ్వర్యమస్తు ! ఆరోగ్యమస్తు ! బ్రహ్మాండ మేకో అనంత మస్తు ! కావేటిరంగప్ప కట్టడిచేసును. ఆమీదట వార్తలు దిక్కు దిక్కున వచ్చును. కుమార వీరధర్మజు హస్త మహిమ, జీర్ణదేహంబు హేమవర్ణంబు దివ్యదేహము నిచ్చె సర్వసంభ్రమిచ్చె వాకుడాకులతో వన్నె యిచ్చె చామరాందోళికా చక్రాంకితము మీద ఏలెదము. ఏవేదమునైన ఎత్తి చదువ నాకుమారుడు వీరధర్మజుడనే వరము. పాపాలన్ని పరిహారముగ పకపక నవ్వీని, పాలుట్ల రంగనాయకులు పసిబాలురతో మాట్లాడి పొయ్యాని. శ్రీ రామా నిన్ను నేను రంగనివద్దకు రావుగా రమ్మంటిని అయ్యయో రావద్దంటినా ? నీకు అది భావ్యము కాదని అంటిని. రంగేశురంగని మహిమ రాజ్యములవారు నన్నే కొలిచేరు. అన్ని నామాలు నాకుమారునికే యిస్తిమి. నేను ఉత్తరము నుండి ఉద్భవమై పంద్రెండేండ్లు అజ్ఞాతవాసముచేసి అటుమీదట సదోపవాసమున చాలాస్రుక్కి, జీర్ణ దేహము మీద మరుగు కొండలు మూడుదాటి సూర్యమండలానకు వచ్చి సూర్య మండల వృషభనందీశ్వరునిమీద శ్రీరాములు వస్తూ ఉన్నాడు. నేను భాగవతము వెంటనే తెస్తూ ఉన్నాను, నేను కావేటిరంగప్ప మహిమచే సకుటుంబము, పదకొండోనాటి అవతారముమీద, ఓకావేటిలో ఓంరంగజయదేవా, ఓం బీజదేవా, ఓం బ్రహ్మచరితా, ఓంరాజరాజాత్మా, ఓం రంగనాథాత్మా, ఓం రాజధర్మాత్మా, ఆదివెంకటపుత్ర, ఆదిసూర్యసమన్విత, లోకానకెల్లా సూర్యుండు ఒక్కడే మా కుమారుండు, లోక మెల్ల యేలేవాడు ఒక్కడే అని అర్థము. కావేటి రంగనిమహిమ, కైలాసాన నుంచి 24 యేండ్లు ఉండేను. 25వ యేట మావద్దకు వచ్చును. సన్యాసివేషంబు, సంతోషముల మీద, సాక్షాత్తు రామధర్మజమూర్తి



ఉద్భవము. సర్వాత్మ సర్వేసర్వ నాటకధారి సదోపవాసంబు విడిపించి భోంచేయ కట్టడిచేస్తిమి. తెల్లకోకలు, తిరుమణి, తిరుచూర్ణముతో, చాలా కట్టడి చేస్తిమి. అప్పుడు నా మహిమ కనిపిస్తూ ఉన్నారము. ఆలో జన్మప్రకృతి. షణ్మతంబులకు భేదములేని పల్కుతో పల్కే విరాట్టు అతడే నేను, నేనే తాను, తానే నేను. వెంకటనాథుని ఆడి పాడేరు. మాయవేష పరసాంగత్యములు పదులు రెండు పంచకాలు రెండు మీద ప్రకాశార్థం. గీత నాభక్తులకు శ్రేష్ఠం. బ్రహ్మచారి ఆశ్రమమే శాశ్వతం. ఇది అప్రమేయం చేసినవారు దురితాకు దుల్లినట్లు దుల్లుదురు. నా మహిమ తెలియని ద్రోహి మందలెల్ల, చీమలపుట్టలు మడిసినట్లు మడియుదురు. కా,యా,రా,నా, వచనశాపంబున బోదురు. నాస్మరణజేసిన మానవులు నా భక్తులే శ్రేష్ఠమని వినాయకుడు, శివుడు మెచ్చీని, కాశకులంలో పుట్టీని, ఆతీరు మునులెల్లా హరికి అరచేతి కంకణము అమరగట్టితిమి, నళ, పింగళ, ఇది నాతో ఇష్టము చేసి ఉండె గనుక, అంగీరసంవత్సరమే గురి గురిన గురి, ముద్దుగురి, బాలగురి, ప్రజోత్పత్తినామ సంవత్సర బ్రహ్మ బ్రహ్మము మీద, సోమసూర్యాగ్నులు, రాజాత్మ రంగేశుపాదమాన, త్రిభువనంబులెల్లా జయజయధ్వనిచేత సిద్ధాంతమెల్లా కానబడతి దెల్పితిమి. అచ్యుత అనంతరంగా, ధూర్తులమీద శ్రీరంగరాజానృపత్వము, శ్రీరంగజయదేవా, శ్రీరంగ నాథేశా, రంగనిపాదమే సాక్షి, వ్రాసిన దంతా తథ్యం, బాప్పు వెంకటనాథు, కృతార్థ పూజవేద్యతోను ఆమీద నాపేరు ఆది కేశవు డంటిని, దేవదేవోత్తమరంగా, పంచశక్తులతో భూమండలం సాధ్యం కరిష్యే.

తూర్పునాటికి బోయిరా అంటి, గూడురు గురిజాలసందు సింధునది దాటిరాగా దాససంగులు వచ్చి పరుస మాటలాడినందువలన అయ్యేవారు కానూగారు, కానివారు పోనూబోరు, అది యెరిగి శిరసా వహించి గురిజూచిన దారభ్యం గుమ్మట మెగసిన దారభ్యం. కాసే కాయలు కాయవు. అది యెరిగి అది అంటినపనిగాదని తెలియండా, మేమైతే సూత్రచ్ఛేదన సేయ, వస్తూ ఉన్నాము. మీరు అందుకు సంశయపడవద్దు. అపకారము చేసిన వారిని నిర్వంశము చేస్తాము. పూజా హారము కొంత పుక్కిలించి ఆమీదట ఉద్భవమని చెప్పితిమి. అది నిశ్చయమో అబద్ధమో యని నేనే యనుకుంటిని. ఫలసంజ్ఞ కాబోలు లేకుంటే యికాయలేటివి? ఇది ఉద్భవగిరి, లేకుంటే ఈ సంజ్ఞ లేటివి ? అని అంటిని కాబోలు. శ్రీవేదవేద్య విష్ణు

నిరజంన పూజమీద విరాట్టు అనగానే వటపత్రశయనుడు, వటము మఱ్ఱివృక్షము. పత్రము అనగానే ఆకు, శయనుడు అనగానే శ్రీమహావిష్ణువు, శ్రీ వీరబ్రహ్మ యోగీంద్రుడు, వీర వీరత్వము చేతను, బ్రహ్మ బ్రహ్మత్వముచేతను, దశావతారములు ఎత్తి ఆనందాశ్రమములకు శిష్యుండై, అంతర్భవిష్యమంతా, సాంద్రసింధువేదము చదివి, బనగానిపల్లెచేరి, కార్తీక బ౩లు దినదినముల మీద, దివ్య దేహము చేసినాము. పౌర్ణమి వరకు శుభముహూర్తము. విచిత్రవీర్యుని పుత్రుని బుట్టిస్తిమి. ఆత్మగర్భమున అర్థిమీద పిండము. నోటిలోరంగా, కలికి రూపము మహిమ కానంగ లేరు. కటకటా యీకాలమెల్లా, కాణయాచిగానే నమ్మిపోయిరి. జనులు మహిని ఆదిత్యమే మహా మయం. వేదాలకెల్లా సాంద్రసింధువేదము ఆదివేదము. అంధాతు పరంధాతు అనే ఆదివాక్యమే కారణము. పక్షం పక్షం మయంమయం. పక్షమనగా శుక్లపక్షము, మయం అంటేను మంజిష్ఠ యనే మాధవభట్లు. య అంటే యజ్ఞశాలలో యాగంచేసి దివసం సర్వానకు పంచమే కారణము. పూర్వానకు పంచమె కారణము, అని ఆనతిచ్చినాము. రామ ధర్మజులకు పంచమే కారణము, సర్వము నారాయణుని మాసము, చైత్రమాసమనే మరుగు, నారాయణమాసమంటే చైత్రమాసము. కేశవమాసమంటే వైశాఖమాసము. మాధవ మాసమంటే జ్యేష్ఠమాసము. చైత్రమేషము నారాయణుని మేనల్లునిది. ఇంద్రునివాద్యాలు డోలు, నాగస్వరాలు. ఆదివిష్ణు వాద్యాలు. సన్నవీణలు రామధర్మజులబిరుదు. మూడు యోజనాల నిడువున్ను, యోజనము వెడల్పున్ను భేరి, దేవతామృగాలు గండభేరుండ చర్మాలు, సోకితే మున్నూటయాభై యోజనములు వినవచ్చును. ధవళాలు, అష్టకాలు పాడేవాండ్లు కోటానకోట్లు స్త్రీలు, పురుషులు, సార్వకాలం సామ్రాజ్య అర్బుదాలు, కాల్బలాలు, గుఱ్ఱములు, ఏనుగులు, అనంతాలు, కామధేనువు, కల్పవృక్షములు, చింతామణులు, వెంటనే వస్తూ ఉన్నవి. ఇంద్రుని ఏనుగు, ఉచ్చైశ్రవము, రంభ మొదలైన నాట్య స్త్రీలు వెంటనే వస్తూ ఉన్నారు. ఈ స్త్రీలు ఒక్క ముహూర్తముననే కట్టేరు. ముహూర్తమనగా రెండు ఘడియలన్నర. ఉత్తరానకు మూడువేల మూడునూర్ల ఆమడ ఉండెనా చెంగల్వకోట చంద్రలోకమట, తూర్పున మూడువేలా మున్నూరు ఆమడ ఉండెనా, వెలియపురి, దక్షిణం మూడువేలా మున్నూరుఆమడఉండెనా, అన్ని యిస్తిమి.నాన్యోదక, సగాయత్రి అనందాశ్రమముల చేత, బ్రహ్మబీజాక్షరాలు, మంత్రోపదేశము ఇస్తిమి యిస్తిమి శాంతిం కరోమి శాంతిః.



ఈతీరున మార్కండేయునితో సంకర్షణమూర్తి అనెను. ఇంకా శంకరుడు ఆనతిచ్చిన వాక్యము. మార్కండేయునితో అన్నమాట. వీరప్పయ్య వేదాద్రి గరుడాద్రియందు తపస్సు చేయగా నేనుపోయి ఉంటిని. నాకు అనేక పూజలు చేసి ఉపచరించెను. అందుచేత ఈయనే నాకన్నా ఘనుడని అంటిని. ఈయన వేదానుద్ధరతనే వేద పరుషు డంటిని. ఏనుగు, ఎనుములు, ఎద్దులు, మేకలు, గొఱ్ఱెలు ఇవి అన్ని ఊర్జితమై యుండీని, లొటిపిటలు, గాదనవాలు సూకరములు, కుక్కలు, నక్కలు, పులి, ఎలుగు, చీమ, దోమ, నల్లి, పేలు, పాము, తేలు ఇవి మొదలైనవి. నాశనమై పొయ్యాని. వ్యాధులు, కట్టుబోతులు, బాదీకాండ్లు, కొండెడు పిల్లి, ఎలుక కొక్కుముంగిస నాశనమైపొయ్యేను. జూదగాండ్లు నాశనమై పొయ్యేరు. ఇది ధర్మరాజు, రాఘవుల యేలుబడి, సామర్థ్యము. సద్యోఘృతం పాయసమే యంటి. సకలమైనవారు మూడు వేళల పాయసమే భోంచేయు చుండేరు. శాంతాకారమైన స్వామి రాజ్యం ఏలే వివరము ఇది. ఇంకా దినవార్తలు రేపు ఆనతిచ్చేము. రామే రమే రమే యంతి, రమ్యమనూనాశ్రయం, కేవలం ధన్యమే యంతి ఆదివంశ సముద్భవం. ఫంచాంగం పఠతే నిత్యం. టీక పంచమికే పోతూ ఉన్నది.

సాంద్రసింధుసమం వందే, కల్పకోటిశతైరపి,
సద్యుక్తమధ్యమాత్మానో, బ్రహ్మమేకోమయోమయః
కోటిజన్మకృతంపాపం, బ్రాహ్మణోదివసాం త్యజేత్
ఆదిభార్గవమే రాజ్యం, భాద్రవీమాసపూర్ణిమా.
సదుక్తమెల్లతీరెను.
ఇందుఇందుకులం వందే, ఈ రేడుభువనత్రయం
నందిగ్రామేతు విఖ్యాతో, నందీనాం సూర్యనందినాం
సోమంసోమా, మహాపాలో, కేశవో పరితో జయం
కాశ్యపగోత్రమేమయంతు, రౌద్రసప్తక మత్పరం
కులపాదంచ కూర్మంచ కుల మేకమయోమయః
కులగోత్రవిశాలాక్షో కూర్మసింహాసనాత్మకః

శ్రీ గురవే నమః

# చతుర్ధాశ్వాసము

## చీలంపాటి గుండాభట్ల కాలజ్ఞానము

సకలగుణ నిర్గుణ సమరస సకలలోక సర్వప్రకాశ, సంభేదన, నిరర్థక, అష్టాంగయోగ ఆనందబ్రహ్మతేజో విరాజమాన రాజశేఖర గుణాలంకారులైన సరసశేఖరు లయ్యవారి పాదారవిందములకు గురు నిత్యకుల విస్తారముచేత కాలపత్రిక - మీరైతే దాసీభూతముతోటి దాడివెడలవలెగాక ! దాచనియ్య కుండా అంటే అందుకు భూగోళం గోపాలయ్య కుయ్యరాని కూతలు కూస్తూ ఉన్నాడు గనుక అది మీరు విన్నారోలేదో ! తెలియకుండా తెలియంగానే తెల్లవార వచ్చును. తూర్పునాటికి బోయి రా అంటి. గూడూరు గురజాలసందు సింధునది దాటిరాగా దాససంగులు వచ్చి పరుసమాట లాడినందువలన అయ్యేవారు కానూగారు. కానివారు పోనూబోరు. అదియెరిగి శిరసావహించి గురిజూచిన దారభ్యం, గుమ్మట మెగసిన దారభ్యం. కాసేకాయలు కాయవు. అది యెరిగి అంటినపని గాదని తెలియుండ, మేమైతే సూత్రచ్ఛేదన సేయవస్తూ ఉన్నారము. మీరు అందుకు సంశయపడక స్వేచ్ఛా విహారంబుచేత, చింతకాయలు, కొయ్యలు కొయ్యవలె గాని చొచ్చిపోవచ్చునా అంటే అందుకు కోసూరు ఓబులయ్యగారు అన్నమాట -కంచి తెరువున క్రౌరు బట్టిపోయినవారు, పుట్టినవారిని కొలిచిన దనుకా తెలిసికూసేమేక గురుతెరిగి కొమ్మపుచ్చినకోడి గురుతెరిగి ఉండేది. అది యెరిగిన దనుకా ఎండన ఉండిన వారిని, నీడకు దీయనిదే సాక్షి, ఆసాక్షికర్తలు ఎవ్వరంటేను - అయిదు ఆరు దినాల నాటికి పుణ్యపురుషుండు వేంచేయగలవాడై యున్నాడు. వేంచేసిన దారభ్యం వెంటవచ్చిగాని ప్రాపుచూడ బోదు. అది యెరిగి కాని కాయలు కూర్ప పనిలేదు. కూర్చగానే కోవెల సందేహపడేని. అది యెరిగి వచ్చిన దనుకా, చొచ్చి మళ్ళా వచ్చినదనుకా, తెలిసి నాలుగింట నష్టముజేసి ఐదింట అంబుధిదాటి యేడింట వట్టి ఉండజూచి ఉండేది. ఈగుణాలు గలవానిగా ఆదివారము దినమే మొదలుజేసి వచ్చేవారి వెంట అంపించేది. అంపకుంటే నీవు నేర్చినవిద్య యూడేరదు. అది యెరిగి అందున్నవాణ్ణిగా ఇందుబోయిన వాణ్ణిగా జూచి ఉండేది - ఇది గాక పార్లపల్లె పాపారాజు అయ్యన్నమయ్య గారున్ను తమలో తాము పంచుకొనవలెనని పసురుపాటి రామిరెడ్డితావుకు వచ్చిరి. రాగానే రాతి పువ్వు రంకుముండలపాలై పోయెను. అది



అయినదీ కానిది తెలిసి అంపించేది అమావాస్యనాటికి శ్లో.అఘోరస్యఅఘో వాంఛా అనృతస్య సర్వనాశనం గృహ్యతాం వరదా నిత్యం గణదేవో నమోస్తు తే. అనే న్యాయము కద్దు గనక దుర్లభంబులు దోసంబులయ్యాని. దోషమైనవి సత్యకర్మచక్షుల జూచేది. చూడంగానే చీలం పాటి గుండాభట్లు దిగులుపడీని, అదియెరిగి ఉండేది.

ప్రత్యామ్నాయ మహాఘోర నర సంసేవితం తథా
అన్యాయ మదగర్వే ణాన్యాయ మాత్మ మనర్థకం.

అన్నట్లు పొడిచి పొయ్యేవారేగారి పల్లెచేరే వారు లేరు. ఓస్వామీ యీ మరుగు వాక్యంబులు మావంటి నరపశువుల కేమి తెలియగద్దు. మీవాక్యంబులు మీకే తెలివిడి, నరాధమున కానతియ్యవలెనని అడిగిన సుజన రక్షకుం డిట్లనియె. మరియు నాలుగైదింటిలోపుల ప్రజాక్షయం చేసే కొరకు ఒక నరహరిక్షేత్రము మొదలు చేసుకొని ఉపద్రవము పుట్టవలసియున్నది. అందుకు ఐదు అంగాలుగల భస్మాంకుడు గలడు. ఆ భస్మాంకుడు కొంతచర్చ వస్తూ ఉన్నాడు. రెండు విడిచి నీతముతో ఉన్నాడు. ఒకడు మాయతో మాటగలిపి ఉన్నాడు. ఈలో ఒక ముహూర్తము ఉన్నది. ఆ ముహూర్తము మర్నాటికి పెండ్లికుమారునికి సగంపెండ్లి సగందుఃఖం గల్గీని. కంకణంచేత కోటికి పొయ్యాని, అది సగంలేని దినం. దినములేని వారమునాడు అందరకు తెలిసిన అవివేకుడు గలడు. - ఆయవివేకుడు దృశ్యమైనప్పటికి సాదృశ్యమయ్యాని, ముండయోసిన ముత్తైదువరాలు మురుస్తూ ఉన్నది గనుక భక్తులకు తెలియబడీని. ఏమంటివా యన మూడు నామాలుగల దాసరి ప్రబలగలడు. ఆయనే అనంతావతారుడై ఆద్యంత పుణ్యరహితుం డాయెను.

శ్లో అంగారవీరణో వాస్తు పరమ హంసవరం తథా
పారగః పారగఃపార, సువ్యక్తం, సురపూజితం.

మరియు నిక నిర్ణయము. నిష్పత్తి క్షణం అరక్షణం నిమిషకాల ఘడియ, అద్దము మీద పెసరగింజ పడినంతచాలదు. నా భక్తులైనవారెవరున్నారో రెండు గలిగినటు వంటి ఆయుధంబులు విడిచి, ఒకటి విడిచిన ముండమీదికి పయనమై యుండేది. నిరాయుధస్థులై యుండవద్దు. సకలసామ్రాజ్య సంస్థితి లయకాల ప్రణీతంబైన మహాయోగీశ్వర దివ్యచరణారవిందములు చిత్రవిచిత్రులైన చీలంపాటిగుండాభట్లు

సమకృత సముచిత సంభావంబై విన్నవించిన విన్నపపత్రం, ఇహ కాలవిలంబనకు శంబళగ్రామమునందు, కృష్ణార్జునులు ఉన్నారు. వారు ఉండేస్థలం ఓరుగంటి ఓరెంపాటి తెరువునడుమ, వస్తూ ఉండగా, వైరాగ్యులైన వాలఖిల్యాదులు వస్తూ ఉండిరి. అందుకు సంసేవితం నమస్కరించి సద్దుచేసే, దేహాలు గావు గనుక సద్దు చేయక వస్తూ ఉండిరి. అంటే అందుకు పాణెములో ఉన్న పాణెము లింగము భగ్నమైపోయినదే సాదృశ్యం. అది యేల అంటిరా యన పరమాణువులైన భక్తులు ప్రబలుచున్నారు గనుక పలు విరోధులెల్లా పారిపోయ్యేరు - అంటే అందుకు కడమల్లకాలువ కాచిభట్లు, అన్నమాట కంభం చెఱువుకు తూర్పుదిక్కున కఱ్ఱక్రింద రెండు గొడుగులు చెయ్యెత్తినవి మొదలు చేసి కాలసంఖ్య దెలిసినదనుకా కాదనబట్టదు. అందుకు కురుబలం అణచిన పుణ్యుడెవ్వడో పెట్టేది తెలినదనుకా పండుగది నాలుకోవెలై పోయేను. గనుక అది మొదలెరిగి అండబాయక, అంకురార్పణవేళకు వచ్చే వారెల్లా వచ్చేది. అందుకు చెన్నంసల్లె చెన్నారెడ్డి, అన్న మాట కొరకరాని కొరవిదెచ్చి, కొత్తచీర మూట గట్టి, కాళ్ళుముడిచేవేళ ఇప్పుడుగాని, మీదర్శనం ఎన్నటికి కాగల వాడవు దెలిసి, పంచలింగాల కొండ ప్రావుచేరి ఉండవలెగాక, పొగరు బట్టి పోకుండా? అది నిత్య సాయుజ్యమౌను అంటే అందుకు తాడిపర్తి తిమ్మిశెట్టి అనినమాట తిరుపతి తెఱవున తూర్పునాటికి ఉత్తరభాగ మందు ధూర్జటి ద్రోహం చేసెగనుక అందు శాల్మలి శాంకరి, శాంభవి అనే శాల్మికులు పుట్టి, చర్మచక్షులచేత సిద్ధిబొందిరి గనుక ఈలో శిరస్సులు సిద్ధిబొందీని. అంటే చచ్చిపోయిన దారభ్యంచొచ్చి మళ్ళా వచ్చిన దారభ్యం. చొరక లోతు. చూచిన దారభ్యం. చేయరాని అకృత్యాలు చేయబోకు. అందుకు శకులు అనినమాట సింహాసనానకు సిద్ధమైయున్నది. సీతాభగవతి స్థిరమైయున్నది, గనుక నిన్ను ఇది సిద్ధము చేయగలవారిచే సిద్ధించును. అది యెరిగి అరణ్యమునందు అంటి చూడవలెగాక. అంటి కొల్వరాదు గనుకు భళ్ళాపురం. భోగీశ్వరయ్య, అన్నమాట ఉమ్మటము కొరకు కేశవులంట చేసెనే కాని, కానికాయలు కొయ్యను కోసిపోగా మిగిలినవి విస్తారంగా నిలిపి నిర్ణయపరుచుకునే వారెవ్వరో ఆదివారంనాడు. ఆరోఘడియకు ఆవలనున్న పొగలదు. పోగానే ప్రావుగతి, ప్రాణాలు బయలై పోతూ ఉన్నవి. అంటే సూర్యావలోకనము నాడు గురుతు ఎరిగి యేకాంగివలె నుండవలెను. మునుపు చెప్పిన గ్రంథకారులు వీరప్పయ్య విద్యారణ్యుల వాక్యము.



శ్లో. నందానందానయో ర్మధ్యే వీరభోగవసుంధరా.

మరుగుచేసినాడు, అది 'ఆనంద నందనయోర్మధ్యే'

అది అందరకు తెలిసెనని ఉండెగనుక ఆనందనకు నందనకు 3 ఏండ్లకు మధ్య శ్రీముఖసంవత్సరం నిలిచె గనుక శ్రీముఖమని తెలియవలెనంటేను మొగలాయి గుఱ్ఱము రామేశ్వర మంటెనా శ్రీముఖమని నిదానమాయెను. ఇది విద్యారణ్యుల నిర్ణయము. సంవత్సరం మాత్రమే వీరప్పయ్య వాక్యము. పిశంగిల సంవత్సర పిలపిలమాసమునాడు వీర బ్రహ్మము ప్రకాశితము అని వ్రాసినాడు గనుక అది పెద్దలు శ్రియో పిశంగిలః శ్రియో పిలపిలః అని తీర్చినాడు గనుక శ్రీముఖసంవత్సర శ్రావణమాసమని శ్రీకారమాదులు నిదానించినారు - రెట్టమతంవారు ఆరు నాలుగు పదహారు దినములని తీర్చినారు. ప్రభవ సంవత్సరం ఆదిగా జూచితే శ్రీముఖసంవత్సర శ్రావణ బ ౧ లు హద్దు గట్టిగనుక ఈలో శుద్ధపౌర్ణమి హద్దు అని రెట్టడు వ్రాసినాడు. శ్రీకృష్ణమాచార్యులు ఒక కాలవిడంబము వ్రాసినాడు. అదిహద్దు ఉన్నది. ఇదిగాక యెమ్మెబసవన్న పదునెనిమిది కులాలవారు ఒకబావినీళ్ళు త్రాగుదురు అన్న మాటలకు ఆవులవారి బావులు పెట్టెనని అష్టాదశ వర్ణాల వారున్ను చద్దిభత్యాలు కట్టుకపోయి త్రాగినారు. అదిగాక కొండకు తూర్పున వాదు పుట్టను. ఘోటకంబులు మ్రగ్గును. అని వ్రాసిఉంటిరి., ఆ కొండ గోలకొండ, పెనుగొండ అది తేటపడకనే ఉన్నది. అది పెద్దలు కొండ తిరుణామల అందుకు తూర్పున చెంచి అని చెప్పిరి. గనుక ఆ ప్రకారమే చెంచివద్ద కూడిన గుంపులెల్లా నిదాన మాయెను. ఈ సంవత్సర ఫాల్గుణ బ౧౦లు నాటికి నానాదిక్కులతట్టు పలుగుంపులు తేటపడవలసి ఉన్నది. మరియు నాలుగు నెలలు పదునైదు దినాలు అరాచకమై ఇంట ఇంట పల్లె పల్లె వాండ్లు దొరలై నరుకులాడి తేటపడుదురు. పక్క ఇంటివాండ్లే సరుకులాడి తేటపడుదురు. కాబట్టి అధర్మం అణిగి న్యాయం ప్రకాశితం అయేంత పర్యంతం, అన్యయమె పొంగుచూ వచ్చును. ఆవెనుక సత్యం ప్రకాశితమయ్యే పర్యంతం నష్టవస్తువులు అన్యాయ కులాలు, మతాలు, భూతకానలలో ఉండే రాతిపీసుగులు, వీటిచేత భూభారమై ఉన్నది. వీరభోజుడనే కల్క్యవతారం పల్కే పల్కులు. పరిపూర్ణవ్యక్తితో ప్రకాశితముగనుక ఈ మాయరోజులు అణగును. ఇదిగాక ఔరంగశాయి రామావతారం పిండారి మరాటిబలాలు, కపు లనబడుదురు. గోదావరి

రామేశ్వరము నందు నూరామడకు శతయోజన మనబడును. తూర్పు పడమరనీళ్ళకు షష్ఠియోజన మనబడును. కనుక ఇదె లంక యనబడును. మన వాండ్లంతా రాక్షసులనబడుదురు. శ్లో. అగ్నిహోత్రశ్చ వేదాశ్చ రాక్షసానాం గృహే గృహే దయాసత్యంచ, శౌచంచ,నాస్తితేషాం గృహే గృహే రాక్షసానాం నహినహి ఈమంటిపాము సత్యముతో నీళ్ళమీద తేలుచున్నది. దాని కొనతోక రామేశ్వరాన రాయై తేలుతూ ఉన్నది గనుక ప్రబంధచాతురేణ ఆవల లంక ఉన్నది. ఈరాయి సేతు వని లోకము భ్రమసియున్నది గాని ఆనాటి లంక యిట్టిదేను అని తెలిసేది. ఇందుకు చుట్టు అగాథజలం ఏకముగాను, అగాథజలమయితే కొనతోక లంక పట్టు ముంచగూడదాయెనా, విభీషణునివంటి సత్యపురుషు లున్నారు గనుక ఏకముగా ముంచగూడ దాయెను. అసత్యమైన కవి భావము ఖండించే నిమిత్తమే వీరభోగవసంత రాయలు కల్క్యవతార మనబడును.

శ్లో. ఏకముంజస్మృతంచైవ, ఆయురారోగ్యమేవచ
అనేకకోటి భక్తానాం, ఏకదంత ముపాస్మహే.

చ. వరలగ ఖడ్గధార, నిజబ్రాహ్మణ జన్మము లోని జన్మమున్
సురలును మెచ్చ వచ్చెదరు శూరులు మెచ్చగ రామధర్మజుల్.

క. శ్యామలవర్ణశుభావహ కోమలదీక్షాప్రభావ కోశాంతరమై
యీమహి దుష్టచ్ఛేదన కారణమనుజన్మ నెత్తి కాన్పించెదవో.

అది మరియు ప్రతివచనము పారావార పర్యంత ముఖమైన ఆనవాలు ఆనతిచ్చేము. మీకు నిశ్చయముగాను మీరు కృయుగము చేరిన రెండు దినములనాటికి పంచబ్రాహ్మణ కులంలో వీరరాహుచింపిరిగాడు, వీరు ఏడుగురు ఈ భాగవతములోని ముఖ్యులు, భాగవతులలో శ్రేష్ఠులు అని యీ మంత్రము చదివి మిమ్ముల ఆదినం నాటినుండి మీరు అదృశ్యంబౌ పర్యంతరం మీమీద చాల పరామారికె అంతః కరణ ఉంచి మీకు అన్నవస్త్రంబులు విచారించి, మిమ్ముల శ్రేష్ఠంబై, ముందరకారణం బయ్యానని ఎఱుక ఉంచితే పాపాన బోదును. కాశిలో గోహత్య, శిశుహత్య, బ్రహ్మహత్య, పాప మనుభవింతును. మంత్రం -పంచశ్రీం, బాం, హ్లీం, కం, ప్రం, ప్రూం, ప్రేం, ప్రోం, ప్రూం, స్వహ, అని మేము చదివి మీచేత చదివించినదే గురుతు,



ఇంకొక్కదండ న్యాయవచనం ఆనతిచ్చేము. రారాజాధిరాజ, అక్షయ రాజ, బహురాజ, పంక్తికభావబర్హణ గ్రాహి, పిండాండ, మధ్యాండ, కురు పాండవాండజ, త్రైలోక్యమితాండ బర్బర వీరరాహు కృత వంగ, కంకణ బింబ బాహ్లిక అభివస్త్రాభిదేవ పాంచాల బ్రాహ్మణ జగన్నాథకృత వంగ వీరరాహు పంచబాహ్లిక, ఆనందకేశవ శివ పాంచాలకృత వంగ, జగన్నాథ కరుణానామ పాంచాలరక్షణ ఘంటాపథోన్నత, రురమాన సంయుక్త అద్భుతయుక్త భండార కందర్ప మహిమనగర కరుణద్వారా అంతర్యోగమితాన్య పంచమిదర్శన, పారావార వీర రాహు, క్రూరదర్శన నిర్మితకృవంగకం చైత్రకామితార్థ మహదహంకార క్రూరరక్షణ మాసదుర్యక్ష బుద్బదఘంటా ఉకార షకారమాస రురుబుద్బుద అకారమాస అంతరోయం బుద్బుద, బఘంటాపథమాస, గార్గేయముని బుద్బుద, ఏకాహితబుద్బుద, ద్వాదశ సంవత్సరనిరాహార, లక్ష్మీ సంభూత బ్రాహ్మణ పూజావిధేయ రాకేందువదన, మయూర మాస కంకణరుక్షైర్యమాస, త్రిమాస, వాస కేశవనామ, నారాయణనామ, ప్రఖ్యాత రురుమాస ఉద్భవ అకార, జకార, మకార, గ్రామ ఉద్భవ రురుమాస పౌర్ణమి పారావార పంచాక్షరి, మంత్ర పరిపూర్ణ జటాజినదేవా శార్దూల చర్మాంబరా విషుసూదన నాగేశ ఉద్భవ త్రైలోక్యవిదియ, తదియారాధనత్రిమాస, విశ్వకర్మపూజా విధేయులైన స్థైర్యమాస, ఋతు పక్షమీ నాకేశవాస పరశురామా భంజన కనకగిరి పరశురామా, కనకగిరి కైలాసనిలయ పాంచాలకులోద్భవ, పరబ్రహ్మ పరశురామా, కంకణ ఈశ్వర సంవత్సర పరశురామ రాజ్య ఈశ్వరసంవత్సర వీరరాహు, రాజ్యనిర్మాణ ఈశ్వర సంవత్సర రానిపోని గ్రామోద్భవవాస, రాజాధిప్రబల మాధవనామ అఖిలాండేశ్వరీనామ శ్రీలక్ష్మీనామ ఋష్యమలరాజ్య నామ కోనామలవాస శంతనహిరణ్యా నమః ఈదండ క వచనం ఎవ్వరైనగాని మంత్ర సంయుక్తులతో ధూప ధీప నైవేద్య తాంబూలాదులు సమర్పించి వినినట్టాయన ఆచంద్రస్థాయి సుఖాన వర్ధిల్లుదురు. దీనికి శాంతికి పంచ బ్రాహ్మణః శంతన యోగి వచనం, ఓం శ్రీం సదాస్థానం, ఓం శ్రీ సదాజపం, ఓం శ్రీ సదాధ్యానం, ఓం శ్రీం సదా గోవిందకీర్తనం

శ్లో. మన్నాథ శ్రీ జగన్నాథో మద్గురు శ్రీ జగద్గురు :
మ మాత్మా సర్వభూతాత్మా, తస్మై శ్రీ గురవే నమః ॥

శ్లో. బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం తత్వమస్యాదిలక్ష్యమ్
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తన్నమామి ॥



# పంచమాశ్వాసము

రాజశ్రీ ఆదికేశవ అనేపేరు మొదలుగాను, అన్ని పేర్లు ఇస్తిని. నాకన్నఘనుని జేస్తిని. శాంతాకారమైన సార్వభౌమంతం, ఆదిఆదిత్య మధ్యమాల, మేఘ మేకాను కోదండమూర్తి దేవతల సాన్నిధ్యం రామమూర్తి, వజ్రసింహాసనమూర్తి, పూర్ణ మేకో భవతి, భృగునక్షత్రదేవమూర్తి, పట్టభద్రుని చేసిన రామమూర్తి, అమౌక్తిక మౌక్తికాభరణాలు, ఆనందాశ్రమములు ఇచ్చిని. శతసహస్రాల భోజనాలలోను, మా పొత్తుల ప్రసాదం పంపబడుదురు. సకలమైన భోగాలకు నేడే మొదలు 'ఆదిదివసం, ఆదిదేవ మయోమయం' ఆదివేదానకు గురువారమే మొదలు అన్నిటికి కారణం ఆదవేణికి వచ్చేది. ముప్పైయొక్కటి ఆయెను. మేము బ్రహ్మమేకమ్మొదలైన ఆనందాన ఉన్నారము. ఆషాఢ బఃలునాడు ప్రకాశము. రాజశ్రీరఘునాయకుల ఆనతి, బఃలు, గురువారమని ఆనతిచ్చినారు. రాజ్యమెల్లా కట్టవలెను అని మేము అంటిమి కర్మ శ్రద్ధతోను, బ్రాహ్మణుల నెల్లా రేపే నడువ మంటిమి, ఆంనదాశ్రమముల ఆనతి ధర్మకాలము వచ్చెగనుక, తామే నడచేరు. అని ఆనతిచ్చిరి. శాంతిం కరోమి శాంతిః.

సూర్యనందిననే వేరుగ డైపోయెను. కేవలము సుజ్ఞానము ఇస్తిమి. జాతిసర్వత్ర దూరశ్రవణ దూరవార్తలు ఇస్తిమి. సకల జాతిభేదాలెల్లా తెలిపితిమి. సంతోషమెల్లా రేపే కనుపించీని. కావేటి రంగని చూడవస్తిమి అనేకాలము వచ్చెను. కావేటిరంగని ఆనంద భోగాలు నేడు రేపటను తిరుణాల కట్టించేరు. ఆనందం సార్వకాలం నడుపవలెను. బ్రాహ్మణుల ఆశీర్వాదము యశస్సునకు ఆనందభోగాలు దేవేంద్రభోగం నడువవలెను. కావేరి గిరిజా తోయమెల్లా రేపే కనుపించీని. సేనాధిపతికి సర్వదా మేలు, రేపే అయ్యాని సాంద్రసింధు వేదమే కారణమై ఉన్నారము. శంబకంబ అనే శారదాప్రసన్నం, బ అంటే భీకరమైన సాహసము. దయయున్ ధర్మమే జయం, ఓం అంటేఈశ్వరుని సామర్థ్యం గలిగి రాజ్యమేలేదే భావము. కాలాన బాకి రాబోలు, కాలం మీద తెప్పించేది కారణము, శంఖచక్రమేమయం, శంఖమున్ను చక్రమును కారణము. వేదాద్రి గరుడాద్రి రజితాద్రి హేమాద్రియే కారణము. రా

అంటే రాక్షససంహారమూర్తి, మా అంటే మాకన్నా ఘనమైన స్వామి అన్నందుకు రక్షించేస్వామి, అనఘ అంటే పాపాలన్ని నాశనముచేసే స్వామి, తాను అంటే వాక్కు శుద్ధి, వాక్కుచే నియమించేస్వామి. ఇది రామభద్రుని మహిమ, యికను మాకును పంతమే కారణము. సర్వము పంతము లోనిదే, భద్రమైన మాట మాపంతమే మాకున్నూ మీకున్నూ నేడు మొదలు. పౌర్ణమినాటికి రక్షించేము. ఇదే నిశ్చయము, పంతమే కారణము అనే వాక్యము ఆనతిచ్చేము, మేము మీకు ఇచ్చిన వరములు అన్ని ఇచ్చి రక్షిస్తే, అదే పంతము, మాఘపున్నమనాడు, రక్షించేదే పంతము. మేము ఆడితప్పనిదే పంతము. మాకు మీకు సూర్యనందవద్ద ఈశ్వరుడే సాక్షి. ఆనందాశ్రమముల గురువే సాక్షి. "జన్మ మృత్యుజరారోగ సంసారభయనాశనం" అనే వేదవాక్యమే సాక్షి. కామాతురత్వం క్రమ మేకమేకం అనేక్రమమే సాక్షి. నాన్యోదక మనే గాయత్ర్యాః పరంతపః అనేగాయత్రియే సాక్షి. పంచమి, సప్తమి, దశమి, పౌర్ణమే సాక్షి. ఆపంతమే కారణము, అది పంచజన్యమే సాక్షి పంతమే అనుదినము, ఆదికేశవుడే సాక్షి, ఆరువేలకుల మనే ఆనంద గురువే సాక్షి. నేడు మొదలుగాను, ఇంకా పండ్రెండు దినాలు ఉన్నది. పామా అనే పామరు లెల్లా నాశనమైపొయ్యేరు. బ్రహ్మయజ్ఞమైన సుజ్ఞానానకు రేపే కనుపించీని. సేనాధిపతికి మేలు అనే వార్త రేపే కనుఫించీని.

అన్నాజ వీరప్పయ్యను నమ్మితే, వీరప్పయ్య రక్షించీని, అనే మాట రేపే కనుపించీని, రామధర్మజులు అనే అమృత వచనం రేపే కనుపించీని, సాంద్ర సింధుజ్యోతిమయమైన వేదం రేపే కనుపించీని, ఏమో అయ్యవారు దైవమానాన ఏడు అనేది దివసమాయెను. రాజమార్తాండ మనే ఆది కేశవునికి బుద్ధిమార్గము దెలుప ఇన్నాళ్ళు పట్టెను. నాగుణ మనే సంవత్సర మెల్లా గుణాలు దెలుపబట్టెను. పంచాంగం పడిపోయే దివసం వచ్చే పర్యంతం ఉంటిమి. రామధర్మజుల పంతమెల్లా సప్తమినాడే ఉన్నది 'ఆదివిష్ణు మయోమయం, ఆసూర్యో రాష్ట్రమే మయం' బ్రాహ్మల కెల్లా నేడే జయం, అశాస్త్ర పర్వతో మయం. కన్నడీల కెల్లా నేడే జయం. వేదాంత శిరోమణి ఆదికులమున బుట్టి రామధర్మజుల కీర్తి నేడు మొదలుకొని ఆచంద్ర తారార్కం సార్వకాలికం నడిచీని. భీమార్జున సంవాద మనే ఆదికథ దేశాంతరం పోయిన ఆది కేశవుని కులం ఆదికులమందే మరలి మరలి, అదే మారువచ్చి,



త్రిలోక చతుర్దశభువనాలు ఏలుదురు. ఆదికేశవుని ఆనందభోగాలు ఇచ్చెను. సామ్రాజ్యభోగమంతా సాంగోపాంగమనే సంవత్సరమే యోగ మేక మైన దేవదుందుభులు మ్రోయంగాను మృష్టాన్నము భోంచేయబెట్ట వలెను. రాజభోగాలెల్లా రేపే కనుపించవలెను. పీతాంబరాలె కట్టవలెను. ఉదయమైన అయిదోఘడియకు ప్రకాశమయ్యేను. ఉదయమే స్నానముచేసి. సంధ్యావార్చి ఉంటే మేము వచ్చేము. వేదాంతశిరోమణి ఆనతి నిశ్చయముగా తెలిసేది. ఛందోబద్ధమైన కర్పూరగంధాలు పూసుకోవలెను. రామధర్మజుల దరిసెనం చేయువలెను. ధర్మమెల్లా రేపే కనుపించవలెను. కామాక్షి అనే కారణమెల్లా రేపే కనుపించీని. అరవ భూమికి మళయాళం అంతా కట్టవలెను. సంతోషమెల్లా రేపే కనుపించీని. యామినీ కన్యక కామితఫలం, కామకామాన్య మేకం, హోమం హోమంహోమాంధ్ర మేకం, అగణితఫలదం, సోమసూర్యప్రకాశం కామం కామార్థ మేకం, గ్రహణ సహితం, కోటి సూర్య ప్రకాశం, సద్యోమాన్య మేకం, రామరామాత్మమేకం కామోధర్మజ, మేకమేకఫలదం, ధర్మ మేకం సహాయం నేడే, ఆరోఘడియ ప్రకాశం, ధర్మధర్మ అనే ధణధణ అనేయోగ ప్రకాశమవుతూ ఉన్నారము. కామాక్షి కరుణాశ్రితము చేతను, కామేధర్మసమ్మతులమీద పదకొండవనాటి అవతారముల మీద ఆత్మాత్మపుత్రు, ఆర్తి ఆత్ముల మీద అద్వైతముల మీద ఆర్తిమేర యీతపస్సు అంతా నాకుమారునికి ఇప్పిస్తిమి. ఈ సంధిముందర ఆర్తిమీద దివ్య దేహము ఇస్తిమి. పాయని సంతోష సామ సోములు మెరయ ఈ రాజ్యముల మీద ఈ దివసమున నిర్మనుష్యంబున ధూళిచేసి మహాయోగమైన సన్యాసివేషంబుచేత చాలగా ఉద్భవిల్లి జన్మస్థానసంబు, శుద్ధ ౮ లు, శుద్ధ ౯ లు, శుద్ధ ౧౦ లు, శుద్ధ ౧౨ లు, శుద్ధ ౧౩ లు, శుద్ధ ౧౪ లు వరకు టికానా చేరి పదులుమూడు పరుపులు రెండింటిమీద ప్రకాశ ప్రతిజ్ఞ సాంద్రవేదమే జయం, సర్వాంకుశప్రతిజ్ఞ, ఇది సత్యం ఇది పూర్ణం, ఇది బ్రహ్మసంజ్ఞ, ఈ గ్రంథసారము పానము చేస్తే అమృతపానం కద అని, ఆనందగురువులు చెప్పిరి, ఇది సిద్ధము, సురధేను సురపూజ, సురభి, సురభుల మీద సూర్య నందీశ్వరుని సన్నిధియందు పద్యాం, శూద్రులు నాశనమైపోయిరి. శ్రీ గురవే నమః

ఎంతలేదని చూడవద్దు. కస్తూరి రంగడు కట్టడి చేసేను, సోయని సాష్టాంగ దండంబుబెట్టిన కోయని ఆనందమిచ్చును. పాయనిపాదంబు పట్టినంతలో తనకాంతి

ఆయువంతయు నిచ్చు నాభోగభాగ్య మంతా ఇస్తిని. ఈ వరములు నా పుత్రుకేశవునికే ఇస్తి. దుర్జనులనెల్లా ధూళిధూళిగా మొత్తి దుర్గమార్గంబున నాశనమున సదాశివపూజఫలం. మీరు సూర్యునిమీద మిథునపూజలమీద మిథునమిథున మహేష్టమంత్రంబుమీద కద్దు కద్దు అనిపించి, కావేటి మహిమచే బ్రహ్మకల్పాలు ౭౭౭ అగునేటి విజయాభ్యుదయ శా.శ. ౧౬౭౭ అగునేటి జీవాత్మజీవేశు, శ్రీదేవదేవేశు, బంగారుపావడలు, భద్రభద్రము మీద వీరభూముల మీద విజయమునకు ముద్దుపుత్రుని ఆర్తిఆర్తుల మీద ఆదిధర్మజాపుత్రు ఆర్తిమీద ఆపై వినాయక, నందివద్ద పెండ్లిండ్లు చేయించి పెండ్లాముతోగూడి ఆర్తిమీద జోజో నాపుత్ర, జోజోసర్వేశ, సన్యాసివేషంబు, సర్వంబు మితివెళ్ళె మాంవేద, అర్థ సంపాదనము లను పాశుపతాస్త్రంబు పరాశరునివిల్లు హమ్మీరు తాయతు చేతగట్టి ౧౧౭౫ గురువులు, అంబబీజశక్తిచేసి, భద్రాత్మ భద్రబాణముల అభూమినెత్తురు వడిసి పారి, అరవపిల్లలు, లేక నాశనమంది భూభారమంతయు నాశనంబున బొంది ఉద్భవంబుల మీద ఆర్తిమెరయ పద్భ్యాం శూద్రుల నిర్మూలంచేసే, ఓం నమో నారాయణాయ మంత్రంబు చతుర్దశ భువన భూభాగమున ఈలోకముల జగతి శత్రువులను నాశనంచేసి మరియు మిగుల పదో అవతారంబు. రామరామాత్మ రామావతారంబు, ఉద్భవము అనాది బ్రహ్మవచనార్థములను బహిర్ముఖముల మీద బహువచనంబున మూర్తి మహిమచే కల్లకలియుగముపాలు దిగిపోయేను. తురకలు, తుచ్ఛులు, మిత్రభేదవాదులు, స్వామిద్రోహులు, వీరసింహుని ద్రోహులు, నిర్వంశమై పొయ్యేరు. కావేటిరంగని పాదమే సాక్షి. ఈ వ్రాసినదంతా యథార్థము. వీరధర్మజుని కాలమునకు దుర్జనదుష్ట ద్రోహులు నాశనమై పోతూ ఉన్నారు. భూభారమైన దుష్టద్రోహులు నాశనమై పొయ్యేరు. కలికావతారమున నా మహిమ ఈ ప్రొద్దే కనిపించును. సదోపవాసము నేడే కనుపించేము. శీఘ్రశీఘ్రమనే పంచదార పాలుకలిసినట్టే ఉన్నది. ఈ ప్రొద్దు వాలాయము సంతోషము ఇస్తూ ఉన్నారము సద్యోఘృతము అనే సంతోషము ఇస్తూ ఉన్నారము, ఇపుడే కలిదోషము, నిర్వంశమై పోయేను. శబ్దబ్రహ్మమనే పరబ్రహ్మము ఇప్పుడే కనుపించేను. సాక్షాత్తు నా పుత్రుని సద్గుణాలమీద, ముక్కంటి మహిమలు అప్తిమీద, సాక్షాత్తు నా స్వరూపముమీద, లక్ష్మి తేజంబు మీద, సూర్యచంద్రుల ఆదిరూపంబుమీద, జ్ఞానజ్ఞానామృతము



సాక్షాత్కారమున నాసర్వంకషప్రజ్ఞమీద జయజయధ్వనిచేత, దేవతలు కొనియాడంగ, కారణమెల్లా కుమారునికి చతుర్దశభువనాలు ఏలేది దత్తాత్రేయులే. ఆనందగురువుల, సప్తసాగరములు, సప్తద్వీపాలు, చతుర్దశభువనాలు, అని నాభూమిలో పూర్వార్జితమైన జాహ్నవీగర్భములో నుండే తపస్సే సాక్షిగాను - ఇన్నాళ్ళకున్న నాదంవలె వ్రాయించినవారు ఈ వరము, ఈవరము, ఈక్షణమే ఇస్తిమి. అంబచంటపుట్టిన అమృతమే సాక్షి ఈ కుమారుని జన్మంబుల మీద సర్వాంగపర్యాయము, సదోపవాసమున పుట్టిన పుత్రుని మీద. ఋషిమార్గములను ఉద్యానవనములో ఉన్న ఉత్తమాశ్వములను ఆత్మలోనున్న ఆదివేదమే సాక్షి. గురు మూర్తి వేదాంత మెల్లా వివరించినదే సాక్షి. సన్యాసివేషంబు సరిపోయె చతుర్దశి వెళ్ళినమీద మరియు నాదబ్రహ్మము నాకుమారుని చేసి, నాయాత్మపుత్రు గనుక ఇస్తిమి రామాత్మ రామభోగంబులు ఇస్తిమి. నుకుమారు బుట్టినదినము ఆరభ్యమున ఉగ్రముగ్రముమీదను కలహం మీదను కత్తికొరకై పడిరి. నిర్మోహముల మీదను నిమిషములను ద్రోహుల ఇండ్లలోను నిమిషమున పడగఅచి, ఆకందనూరి రాజునగరిలో హస్తకములమీద అజ్ఞవడయు, తత్ఫలంబు వారకాంతలయిండ్లు ఆమీద తనపడకయిల్లుగాలి శార్దూల నాగంబు సందు సందులమీద ఆధర్మదేవత శ్రీరంగా జంఘజానువులందు రంగా వీరధర్మంబు ఇచ్చిన వీరకృపాంతరంగా శ్రీరంగా అజమూర్తి శ్రీరంగా ఆదివరుని పేరు, నీపేరు౹కీర్తియు, వీరధర్మజావిలువ శ్రీరంగా రాష్ట్రములలోనెల్లా నాపేరు నా పుత్రుని కొసంగిన శ్రీరంగా ఆదినామము నాపేరు విష్ణుకల్పము, శ్రీరంగా అస్య శ్రీవీరధర్మజ, జపే వినియోగః

భూదేవి ఆకాశవాణి అమర సోమ, సూర్య ఈ జగన్నాథు, ఈజగత్రయమెల్లా నా కుమారుని కీర్తియిస్తిని. మనస్సులో శం కలరంగా వర్ణబ్రహ్మము మీద రంగా జగదేకనాథా, సర్వేశచక్రి పరమాత్మ సర్వేశా రాజేంద్రరంగని మహిమం, లక్ష్మీకళత్ర కారుణ్యము మీద దినదినము కనుపిస్తిమి. సత్యం సత్యం అనే సంతోషము. దిన దినము కనుపిస్తిమి. మహిమ మహత్వము శ్రీరంగా జేజే కొమార శ్రీవీరాత్మ జేజే ధర్మజయపుత్ర జయజయ కస్తూరి రంగా ఈ రంగని మహిమ తెలయంగలేరు. ధర్మజుని పుట్టుబడి తెలియలేరు. ఎరుగరాదు. కారణ మెవ్వరు కానంగ లేదు. తూర్పున గురుమకర మందు శీఘ్రశీఘ్రములమీద పుత్రునికి శీఘ్రశీఘ్రసంభ్రమస్తు

ఐశ్వర్యమస్తు ఆరోగ్యమస్తు అపకారం చేసిన వారిని నిర్మూలం చేస్తాము. ఎవరు ఎవరు నమ్మియున్నారో వారిని రక్షింతుము. జంబూద్వీపములో ఆయుధస్థల నిర్వంశము చేస్తూ ఉన్నాము. రాక్షసులు శూద్రులు, మున్నూట బలిజలు, కారాకు డుల్లినట్లు కాననంబు వలెనే వీరధర్మజు శాపంబు మీద పోదురు. ఇది క్షత్రియుల కెల్లా నేడేమతియు ఆడనే తోడనే ఆదినము మీద రాజాధిరాజులు రామానుజు కూటమున పంక్తి అపూర్వధర్మముమీద నారాహువులు ఆదిమధ్యములకు శ్యామ వర్ణమునకు ధర్మరాజాత్మదేవు అజాత్మ సర్వేశు ఆజాహ్నవీపుత్రు హరిమాత్రక రూపు కుమార వీరధర్మంబు హస్త మహిమలమీద ఘనత మెరసి కావేటి రంగప్పకట్టడిచేసెను. అమీదవార్త దిక్కు దిక్కులవచ్చు జీర్ణ దేహము హేమవర్ణము దివ్యదేహము నిచ్చె. సర్వసంభ్రమములను ఇచ్చె. వాకుడాకులచేత వన్నె యిచ్చె. చామరాందోళి కలచే చక్రాంకితములమీద సర్వాత్మ నామంబుసాక్షి. సాక్షులమీద ఏ కుమారుని మహిమ ఇటువంటి మహిమచే ఆచంద్రసూర్యకాంతులు వెలుగంగ రాజనేవార్త పట్టాభిషేకంబు పరమపున్నము మీద అబ్ద అబ్దము మీద ఆర్తిమెరయ ఏవేదమైన ఎత్తి చదువ కావేటి కస్తూరి రంగా నా కొడుకు వీరధర్మజు ధర్మమే వివరము. మనము వెళ్ళిన మీద వనము పక్షి వచ్చిన జన్మస్థానము. వృక్షమాయావరణము మీదపానము చేసి ఆదిభవభోగ మైన మంత్రంబు బ్రాహ్మణులకు చెప్పినవారు విశ్వకర్మవంశా చారకులైన వారు, పాంచానన కులం చేరేరు. బంధువు లెడబాసిన నక్షత్రము మాసిన ఒప్పి తాన మల్లికార్జునుని గుళ్ళో పొగమంటలు ఎగసీని, పాపాలన్నీ పరిహరించి పకపకనవ్వీని, పాలుట్లరంగ నాయకులు పసిబాలురతో మాట్లాడిపాయీని. మాలేటి వద్ద మద్దులేటివద్ద పర్యావర్తనం చేసీని, పర్వతభైరవుడు మహిష్టి మంత్రంబు మాటి మాటికిని చదివీని, మా విశ్వకర్మయు వాలాయము చదివీని. సద్యోఘృతం పాయసం తిని పాలునేయి ఫలహారం చేసీని. పంచాక్షరి మంత్రము ప్రణవమంత్రము పాశుపతాస్త్రము బహుదొడ్డ బహుసామర్థ్యములు మాని సదోపవాసము విడిచెను. సకలం విడుచును. ఈయేకమేకముమీద ఫాలాక్షుడైయున్న పావనంబు, విష్ణు నామము మీద విష్ణు హృదయు మీద మధురం పరదేవం వరవీరం విశ్రుత విహారం విబుధగణసేవ్యం, శ్రీరామా నిన్ను నెరుంగనివాని వద్దకు రావుగా రమ్మంటిని. అయ్యయో రావద్దంటినా? నీకు అది భావ్యముకాదని అంటి. రంగేశు రంగని



మహిమ. మనము వెళ్ళేది ఉదయసోమముమీద ఉద్దండ వీరవిజయమునకు. రాజ్యముల వారునన్నే కొలిచేరు. అన్నినామాలు నా కుమారునికేయిస్తి. నేను ఉత్తరమునుంచి ఉద్భవము. పండ్రెండేండ్లు అజ్ఞాతవాసంబు చేసి, అటుమీద సదోపవాసమున చాలా స్రుక్కి జీర్ణదేహము మీద దివ్యదేహమెత్తి, అటు తర్వాత నేను పది సంవత్సరములు, మూడు మాసాలు పది దివసాలు, పంచక మొకటింటిమీద మరుగు కొండలు మూడుదాటి సూర్యమండల వృషభనందిమీద శ్రీరాములు వస్తూ ఉన్నాడనెను. కావేటి రంగప్పచే దారిద్ర్యనాశనం చేసెను. ఈ ప్రొద్దు ఆ విఘ్నదేవుని మహిమ కుటుంబము కావేటిరంగప్పకైలాసం నుంచి వస్తిమి, ౨౪ ఏండ్లు ఉంటిమి. ౨౫ యేట మావద్దకి వచ్చును. సన్యాసివేషంబు సంతోషముల మీద, సంతోషము ఇస్తిమి, ఆ పురుషోత్తముని మహిమలు అంతంతయు ఆదిశేషుని భోగభాగ్యము మీద, సాక్షాత్తు రామధర్మజమూర్తి ఉద్భవము, సర్వాత్మ సర్వేశు, సర్వనాటకధారి, కల్లకలియుగము పాలుడిగి పోయెను. సిద్ధాంత శిలము సిద్ధము మీద ప్రజోత్పత్తి శిలం బ్రహ్మము నను కేశవాత్మకపుత్ర అధినాథ మీదేవత్వంబు విక్రమంబున, ఆదేవ మార్గశిరం ఇప్పుడు ప్రసన్నమాయెను. చైత్ర బ 3 లయందు శ్రావణమాసం అని అనతియిచ్చి యుంటిమి. రామధర్మజుల ప్రకారం బనగానిపల్లె సోమ సంభ్రమములు, ఘనత మెరయ శ్రీ కావేటిరంగడి ఘనత మెరయె, అజ్ఞాత అపరాధ దండనలమీద క్షీరపాయసముల మీద నడిచే ఆది పుత్రుని కొడుకును, ఆ వరంబిచ్చియు, సర్వదా యిగంధము మహిమలోను సుకుమారవీర ధర్మజు మహిమ. ఉద్దండ వీరసుతుని మహిమలు, సంతోషంబు సాక్షి. సాక్షుల మీద రామమూర్తి మహిమ. జోజో విష్ణుకుమారా కేశవాత్మా జోజో విష్ణు నిరంజన రంగా, రంగమున రామభోగము మీద ఉడుగరలసొమ్ము తగను ఇచ్చె గనుక తెలిపేది, సార్వభౌముల సార్వకాలమున్ను సర్వమున్ను ఎలాగైనా సర్వ సముడుగా తెలిసేది, ఘనము దేవదేవంబు మీద ఉడుగరలసొమ్ము తగను ఇచ్చెను గనుక తెలిసేది. (సార్వభౌముల సార్వకాలమును సర్వమున్ను యెలాగయినా సర్వసముడుగా తెలిసేది) సంశయము లేదని చెప్పినాడు. సంతోషములమీద ఘనతమెరసి శాంతోదంత గుణాతిరేకం గలవారమపుడు ఉపాయ శుభాశుభంబుల మీద అక్కడ ధూర్జటి గనుక మరియు సుకుమారదివ్య దేహంబు మీద, శ్రీరామ మంత్రంబు

రామభద్రము మీద ఆదివారము పట్టము గట్టెను. హనుమంతుండు ఆవీరిగానిని పట్టుక తెప్పించేది, అబ్ధతదియమీద, ఆగ్రహించి మూడుకోట్లున్ను ముప్పైవేలున్ను, మున్నూట యెనిమిది ద్రవ్యంబు దీసేము. దేవాధిదేవహరీ విశ్వదేవా, దేవేంద్రపూజితా, దేవదేవ, ఇది శ్రీవీరయోగీంద్రపారమస్య శ్రీమహాఆదివిష్ణు ఆదినారాయణమూర్తి అనగానే శ్రీవీర బ్రహ్మయోగీంద్రుడు, వీరవీరత్వముచేతను, దశావతారములు ఎత్తి మరిన్ని దేవతా సార్వభౌముండైన-రామావతారమెత్తి ఆనందాశ్రమములకు శిష్యుండనై అంతర్భవిష్యమంతా సాంద్రసింధువేదమే చదివి బనగానిపల్లెచేరి దత్తాత్రేయులకు శిష్యుడనై ఆ పిమ్మట తాను ఉద్భవకాలం అయిన వెనుక తాను నిలిపెననిచెప్పి, వెంకటాద్రిభట్లది అగ్రహారం అని అంబీజ మంత్రములతో చెప్పినాను. శ్రీగురవే నమః అది శాంతోదంతమైనది గనుక దారిద్ర్య హతం చేసె గనుక త్రివిక్రముడు అనిపేరు అనెను, పార్వతినాథుండైన పంచాక్షరి నా కుమారుని సూర్య సమానులుంగా చూచేది. ఆచంద్రతారార్కస్థాయులై వర్ధిల్లును. కామాక్షి అనే కన్నడ కులమును నామీదనున్న విశ్వాసం నా కుమారునిమీద నుండవలెను. వాడె నాకుచెలికాడు. ప్రాంతమందు పాషాణ విగ్రహం చేసి నిలిపెను. అటు తర్వాత పూజచేస్తూ తనరూపు తాను గైకొనెను. శాలివాహవశక శకవర్షంబులు ౧౭౭౭ అగునేటి అనురాధ ఐక్యం, పౌర్ణమి చంద్రునివంటివాడు. ఇది అతిసూక్ష్మమైనది. అది వాక్యము మహాదేవునికన్నా ఘనుడనే వాక్యము. మాకు తండ్రి మీకు తాత, తప్పితేను భౌమభేమాగ్నిశిఖాగ్ని కీలలలో వేదమెల్లా అగ్ని వేసెను. నందికేశ్వరుని తీసివేసెను. పదకొండో రుద్రుండనగా నేను. ఆరువేల కులంలో ఉన్న దుష్టులనెల్లా ఖండించేము. నామోద్ధారణ చేసేము. కల్కి కర్కాటకమందున్ను మధు సింహమందున్న ఆనందా శ్రమముల ఉద్భవము, త్రేతాయుగ సపరికరము మీదను శ్రీ మన్మహావిష్ణు శృంగారములమీదను ఆత్మ సంతోషము ఇస్తిమి. శ్రీలక్ష్మీ నృసింహ రాజ్య సంపద అంతా ఇత్తుము. జాజ్వల్య సింహాసన మంతా ఇత్తుము. అక్షర జాజ్వల్యజయ మిచ్చు, క్షత్రియ నృసింహజయమిచ్చు దేవదేవము మీద సంశయము లేదని చెప్పినాను. ఆ పౌర్ణమి మీద అంగారక భోగంబులు మెరయ వినయ వినయము మీద వీర ధర్మజుకీర్తి ఘనతమెరసి దొడ్డ దొడ్డ దొరలు పెల్లు అణచినమీద గుత్తి సీమను ఏకమునను దుమ్ము దుమ్ముగ మొత్తి ధర్మజుపుత్రుని ఆది ఆదులమీద ఆదివారమునాడు పట్నము



గట్టేది. ఆషాఢ బ౩౦లనాడు వాలా యము, వస్తూ ఉన్నారు, రామరామ ధర్మజుల మాటనమ్మి యుండేది. కామితార్థములెల్లా నాడే యిచ్చేది. చేపట్టినందుకు అనంతాలైన వరాలు, అన్నిఇచ్చి రక్షించేము - శాంతింకరోమి శాంతిం.

పదకొండు పండ్రెండు అనే మాంధాత అనే వాక్యము ఆనతిచ్చేము. ఆదిత్య అనే సూర్య ఇష్టినాడు సేనాధిపతికే మంచివార్త ఇక నాలుగు ఘడియల కొచ్చీని. అది యెటువంటి వార్త అంటేను వీరధర్మజు రావుల ఉద్భవము. సూర్యనందిననే ఉద్భవము అయ్యేము అని లోకమంతా అనుకునేరు, రామ రామం అనే రాజ్య మెల్లా వారే యేలేరు. నందీశ్వరుని సముఖాననే, సంభ్రమ మయ్యాని. అని అనుకునేరు కద్దో లేదో అనే సందేహమునకు ఒక నిశ్చయమైన మాట అనతిచ్చేము. ఆన మీరిరి. ఆన తప్పిరి. అనే సందేహము లేకుండా బ్రహ్మభేద్యమైన ఒకమాట. చెంగల్వకోటలోనున్న బ్రహ్మల కెల్లా కర్త గోవింద దీక్షితులు. బిడ్డపెండ్లి, ఆషాఢశుద్ధ౧౩లు నాడు వృషలగ్నమందు అయ్యాని అనేమాట నిశ్చయముగా నుండ తెలిసేది. ఇది నమ్మిక అయినమాట. నేడు రేపు అనే సందేహము లేదు. "మృత్యుంజయాయ రుద్రాయ, నీలకంఠాయ సంభవే" ఆదికులమందునున్న ఆనందాశ్రమముల పాదమే సాక్షి ఇంకా ఒకపుట్టరాని మాట ఆనతిచ్చేము. కందుకూరు, సిద్ధరౌతుగాణ్ణి తాటికొర్తిన వేసేది. రాజ్యములో దుష్టులనెల్లా నిర్మూలముగా కొట్టేది, బనగానిపల్లె వాండ్లను రంపాన మూడేసి వ్రయ్యలుగా గోసేది. జయంజయం అని యెదురుగా వచ్చినవారిని రామధర్మజులు ఆనపెట్టి, నమ్మిక ఉంచి రక్షించేది, బాణాలబసువసుతు, నూట యిరవై అయిదువేలు తప్పుబతికి మాతో సాయుజ్యాన ఉండ కట్టడి చేసేది. బ్రహ్మదులెల్లా దీవించేరు. జారు వాక్యాలు ఆడినవారెల్లా నాశనమై పొయ్యేరు. యశోదాదేవికి కీడు దలచినవారెల్లా నాశనమై పొయ్యేరు. కమ్మజాజుల పాన్పు రేపే కలిగిని. ఇదేవీరప్పయ్య జగత్తెల్లా రక్షించీని, అని అనుకునేరు.

శాంతింకరోమి శాంతిః.

ఉదయము కాక మునుపే ప్రకాశమయ్యేము.

ధర్మరాజు వచ్చెనని అందరు ప్రకాశమయ్యేరు.

కడమ రాజ్యములెల్లా రేపే యేలేరు. నాంది

నాంది అనే సూర్యనందినే ప్రకాశమయ్యేము. పౌర్ణమాసమాయెను, మాం శం, మాం శం, మహః

శమే సర్వతోమహే మహే, ఏకోమయేవ
రామంరామం, రామ, మేకోమయేవ,
రాజ్యం, రాజ్య మేకోమయేవ
దూష్యం, దూష్యం దూష్యమే నాశయేవ
దర్మం, ధర్మం ధర్మమే వర్ధయేవ
బ్రాహ్మ్యం బ్రాహ్మ్యం, బ్రాహ్మ మేకోవయేవ.
త్రైలోక్యమేకమే రాజ్యం, రామధర్మజ మేమయం.

సాంద్రసింధువేద మంతా ఉపదేశంగా ఇస్తిమి. త్రిశూల డమరుక శంఖ చక్రములు ఇప్పిస్తిమి. సర్వం ఏక మనేపద్దు కేశవ వాసుదేవ ప్రద్యుమ్న అనిరుద్ధ అనే నామాలు ఇప్పిస్తిమి. అరువేలకులంలో నాల్గువేల మనుష్యకన్యల ఇప్పిస్తిమి. దేవతాస్త్రీలు పదహారువేలు ఇప్పిస్తిమి. సార్వకాలం ఆపరమ ఆయుస్సు ఇప్పిస్తిమి. ఆదిలక్ష్మికి గల అనంతాయువు ఇప్పిస్తిమి. భద్రమైన వరాలు అన్ని ఇప్పిస్తిమి. ఈశ్వరుని కార్ముకమనే విల్లు పాశుపతాస్త్రం, అక్షయతూణీరాలు ఇప్పిస్తిమి నారాయణాస్త్రం బ్రహ్మాస్త్రం, ఆనందాశ్రమములచేత అతిసూక్ష్మ, అనంత ఆత్మోపమపఅప్రోపకరణాలు ఇప్పిస్తిమి. ఛంద మేకమనే దోర్దండం బహుపరాక్రమములు ఆనందాశ్రమముల చేత ఇప్పిస్తిమి. ఆనందాశ్రమములచేత శరణు ఆదివేదవ్యమాన మైన తేజస్సు ఇప్పిస్తిమి. ఇకనుసర్వం ఇందులోదే. ఇది సాంగోపాంగమైన అతిసూక్ష్మమైన, అతిరహస్యమైన పదవాక్యము. పంతానికెల్లా ఇద్దే కారణము. ఛందమేకమనే దోర్దండపరాక్రమాలు ఇప్పిస్తిమి. సాంద్ర సింధువేదమే ఇప్పిస్తిమి. ఇది నేటి దినము నడిచేది. ఇందుకు అప్రతిలేదు., ఇందుకు ఆదినారాయణ శంకరులే సాక్షి. ఇది నమ్మకమైన శివరూపము. భూకాంతసాక్షి. ఆదికేశవమే సాక్షి. ఆదివిష్ణు సమన్వితం ఆదివేదమయే దేవం. ఆది ఆనందమే మయం ఆనందగురుభ్యో నమః

పదునాలుగు రాజ్యాలు ఏలేము. పదకొండు ఏండ్లు పద్దెనిమిది అక్షౌహిణులు మడిసీని, పంతమెల్లా ఈడేరి ముప్పైమూడు అయెను. సాంద్రమేకోమయమైన ఆనందాన ఉన్నాము. శాంతిం కరోమి శాంతిః.



లక్షతొంబైవేల యాదవులు మడసినట్లు తురకలు రాక్షసులు మడసేరు. మళయాళాన మగవాండ్లునాశనమై పొయ్యేరు. ఆడవారు జయాన ఉందురు. రక్షాక్షి సంవత్సర మాఘమాసం అరభ్యం. ఆనంద సంవత్సర ఫాల్గుణబగం లు బఁలు సంక్రాంతి నవమి, మంగళ వారము, దినవారమాసాంతకం జాహ్నవి గంగాపుత్రుని కౌగిటిచేర్చి. దేవతాకన్యల పెండ్లి చేసి చరించెను. సాంగోపాంగ మనే ఆదివేదానకు ఆనందగురువే కర్త. జయ జయ సిద్ధాంత శిరోమణి ఆదికులవిస్రాకర వీరయోగి దేవమానవనాథా వెంకటేశా జయం జయం దేవవీర యోగి ఆనతిస్తూ ఉన్నారము. బ్రహ్మాదిదేవతలతోను, ఆనందాశ్రమములు, ఆదిమూర్తి ఆయనవలన మేమః వింటిమి. ఆశాస్త్రవివరముగా మీకు అనతిస్తూ ఉన్నారము. వెంకటనాథుని ఆడిపాడేరు, అన్నమయమైన కారణ మెల్లాయిప్రొద్దు ఆనతిస్తిమి. శాంతింకరోమి శాంతిః

రామధర్మజ సంవాదమయ మనిత్యాపి నిగమో భవతి.
శార్దూలసామర్థ్య మపి నిగమో భవతి.
కారుణ్యమయ కాంతి మనిత్య నిగమో భవతి. శాంతిం కరోమి శాంతిః

ఏడు సముద్రాలు నాకుక్షిలోనే ఉన్నవి, రామమనే దివ్య మంత్రం నాకుక్షిలోనే ఉన్నది, నాకునీకుభేదము లేదు. చిద్రూపం చిత్కళంచైవ. అందరిలో సమమందు గనుక, నాకు చెడ్డచేసేవాడు గనుక, ఇందుకు ఊరికె ఉండమని బ్రహ్మకు బుద్ధి ఆనతి యిచ్చెను. అన్నాజికి వీరప్పయ్యకు పనియేది అని అడిగెను, అన్నాజి, నీకు అనుమతైతే నా కుమారుండు గనుక వీరప్పయ్య అన్నాజయ్య కుమారుండు నాతో ఆడితప్పవద్దు, తెలియ చెప్పుమనెను. వీరప్పయ్య మీద లోకాలకెల్లా యేలేటందుకు కర్త. అన్నాజికి తన కుమార్తె నిచ్చి అందుకు మహాదేశ రాజ్యమెల్లా ఇచ్చినాడు. సర్వతోయేకమేకమైన చతుర్దశభువనాలు ఇచ్చినాడు. గాగిగూగే అనే బ్రహ్మాస్త్రం, అంతా ఇచ్చినాడు. దేవతలలోకెల్లా, ఘనమైన పద్దు ఇచ్చినాడు. ఈ లేఖ యాతీరున తెలుసుకునేది. ఇంక సర్వదిగ్విజయమనే వాక్యానకు ఆనతిచ్చేము. సర్వం భయేహంతి, సర్వాంశు సర్వమేమయం. ఆది వెంకటపుత్ర, ఆదిసూర్యసమన్విత, లోకాలనకెల్ల సూర్యుండు ఒక్కడే. నాకుమారుండు లోకమెల్లా యేలేవాడు ఒక్కడే అనే అర్థం అనుకునేరు గనుక ఆనతిచ్చినారము. వీరయోగి మహిమ, బ్రంగిబ్రంగి

అనే బభ్రబభ్రఅనే ఆనందాన వచ్చేము. కావేటి రంగని మనస్సులో అక్షరాలు, సద్యోధర్మమనే శాంతము పూర్వభాద్ర నక్షత్ర మందు పుట్టిన విజయదైవమైన వీరనారాయణస్వామి సర్వాత్మ కుండైన విజయనగరాన ఉండిన విరూపాక్ష వీరేశ్వరుని మహిమ కాలనేమియను పేరుగల పుష్పకము మీద నెక్కి ఆనంద భోగంబు మీద వింజామరలు, ముత్యపుసరములు ఆర్తి విగుణంబుల ఆర్తి తోను ఆత్మ ఆత్మపుత్రుండు, ఆర్తి ఆనందనమున మద్భోగమహిమ, సంభ్రముమీద కెరటముల మీద క్రీతమణులమీద మహాదేవభాషికము నొసలియందు. చౌకట్ల ముత్యపుసరులు ఆదిశేషుని శిరస్సున మణులు కంఠమాలలు. ఆదివిష్ణుమణులు ఆదినారాయణ వక్షము, ఇదే మేలు కొలుకట్లు ముద్దుటుంగరములు నా మహాముద్రలు కాలిపెండేరం అర్కకాంతిసమమే, సందేహము లేదు. రేపు పున్నమ మహిమచే అబ్దకలి దోషాలనెల్లా యీవేళ పున్నమవరకు అంబీజమహిమచే సప్తాశ్వభాస్కరుడు సాక్షిగాను సూర్య నందీశ్వరుని సన్నిధానమందు అద్వైత, అగమ్య, ఆత్మలను సంకీర్తనముల మీద శాంతములచే విష్ణు విజయంబుల మీద వివరమునను కావేటిరంగ జయదేవా, అంబీజదేవా బ్రహ్మచరితా ఓ రాజరాజాత్మా! ఓరాజ ధర్మాత్మా, నాదాత్మదేవా! నారాయణ పల్లవి, సన్యాని వేషంబు సంతోషంబులు మాన్పె, ఆ మహాదివ్యదేహము ఇచ్చె గుత్తిపెనుగొండలను బెబ్బులులు చొచ్చును. ఆ మార్గముల మీద నడిచే మరియు సర్వదేవత్వంబు సర్వంబు ఇచ్చె. ఉద్దండ వీరవిజయము ఇచ్చె. జ్యేష్ఠమాలలమీద జయజయంబులు ఇచ్చె మీనములో వేళవిజయంబులు మెరసి ఆదియేండ్లు 3 నెలలు 3 బ్రహ్మకల్పాలు 3 ఆరుతొమ్మిది అంటే ఒక విష్ణుకల్పము ఆయువు అంతా ఇస్తిమి. ఇంద్రుమ్నేమయ మనే వీరయోగి ఆయువు సురేశుండనే ఇంద్రపట్నము ఇస్తిమి. సేనాధిపతిమహిమ ఫాల్గున బ౹౩ లనాడు ఉదయాననే దివ్యదేహము ధరియించె. శ్వేతాశ్వవాహనంబెక్కి అజాత ఆదిగరువు ఏవేళ నాలుగువేల యేండ్లు, అరవై, వారాత్మవారేశు వాక్కు వాక్కులమీద భూభారమంతయు నాశనము, ఈ ప్రొద్దు మర్మంబుమీద ఆపదుద్ధారకము, ఆర్తిమీద, జయదాత్మ జయదంబు అబ్ద అబ్దముమీద ఉదాత్త ఉదరంబు మీద ఉత్సాహ భోగంబు ఘనతమీద సర్వదా యీ మంత్రంబు ఆత్మ ఆత్మము మీద ఆబుధవారంబు ఉదయంబు మీద పదికోట్ల అశ్వములతో పదికోట్ల గజములతో ఆక్షణమే వస్తుము. ఆర్తిమీద సన్యాసివేషంబు మాని నాపుత్రుడు జీర్ణదేహంబులు, దివ్యదేహంబులు,



విజయములను శుభ్రభోగంబులు, ఆ ముహూర్తము మీద ఆర్తిమెరసి ఇది యిష్టంబునైనది మతినిల్పిన, వేదవేదాత్మముల్ అన్నియు విడిచి, మాలవాని ముఖమున వసించుటయే గురుతుగా, కనుపిస్తిమి. తెల్లకోకలు తిరుమణి, తిరుచూర్ణం కట్టడి చేస్తిమి. అప్పుడే నా మహిమ చూపుతూ ఉన్నాము, సర్వభోగ భాగ్యాలున్ను ఉన్నంత ఇస్తిమి. ఉద్దండవిజయ మెల్లా ఇస్తిమి. నా బుద్ధి మనోజయము వేదసారస్వతము, యక్షజ్ఞాన దివము. అమృతోప మానము, జయజయాయ. జాజ్వల్యమాన తేజోపాయ. ఆముక్త పూజాఫలం అమానుష ఆత్మపుత్ర ఆయోనిరంజన ఆద్యంతమా, అజ్ఞాత, ఆనందమూర్తి, ఇది నిశ్చయ పద్ధతి ఇది సాంద్రసింధువేదము.

శ్రీగురవే నమః

వీరధర్మజ ఉద్భవ సంవత్సర మాన, వార దివస, నిర్ణయజ్ఞాన ప్రతిజ్ఞావచనము, బీజాక్షర, సంక్రమణ గ్రంథవికృతార్థం కఠిన అనాదరణ లేకుండ చెప్పిన వేదము. ధూర్జటినామ సంవత్సరం, శ్రీతీర్థనామమాస శుద్ధ ౧౫ లు ఉద్భవం, గురి, మాయావేష, సరస సాంగత్యం పదులు 2, పంచకాలు 2 మీద ప్రకాశార్థం, గీతం, మాఘశుద్ధ ౯ లు గురు త్రిదవేంద్రుని రాకకు చూస్తూ ఉండీని, జన్మసేవ్యం, భక్తిప్రదం, ప్రదోష తీర్థం, ప్రయోగ మాధవం, ఆనగింది ఉత్తరాది ఉభయరాజ్యం, కల్యాణమంటపం, కర్ణాటక రాజ్యం శేషభూషం వషట్కారం దక్షిణాంకం అభయం అక్షరం పంచాక్షరం పర్వతం సేనాముఖం మధ్యమ సుఖజన్మమందిరస్థానం. గురి అధోజన్మప్రకృతి షణ్మతంబులకు భేదము లేని పల్కులో పల్కే విరాట్టు. అతడే నేను, నేనే తాను, తానేనేను కృతాంగిరసం అక్షరంప్రోక్తం. బ్రహ్మ సాంప్రదాయకం, బ్రహ్మపక్షం శాంతోదంత గుణాతిరేకాంతగీతం, సాంద్రసింధువేదమే గురి. ఏకవింశతి నామాక్షరమే గురి. తిరుమణి తిరుచూర్ణం, ధరియించినాము. మామీమూమేమఖ ప్రళయ, నక్షత్ర ఉత్పాతాలు, ఉద్భవిల్లీని, రామ ధర్మజుల ప్రతిజ్ఞపాలన, ఆరువేలకులమే కులము. నాభక్తులే శ్రేష్ఠులు బ్రహ్మచారి ఆశ్రమమే శాశ్వతము. పంచాక్షరి ప్రణవమే గురి. సత్యమే జయము. సాంధ్రసింధువేదమే నిశ్చయము, బీజాక్షరక్రమము ఇది తప్పదు, ఇది ఘంటామల్కం 'న గాయత్ర్యా పరం మంత్రం

న మాతుః పరదేవతా' అనే శ్లోకం నిబద్ధి శాశ్వతం, ఇది ఆదరణ చేసిన గురుడే గురుడు. ఇది అప్రమేయం చేసినవారు దురితాకు డుల్లినట్లు డుల్లుదురు. ఇది గ్రంథసారము, అని విమర్శచేసిన వారేముక్తి ప్రదం ఇత్తురు. శ్రీ గురవే నమః

అంతరంగ అనుక్రమణ వాక్యము. నేడు దొడ్డరాజులెల్లా చచ్చిపోయ్యేరు. నేడే నాపంతమెల్లా యీడేరి నేడే నాకు జయం జయం వార్త గలిగేను. మేము ఆనెగొంది విడిచి నాలుగు దినాలు ఆయెను. మేము సకల దుష్టులను హతం చేస్తిమి. నేడు మేము పాంచజన్యము మీద కూర్చుంటిమి. నేటికి మాకు అన్నీ చేకూడెను. నేడు మేము ఆనెగొందిలో ఆదికేశవుడే దేవుడని పాటిస్తిమి. మేము శాంతగుణముల మీద చాటిస్తిమి. జాంకారాలలో నుండి మా కుమారుండు అని చాటిస్తిమి. మాకు మీకు సాంద్రసింధువేదమే మయమైన పంచమవేదమే చదువుచుండవలెనని చాటిస్తిమి. మేమే రాజ్యమెల్లా మాకుమారుని వశము చేస్తిమి. మాకు దేవాదిదేవతలు ఈడుగారని చాటిస్తిమి. మేము తాము గుత్తికి పోతూ ఉన్నాము. అక్కడ గౌతమ మహా స్థలం, మాకు మీకు గౌతముడు, ఆదిబుషి గనుక ఆయనచేత మిమ్ము ఇప్పించుకుంటిమి. ఆయనకు చాలా ప్రియము చెప్పితిమి, మీకుమారుని వెంకటాద్రిని ఆయనకు ఇస్తిమి. జితేంద్రియుని మాకులంలోకి తెస్తిమి, గౌతమ మహాబుషి, ఆదిబుషి, ఆయనను తలస్తే, సకల వస్తువులు వద్దనే యుండును, ఆయన మహాదేవబుషి, ఆయనగోత్రం, మహాదొడ్డది, ఆయన మహాబుషులలో కెల్లా ఘనుండు, అక్కడరేపు ఎల్లుండి ఉండేము. జయం జయం అనే జయప్రదం, నాన్యోదక గాయత్రి సకలమైన అక్షరాలకు వేరు, ఈ బర్బరయనే వాక్యము, సకలమైనందున మీద వర్తిస్తూ ఉన్నది గనుక మేమున్నూ ఇలాగే వచ్చి లోకమెల్లా రక్షించేము. నాకున్ను మీకున్ను బంగారుకలశమే కారణము. నానీనూనే అనూరాధను మీరు పుట్టుతూ ఉన్నారు. నాకున్నూ మీకున్నూ ఈశ్వరనారాయణస్వామి అభిషేకము చేసేది. మమ్ము మిమ్ము దేవతలు ఆడిపాడేరు. నాన్యోదక గాయత్రి కారణంబుల మీద సరిగా భాషయొప్పి, భూమిభూముల మీద భుగులు మెరయ. అంతట నన్ను ఒల్లనివారు వత్తురు. కాలమెల్లా కడపి కొవ్వు మీరి నా మహిమ దెలియని ద్రోహులు చీమల పుట్టలు మడిసినట్లు మడిసెదరు. నా వచనశాపంబుల మీద తంగెడుకానుగ వత్తిగతి విశ్వాస ఘాతుకులు, మెరమెచ్చుకు తిరుగు ద్రోహిముండల, నీచగుణాలు,





ఆడేటి వారెల్లా అమృతపుపలుకులు. ప్రాణము రొమ్మున విషమంతరా పద్మాక్షు పుట్టుబడి నాకు తెలుసును. వేద వేదాంగములు పుట్టుక నాకు ముందే ఉండు సర్వోత్తముడు ఎరుగును. మరి మీద ఆనందగురువు తెలియవశమే సప్తసముద్రాల పుట్టుబడి నాకు తెలుసును. నా పుట్టుబడి నాకు తెలుసును. పద్మనాభుని పుట్టుక తెలుసుకోరాదు. మిగుల సర్వోత్తముడు నన్నెరుగడు. అంభోరుహములు నేనెరుగుదును. సంకీర్ణ నాగంబులు సాక్షులు నేనెరుగుదును. అర్ధాన ఆదివిష్ణువు నన్నెరుగు. ఆ విష్ణువుచేత సత్యం తేలును - ఆదేవదేవు అంత్యం తేలును. ఏబ్రహ్మబుషి ఉట్టిపడి నానా మహిమ యేదేవు డెరుగడు. ఆదిఅంత్యం తెలియవశమె? ఆగురుగోప్యంబును నెరుగను. హస్తాక్షివ్రాలు అంత్యంబు తెలియరు. ఈ బ్రహ్మమునులెల్లా యిట్టి భాగ్యము మీద ఘనతమెరయ నిర్మితంబులు, ఏకతమునను ఆకురుపట్నంబులు అడవిలో కలిసిపోయెను. నిజాముల కని ద్వయాతీతుడు భానుడు ఏటగలసె. కొందరు నరులు తత్తుమురులైరి. కర్ణాటకరాజులు కారడవిలో బడిరి. తమభేదవాదులు నిందకునాశనమున మార్గశిరశుద్ధ ౯ లు యుగసంధి. అద్భుతము. విదయచంద్రుని కాంతి కానకపోదురు. సూర్యకాంతి దీప్తి అణగిపోవును. నక్షత్రములు కానకపోవును. ఆకాశమెల్లా అణగిపోవు. శాస్త్రార్థ సమ్మత ఆద్యంతభూములు, శంఖచక్రముల మీద వేగమునను నాల్గుగు సముద్రాల నడుమన సముద్రమెల్లా యెండి పోవును. జలములేక జయాజయంబుల మీద కేశవుని నమ్మినవారిని నిలిపి మరి యుగసంధి సకల నవమిదివసమందు లోకములోని ముఖాముఖుని మీద నాస్మరణ తలచిన మానవలసె, కులములెల్లను కులము ఏకమాయె. కులాభిమానము నష్టమొందె. మార్గశిరమాసంబు మీద, మాఘ పంచమి వరకు బ్రహ్మోత్పాతం చేత నిలిచివారెల్లా కాలమహిమ చేత ఇరవైనాల్గు అక్షౌహిణులు మడచును. నిలిచిన పది అక్షౌహిణులు నైమిశారణ్యమున నాడు పరాశక్తి చేత ఆర్తినొందు. శ్రీ గురవే నమః

తాను వీరధర్మజుల ప్రకాశ జయ సంవత్సర ఆషాఢశుద్ధ౯లు ౭ లు ౮ లు శంబళ గ్రామమందు శుకజన్మస్థాన ప్రకాశ రాజ్యాభిషేక విశ్రుత వీరకీర్తి ప్రతాప నాగేంద్రభూషణ, నాగేంద్రవాహన, వ్యాఘ్రాసన, వ్యాఘ్రచర్మ ధర గరుడవాహన నాగాంతకో విష్ణురథ, అశ్వస్వారిమార్గ విధువానుచోపుదారు వశాలు. కబురువారు దిగారు కుందుదారు నారద సనత్సుజాత, ఏకముంజకీర్తి, విశ్వవిహార- మతాచారులు

మమరాజ్యానికి ప్రవేశమయేటపుడు, వారిని చోవుదారులచేత, కొరడాలపాలు చేయించెదము. అశుభ్రమతములెల్లా శుద్ధపాలుగాజేసి, శుద్ధమువారిని నిలిపేము. చిల్లర మతముల శీఘ్రముగానే మింగిని. నాభక్తులే శ్రేష్ఠులని, వినాయకుడు, శివుడు మెచ్చియిచ్చిన కులభేదముపట్టి కురంగానకుంభినీ పాతకము పట్టీని. శాలివాహనశక వర్షంబులు ౧౬౯౩, అగునేటి పిప్పలాయనసంవత్సర ఆషాఢ శుద్ధ౧౦లు ౮ లు మీద నిశ్చయము. నిశ్చయమని చూస్తూ ఉండేది. ఇదే జీవ సుందర ఔషధక్రియ, ఇదే ఐశ్వర్యం ఇది మితిదప్పిన, కాశిలో గోహత్యచేసిన పాపాన బోదును. ఇదే మృతసంజీవని ఫీంకారశబ్దము నేను కలియుగంబున బ్రహ్మత్రికుమార రాజ్యాధికులంబున బుట్టి, నాముచ్చటలు నాకే తెలుసును. నేనే తెల్లకోకలు గట్టితిని. గంధకస్తూరి పరిమళాద్యలంకార పూజార్హుండ నైతిని. కుమారా అటుమీదట బాలత్వంబు విడచి, పదులు మూడు పంచకాలు ఒకటి మాసాలు పదింటిమీదట సన్యాసి వేషంబుచేత చాలగా ఉండేది. మతాచార్య వ్యతిరిక్తము. మాస్వరూపాలకు శ్రేష్ఠము. ద్వైతనాట్యము ఇది అతి రహస్యము. ఇది పూజా ఫలంసంజ్ఞ, ఇది క్షాంతరాళము. ఇది తమిస్రబోధ గంగోత్తుంగ ఫాలాక్షసేవ్యం, ఇది ఛందోబద్ధమైన సాంద్రసింధు వేదములో మొదటి రంకువు నాగపాశాంకుశం. శ్రీ గురవే నమః

సర్వమంత్రయంత్రతంత్ర భేదనాభేదన వీరప్రతిజ్ఞ పాశాంకుశం శ్రీ గురవేనమః అజాత గురుపాదపంకజం. అజాత వీరక్రమమున వేద విజయ శ్రీరంగా వీరసింహాసనమునను నన్ను నమ్మిన పుత్రుని సర్వాంగముల మీద చంద్రకిరణంబులు, రోమకూపంబుమీద ఆబుధ ఆదిత్య శ్రీరంగా శీఘ్రం శీఘ్రం మీదను నా ఆత్మపుత్రుని శ్రీరంగ వేదాంగ వేదమెల్లి వీరాంగం కిందె. ఆదిదేవ మహావిష్ణువు ఆదిభాస్కరుని, చంద్రుని బీజాక్షరములు, శన్నోదేవి ఆనందగురు, ఆద్యంత వారాధిపతుల నాదేగనుక పంచభూతాలు లేవు గనుక శ్రీలెల్లా అతనిదే స్వరూపము. పురుషులెల్లా నాస్వరూపముగ, నరజన్మము ఇస్తుము. పూర్ణాయువు ఐశ్వర్యం ఇస్తుము. అబ్దపున్నమమీద ఆనందగురువు రక్షించును. జనులకెల్లా బీజాల బీజమాసము పంతాలకెల్లా పట్టు అయినది. కేశవుని వ్యాసులు చుట్ట పెట్టినట్టులనె వైశాఖం కప్పదు. తప స్వీకులమైన సరులు జాహ్నని వెనుక కృతార్థున్ని చేస్తిమి. నాపేరు ఆద్యంతము మీద ఎరుగ చెప్పితిమి. శుద్ధ౨ లునాడు, ముడియం వారి



యింట్లో పూజ శుద్ధ౭ లు నాడు యమ్మనూరులో పూజ శుద్ధ౨ లు నాడుఇంజేటిలో పూజ శుద్ధ౭ లు కైలాసంపూజం సమ్మతంబు సాంగమనే పేరు గలుగను, ఏ బుధవారమున త్రయోదశి యందు ఇచ్చిన నమ్మిన భక్తుల మీద ఈమాసంలోనే అన్నపూర్ణ మహిమ, ఆదిత్యకులమున బుట్టి అమోఘంబు ఆపదుద్ధారక ఆనందమునను కలికిరూపంబు గానంగవశమె. శంకప్రతిష్ఠశాస్త్రంబు భృగువార నామములు భూమి భారముచేసె. ఇందుకు ఇప్పుడే ఇస్తిమి. ఆత్మసుజ్ఞాన శ్రీరంగా రామధర్మజులు వచ్చి దృష్టాంతము చూపి, పూర్వార్జితమనే పుణ్యము నెల్లను దుష్టులెల్లా ధ్వంసముచేస్తూ ఉన్నారు. ఈప్రొద్దంతా వీరభద్ర భద్రకాళి మొదలైన దేవతలు మాకు పంపు. ఆదిత్య దేహంబుమీదను శ్రీవెలయు వేదాంత సిద్ధియగు. కాకను శ్రీవెలయు శ్రీరంగా సిద్ధియా శ్రీరంగశాయి ఇస్తిమి. కంఠమలకంబు ఇస్తిమి. ఇప్పుడే ఇస్తిమి. పచ్చలగుజ్జాన్ని ఇస్తిమి. పల్లకి ఇస్తిమి. నేటినుండి సర్వము దిగ్విజయము. మామహిమలు తెలియదరమె, ఆజోనిరంజన, అధర్మంగా మార్తాండ జనార్దన శ్రీరంగా ఇది నాతో ఇష్టముచేసెను గనుక అంగీరస సంవత్సరమేగురిన్ని ముద్దుగురి, బాలగురి, ఆషాఢమాసమున బాలగురి ఆషాఢ మాసమున ఆర్తి ఆర్తుల మీద సర్వదా యీ మహిమ, ఆషాఢమాసముననే జయం, ఆషాఢము మీద దానివల్ల పుట్టిన కార్యాలు ఆనతిచ్చేము. ఆధ్యానమైన ఆనందగురువులే గురువుల, ఆబుధవేదంబులు అంతయు నిశ్చయము. ఆమీద రామమాసమున గంగాగౌరి స్వతంత్రత కనబడేది. నిజము గలుగును. అబ్బురము ఉపనిషదము, శాంతింకరోమి శాంతిః. మలయమారుత సోమసూర్యాగ్నులను వాగ్మితో గంగేశు పాదమాన త్రిభువనంబు లెల్లా జయజయధ్వనుల మీద దేవదేవము ఇస్తిమి. మార్పు లితరంబుమీద , ఆదిఆదికేశవునికి ఆర్తిమీద సుకుమారహాస్యంబు శుభముశుభములమీద, ఏరంగశాయివై ఆర్తిమీద బంగారు దేహంబులు బ్రాహ్మ బ్రాహ్మ్యముల మీద అశ్వ పూర్వంబులు, ఆర్తిమీద వీరజతమతంబు, విజయ విజయంబుమీద నారాయణాత్మకవచము, చతుర్దశ భువనంబుల మీద దివిభువన మర్త్యలోకంబులు, జగత్రయంబుల మీద వేదాంతములో రహస్యము, అజాత గురుమంత్రము మీద వేదవేద్య విక్రమ శ్రీరంగారామా విరసము మీద విష్ణురజసముమీద రుద్రుడు అశ్వోత్తమ రసములను నాభుజమున శక్తి,

సాహసధైర్యములు, విక్రాంతులు మహిమ విక్రమమున విజయ విక్రమ దేవవిష్ణు శాంతాత్మ ఉభయకోటకు, ఇమ్ముదిరాయని తొత్తు నన్ను నమ్మిన భక్తులను వీరికి పారుపత్యము ఇస్తిమి. లింగయ్యకు బనుగానుపల్లె పారుపత్యము ఇస్తిమి. అద్వైత వీరవిజయంబుల మీద విజయమునను సందేహములు లేవు. పున్నమమహిమ, కలిదోషకాలమెల్లా యీవేళ పున్నమవరకు కాణయాచి, అంబీజమహిమచే సప్తాశ్వభాస్కరు సాక్షిగాను సూర్యనందీశ్వరుని సన్నిధానమందు పున్నమదినం. విజయ వీరంబులు వీర విజయములను, అవ్యయ అగమ్య ఆత్మములను, యేవముల మీద, సర్వశాంతములచే విష్ణువీరంబున విజయమునను భూర్భువ స్సువరో మితి దిగ్బంధః వీరధర్మ ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః ప్రాగ్దక్షిణపశ్చిమాః ఉత్తమాః భూ ర్భువ స్సురవరో మితి - శాంతిం కరోమి శాంతిః.

విష్ణుకేతనములు వీరవివరముల మీద అబ్దసప్తమినాడు ఆర్తి మెరయ ఉదకం కద్దని, ఉబ్బి భూజగమెల్లా సాక్షి భూతములమీద, సూర్యనందీశ్వరుని త్రిభువనంబులు, వీరభద్రము మీద పాముమీదనున్ను చూపినాము. పక్షీంద్రుని కేతనముల మీద, ఉన్నవరకు భద్రముగా జాతిజాతముల మీద జగజగములమీద ఆపదుద్ధార బ్రహ్మము మీద సందేహము లేదు. సర్వదాపున్నమ, సద్యోపవాద మనే నాదము ఇస్తిమి. శ్రీమన్ మహామహత్వము, ఈలోపలనే ఇస్తిమి. సిద్ధాంతమెల్లా కానబడ దెల్పితిమి. నాభుజబలశక్తి ఇస్తిమి. సామ వేదమున చదివిన రాగారాగాలు సన్యాసులు పాడీని. ఈశాన్యము నుండి పటమట, సూర్యమందు ఉద్భవమవుతూ ఉన్నాము. ఆశంబర శక్తి ఆయుస్సున్ను, ముందు కార్య వివరము జితామిత్రుని వివరము, అసమసాహసవివరము అచ్యుత అనంత రంగా దుర్గాధ్యక్ష శ్రీరంగా, దూరవార్తల శ్రీరంగా, సుజ్ఞాన శుద్ధి శ్రీరంగా, జాత స్వరత్నము శ్రీరంగా, దేవశ్రీరంగా, నాథేశ, ఆదవేణిలో, మహోత్సవము. అంబుజ నయను మహిమను, ఆ మార్గశిర పున్నమును, బీజాక్షర మంత్రంబుల సర్వ దేవత్వము సర్వసర్వము ఇచ్చె. ఉద్దండవీర విజయంబులు మెరసె, సన్యాసివేషంబు సంతోషములు మాన్పు ఆ మహాదివ్య దేహంబు ఇచ్చె. గుత్తిపెనుగొండ బెబ్బులి జొచ్చును. ఆ మార్గము మీద నడచి మరియు అమరదేవత్వము రంగా, అర్కసన్నాహ సంరంభంబు అదేకేంద్రార్తి మహిమలు, పద్మాక్ష నామ సాహసము, వీరధర్మజు పేరు ఇచ్చి కించిత్తు తప్పులేనట్టి,



అంబీజములను అంగసంగములను అద్భుత భోగంబులను ఇచ్చి యేలినదేవదేవోత్తమరంగా, పదహారువేల పుణ్యములమీద గుడిగోపురంబులు దేవదేవునిమీద, ఏపార సాత్వికమే మెరయంగా, భోగముల మీద, విజయాత్మక వీరధర్మముల మీద, బాపు వెంకటనాథు కృతాత్మకు, పూజవేడ్కతోడ, ఆమీద నాపేరు ఆదేకేశవవంటిని, రామధర్మజుల యేలుబడి మహిమ సిద్ధాంతశిరోమణి నిర్ణయము. వేదాంతము ఆదివిష్ణువిధి అచ్యుతుండనే పేరు రెండవది ఆనందుడనే పేరు మూడవది, సర్వవేదమంత్రాలు ఈప్రొద్దు మొగిసెను. దృష్టాంతమనెడు దృష్టము ఈప్రొద్దే కనబడీని. తిరుమణి తిరుచూర్ణం తెల్లకోకలు, భోజనము, ఇప్పుడే కనిపించేము, విష్ణుమార్తాండ మహిమలను మించి ఈ జగత్రయములను మాకుమారుని మహిమ అజాత బ్రహ్మంబు ఇచ్చిన వారికే ఈచామరాకారము ఈపద్మ మణిమయము. అర్ధాసనంబు పూజ్యమిచ్చె సమస్త భోగంబులను ఇచ్చె. ఉద్ధండవిజయ విజయంబులపేరు ఇచ్చె. అజాతగురువు భోగంబులు ఇచ్చె. వీరధర్మజపుత్ర మార్గణమూర్తి, ఆది కేశవుమాడ్కి ఆదిదేవతలకు నాపూర్వపూజలు ఉన్నతము మీద మద్గుణ విశేషంబులు మాన్యమాన్యములచే మిథున మిథునముమీద వీరనారాయణ విక్రమమున గుణగుణాత్మకములు, కార్యకార్య మీద వీరవీరము మీద వీరశాంతంబులు వివరమునను అబ్దకలివేగము ఆవరకును కర్పూరహారతులు కరుణకరుణలమీద, హేరామా యింటికి పద రాజాత్మా ! హే సర్వదేవాత్మా! హే రాఘవా, గరుడవాహనుకన్న ఘనతతోను శంఖు చక్రములచే త్రిశూల డమరుకము, సమ్మోహనాస్త్రంబు నారాయణాస్త్రంబు, హయమూర్తిమిగుల ఆనందమూర్తి గురుపాదాల కృపచేత ఆర్తిమిగుల ఆదిలక్ష్మికృపను, మా ధర్మకాలమెల్లా యేకాక్షరము మీద నడిపించుమని తెలిపి అందుండి రామధర్మజుల మహిమ పశ్చాద్భూమి మథఃపురం యత్పురుషేణ హవిషా, అనే వాక్యముచేత అదివీరధర్మజుని పాదాలకు మ్రొక్కి పద్మాక్షనే పద్మ సంభవమనే మంత్రముచేత, సూర్య సామర్థ్య సంతోష సంభ్రమము మీద ఓంకారమేక మేకమయం సమక్షీరము పక్కి దేహంబుల మీద కరుణాకరముల మీద కుమారుదేహములో ఉన్న పిండము నోటిలో రంగా అంత ఊహించంగా, మలమూత్రము లన్నియు. అపదుద్ధారకము, అర్థము మీద అజునాత్మ అబుదంబు అబ్దఅబ్దము మీద ఉదాత్త ఉదయంబు ఉదర ఉదరము మీద,

ఉత్సాహభోగంబు ఘనత మీద సర్వదా యీ మంత్ర ఆత్మము మీద అపూర్వ వచనంబు ఆత్మ ఆత్ములమీద ఆ బుధవార ఉదయంబు మీద ఆక్షణమేవత్తుము. ఆర్తి మీద సన్యాసివేషంబుమాని, పుత్రుండై ఆ జాహ్నవీపుత్రంబు ఆది మధ్యముమీద, అజాహ్నవీవుబ్బు ఆదిజాహ్నవీ షడ్గుణైశ్వర్యభోగంబు మీద, పంచప్రాణంబులు పరాశరాత్మకము, పద్దుమెరసి, భోభో బోగ భువన, ఆత్మ దేవదేవ భోబో అబ్దకలియాత్మ, బ్రహ్మాండముల మీద, భద్రభద్రములచే సర్వేశు అనుమతి గనుక మెరసి, ఆర్తిమీద లేఖల మహిమ. భూమిలో ఉన్న ప్రజలందు, ఒకప్రతిమలోపు అదే నారూపు అంతయు జూపితి. అందుకెదురుగా నా దివ్యమూర్తి అందుకు పూర్వ పశ్చిమోత్తర దక్షిణాలమీద హనుమంతుండు ఉండే అంబీజ వృక్షము, జాహ్నవీపుత్రి, అప్రతిమ దీపాలమహిమ నేను అందుకెదురుగా శ్రీగురుమూర్తి, ఆశ్రితలోకమందారా, దేవాదిదేవా సర్వేశ్వరా గంగోత్తమాంగ, యాగంటి ప్రదాన గంగేచ సర్వేశా, భృంగీశ, నాట్యభూషితా, జనలోకరంగ, తుంగబుధజనలోల శ్రీరంగ, భూషితాంచితలోల, దేవాదిదేవ, సర్వేశ, సరస సరస రజోలోల, సాష్టాంగ దండధారణ, గణప్రాణ సేవ్య, శరణంటి, అంబ అంబశేషాహి శంకర పూజితా, ఓ అంబా సురసేతు, ద్విపకుంభ వికారి గురుతు. సేనాధిపతి గురుతు శ్రీరామా గురుతు ఘంఘణధర ఘనతవీరయోగి, నీఘనతచే ఘోషించు గంగా, శ్రీయిది వీరబ్రహ్మయోగీంద్రుడు చెప్పిన పత్రిక, సాక్షాత్తు శాంతోదాంతము, పన్నీరు పావడ మెరసి, ప్రమాణ మహిమలు పాదాంగుళముమీద విజితవేదాంగ వేదంబుమీద అశాంత, ఆగమ, ఆనందముమీద బాగుగాశాస్త్రంబున, భద్రభద్రము మీద, అశ్వని, భరణి, వృషభరాశి జేసి రుక్మిణీ కల్యాణ వర్తిమీద, బసువాత్మ, బసవేశు అన్నపూర్ణముచేసి, ఆత్మభోగంబున ఆత్మమెరసి, పంచప్రాణములు ఉప్పులు ఇచ్చె వేగవేగముమీద ఉద్భవము మొదలు ఆర్తిఆర్తి మీద రాజోత్తమాంగంబు రామభోగంబుమీద ఆదినారాయణమహిమ, ఆర్తితో ఈమహిమ శ్రీరామాత్మజమహిమ వైశాఖమాసంబు విదియ భూవలయంబు మీద రాత్రి ఉదయము అయినమీదట భూర్భువ స్సువరుల ఆడిపాడేరు. వేదోక్తముల మీద వేద వేదముల మీద,తెలియ నిమిషముమీద మహాదేవ భాషికము నొసలియందు జీవ కట్లు ముత్యములు, శేషుని శిరస్సు మణులు కంఠమాలలు, ఆది విష్ణుమణులు, ఆదినారాయణ వక్షఃస్థలముల ఆదిమోకట్లు, మొలకట్లు మహాదేవ రత్నమణులు



ముద్దుటుంగరములు, నామహేముద్రలు కాలిపెండెరము, అర్కకాంతిసమము, కాలనేమియను పేరుగల పుష్పకము మీదనెక్కి ఆనందభోగములమీద వింజామరలు ముత్యపుసరులు, గుణింతంబులు, ఆర్తితోను ఆత్మపుత్రుండు ఆర్తి ఆనందమున మద్భోగమహిమ సంభ్రమము మీద ఆజాతమహిమచే ఆవీరధర్మజు ఆనందమునను ఆపూర్ణ పంచమి, అబ్దగురువారమున కాంభోజ కరహాట భూములందు వైశాఖ మాసమున అబ్దపంచమి మీద కుమార కేశవుని జాహ్నవిమీద కెరటముల మీద మిత్రవిజయంబుల మీద ఓంనమో వేదాంత ఓం నమో సర్వేశ, ఓంవీరధర్మ, ఓంరక్షక, ఓం సర్వలోకేశ, ఓం సర్వదేవేశ, ఓంవేద నాథాయ వీరాధివీరాత్మచెంత అమోఘ వాక్యమునను ఆరునెలలు ఎల్లించి, ఆమీద దేవభోగంబుల మీద రామధర్మజ, రాజ్య పూజ్యము మీద శుభ్రదివ్యాంబరంబులు ఘనతమీద, రాగాత్మ పూజలు, రాజభోగముల మీద శోభనంబుల మీద ఘనత మీద గుడి గోపురంబులు, ఘుమఘుమంబుల మీద ఆజాతగురుమూర్తి హనుమంతుండు, ఆదికేశపుత్రు నిమిషనిమిషము మీద దివ్యసంతోషంబులు పరాక్రమము విజయవికృతంబు నిముష నిముషము మీద మహాదేవ రాజ్యవైరులనెల్లా నిముషనిముషమున ధూళి ధూళిగా మొత్తెను. క్రోధాక్రోదములచే క్రోధము అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకులైన వారిని పిలిపించేము. అనుతాపంబు ఛేతనే వర్తించేము. అఖిలతార్జవం అప్రతివాణీ పట్టం శ్రీ గురవేనమః.

కాలజ్ఞాన మహిమ, వీరబ్రహ్మము, ఉత్పాతాలు, ఉద్భవమైన నాటికి పుట్టీని అనేను. వివరము నిమిషము వైశాఖమాసము. విదియ భూవలయంబు మీద, రాత్రి చంద్రోదయంబు అయినమీదట, భూర్భువ స్సువరులమీద ఆడిపాడి, వేదోక్తపరులమీద వేదవేదముల మీద ఎవ్వరకి తెలియక, మునులమీద, అవుకువనము వెళ్ళిన మీద, అంభోజ భోగంబు ఆర్తిమీద, మతిమాత్రముల మీద, మతి బహుళంబు, భూలోకాన గ్రామాలు, పట్నాలు, పల్లెలు, వసంతరాలలో నెత్తురువన కురిసీని, పొగ యెగసీని, మేకపోతు వృషణాల చన్నులు బుట్టి పాలు పితికీని, నక్కలు జాము జాముకు కూసీని, కుక్కకూనలకు నక్కలు బుట్టీని పట్నాలలో లక్ష్మీదేవి యేడ్చీని, ఏనుగు గుజ్జాలకు అవయ వాన నెత్తురు గురిసీని. అపవర్షం గురిసీని, సకల జాతి దొరలు నాశనమయ్యేరు. నాశక్తి సాహస ధైర్యములు నిశ్చయము.

ఆయుధానికి నిబద్ధిమీరి, యిదే శాంభవి, అంగాంగముల మీద హరంచేసి పూర్ణాహుతి నాపేరు, సూర్యనంది, అదే గురుసాక్షాత్కారము శ్రీగురవే నమః

పర్వతం మీద ఆరామభోగభాగ్యము మీద సన్యాసివేషంబు సర్వంబు ముగిసెను. శంఖుచక్రంబు ఘనత ఇచ్చె. పండ్రెండవతారముల చక్రము తిరుగుతూ ఉన్నది కదా, అద్యదశమి మీద, పుత్రాపుత్రము మీద, పుత్రరాజముమీద, ఆకారము పదోదగు మూడోయేటను, రొమ్ముకిక్షియు, నాల్గోయేటను, జంఘము బుట్టి పూర్ణమాయెను. వనరుల మహిమచే ప్రభవించెను. కుమారవీరధర్మజు అజాత వీరధర్మజామాన్య మీకు సంపాతు, అని సంధ్య జపేవినియోగః.

వీరధర్మజ మేకోమయం వినియోగః పంచశక్తులతోటి భూమండలం సాధ్యం కరిష్యే. అజాతగురుప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః సాక్షాత్తు రామ ధర్మజమూర్తి మహిమచే ఆర్తిని సంతోషంబు, ఆదినంబులమీద, పద్మ కంఠంబునందు బుట్టిన పుత్రుని విదియచంద్రుని బోలు, మద్భక్తి మహిమచే, వీరధర్మజుని సేవజేసిన వారిని. అంభోరుహంబులు ఆర్తిమెరయ. పంచాత్ము రంగేశు, రాజ్య మంతయు ఇచ్చె. శుద్ధంలు ఉదయమునకు. యాభైఆరు రాజ్యంబులన్నియు, గట్టి నిమిషమున దుష్టుల మొత్తివేసీని. కాశీ రామేశ్వర కారణంబుల మీద దుర్జనుల రూపు నాశనంబు చేసి, రాజ్యంబు లన్నియు రాజాధిరాజుల నిమిషమున భస్మీకృతంబు జేసి, కావేటి ఘనమహిమ జయము జయము మీద అరణ్య వనవాసమంతయు వెళ్ళెను. సాక్షాత్తు నామహిమ ఆర్తిమెరసి, జితేంద్రియుని తల్లివచ్చెను. ఆదిత్యమే మహామయం. వేదాలకెల్ల సాంద్రసింధువేదం అంధాతు పరంధాతు అని ఆదివాక్యమే కారణము. పక్షం పక్షం మయం మయః పక్షమనగా శుక్లపక్షము, మయం అంటేను మాజష్ఠ అనే మాధవభొట్లు, యా అంటే యజ్ఞశాలలో యాగంచేసీని. యాగంచేసే దివసం సర్వానకు పంచమే కారణము, అని ఆనతిచ్చినారము, రామధర్మజులకు పంచమే కారణము, అని ఆనతిచ్చినారము, రామ ధర్మజులకు పంచమేకారణము, మీకు మాకు ఆనందాశ్రమముల పట్టపు వనమే కారణం. ఆనందాశ్రమములు పంచవేదము నకు ఆదిదేవత. సర్వపుండరీకాక్షుండైన పురుషోత్తమునకు పంచమే కారణము. సర్వం నారాయణానుమాసం అనే మరుగు, నారాయణ మాసమంటే చైత్రమాసం



కేశవ మాస మంటే వైశాఖమాసం మాధవ మాసమంటే జ్యేష్ఠమాసం చైత్రమాసం, మేషం నారాయణ మేనల్లునిది. ఇంద్రుని వాద్యం డోలు, నాగ స్వరాలు, ఆదివిష్ణు వాద్యాలు రామధర్మజుల బిరుదు భేరి, మూడు యోజనాల నిడుపున్ను, యోజనం వెడల్పున్ను భేరి దేవతామృగాలైన గంధభేరుండాల చర్మం సోకితే మున్నూటయాభై యోజనాలు వినవచ్చును. ధవళాలు అష్టకాలు పాడేవారు కోటానకోట్ల స్త్రీలు పురుషులు సార్వకాల సామ్రాజ్యం అర్బుదాలు కాల్బలాలు, గుఱ్ఱాలు, ఏనుగులు, అనంతాలు, కామధేనువులు కల్పవృక్షము, చింతామణులు వెంటనే వస్తూ ఉన్నవి. ఇంద్రుని వాహనం ఏనుగ ఉచ్చైశ్రవం, రంభ మొదలైన నాట్యస్త్రీలువెంటనే వస్తూ ఉన్నారు. ఈ స్త్రీ ఒక్క ముహూర్తముననే కట్టేము. ముహూర్తమనగా రెండు ఘడిలయలన్నర, ఉత్తరానకు మూడువేల మున్నూరు ఆమడ ఉండెనా, నా చెంగల్వకోట చంద్రలోకమట తూర్పున మున్నూరు ఆమడ ఉండే వెలయపురి దక్షిణాన మూడువేల మున్నూరు ఆమడ ఉండెనా, అన్ని యిస్తిమి నాన్యోదక గాయత్రి ఆనందాశ్రమములచేత బ్రహ్మబీజాక్షరాలచేత మంత్రోపదేశము ఇస్తిమి. శాంతి. కరోమి శాంతిః

ఆదినారాయణ మూర్తి ఆనతిచ్చిన వాక్యం. శంకరుడు మార్కండేయునితో అన్నమాట వీరప్పయ్య, వేదాద్రి, గరుడాద్రి యందు తపస్సు శాయగా నేను పోయి ఉంటిని. నాకు అనేక పూజలు చేసి ఉపచరించెను. అందుచేత ఈయనే నాకన్నా ఘనుండు. నాన్యోదక, గాయత్రికి ఈయనే అర్హుండు అంటిని. ఈయనే వేదానుద్ధరతే అనే వేదపురుషుడు. అప్పుడు నాలోను ఏనుగులు ఎనుములు, మేకలు, గొఱ్ఱెలు ఇవి అన్ని ఊర్జితమై యుండీని. లొట్టిపిటలు గార్దభసూకరాలు కుక్కనక్కలు, పులియెలుంగులు, చీమదోమలు, తేళ్ళు ఇవి మొదలైనవి. నాశనమై పొయ్యేని, వ్యాధులు కట్టుబోతులు, చాడీకాండ్లు, కొండెగాడు, జూదగాడు, నాశనమయ్యేరు. ఇది ధర్మరాజు రాఘవుల యేలుబడి సామర్థ్యమున సద్యోఘృతం, పాయసం భోజనము చేసుక ఉందురు. పిల్లి, యెలుక, కొక్కు, ముంగిస నాశనమై పొయ్యేను. శాంతాకారమైన స్వామి రాజ్యం ఏలేవివరము ఇది. దినవార్తలు, రేపు ఆనతిచ్చేము. నారసింహస్వామి నాకు, నానా దేవతల కెల్లా కారణకర్తకాగాను, గాయత్రిపరంతప, అనే గాయత్రికి దేవత కాగాను, సర్వలోక ఆదిమూర్తి కాగాను, బ్రహ్మాదులకు కానివాడు

కాగాను, దేవేంద్ర దేవతలతో నిగ్రహించిన, రాక్షసుల కొట్టివేయగా, సింహమనే పేరువచ్చెను. కోపమై ఆరూపమైన స్వామి కాగాను నరసింహం అయెను.

అచ్యుతుడనే నామానకు వివరం, ఆడితప్పక, పలికి బొంబకని స్వామి గనుక, ఎన్నిటికి శరణులేని వాడుగనుక, కడలేని ఆయుస్సు కలవాడు గనుక, చలనంబు లేని స్వామిగనుక అచ్యుతుండు అయెను.

జనార్ధను డని పేరు వచ్చిన వివరం. జన్నావుల పాలుద్రావెను గనుక, జగన్నాథుండనే బ్రాహ్మణుని బిడ్డను పెండ్లాడెను గనుక "రామే రామే రమే యంతి. రమ్య మనో నవశ్రేయః కేవలం ధన్యమేయంతి ఆదివంశ సముద్భవం" పంచాంగం. పరతే నిత్యం పంచమికె పోతూ ఉన్నది. సాంద్రసింధు సమం వందే, కల్పకోటిశతై రపి, సద్యుక్తమద్య మాత్మానో బ్రహ్మమేక మయో యమః కోటి జన్మకృతం పాపం, బ్రాహ్మణో దివసాం త్యజేత్, ఆదిభార్గవమే రాజ్యం. భాద్రపది మాసపూర్ణిమః/ సద్యుక్తమెల్లా తీరెను. ఇందు ఇందుకులం వందే యీరేడు భువనత్రయం/ నందిగ్రామేతు విఖ్యాతు, నందినాం సూర్యనందినాం, ఇందు అర్థము. రౌద్రసప్తకమందు, రామరాజు అనేవాడు శ్రీం, శ్రీం, శ్రీం, శ్రీం,శ్రీం జయం.

# షష్ఠాశ్వాసము

శ్రీమద్బ్రహ్మాండభాండ సూక్ష్మాండ లక్ష్యసూత్ర సమరస మహావాక్య లక్ష్య సారాచార గ్రహణ చాతుర్య చతుర్విధలక్ష్య పరమార్థసంచార నిష్ఠా గరిష్ఠ షడ్విధయుక్తి సాధన సూచిత సర్వశ్రుతి తాత్పర్య విరాజమాన సర్వాధిష్ఠానైక స్వరూప శ్రీగురుసార్వభౌమ శ్రీ గురుచరణ దక్షిణభాగమందు రాజకూపము నివాసము చేయు గృహస్థాశ్రమమందు నారాయణగిరికి ఉత్తరమందు మేనులేని కొడుకు, తల్లి మగని మరది, అన్నతండ్రి ఉదయించినాడు. ఒకమీనుగ దొరసాని గల అగ్నిబీజంబులు నాల్గింటిలోను మొదలుతుద సాలగ్రామ స్వరూపులైన నాభక్తులైనవారి సముఖానకు అగ్నిబీజంబులు నాల్గింటిలోను తుదలు పర్ణశాల నామం గలవారు. సముఖానకు వ్రాసిపంపిన లిఖితము. ఇక్కడ మేము సకలమైనవారున్ను ఈ సంవత్సర తిదిని, సూర్య సంభానువారం వరకు శ్రీ గురుస్వాముల కటాక్షం వల్లను, బహ్మానంద సుఖస్వరూపులమై ఉన్నారము. తమ ఆనంద సుఖసామ్రాజ్య వైభవములున్ను, వేళవేళ వ్రాయించి మాపరామరికె తీసుకు మమ్ము తిరగి సదా చూస్తూ రావలెను. మేము త్రికోణమార్గమున పడిరాగా ఒక విచిత్రహంసను జూడ కంచికుంభకోణం మధ్యం ఒక స్త్రీ లేదు. ఒక పురుషుడు లేడు. పుట్టుగొడ్రాలు తల్లి చచ్చిన మూడు దినాలకు కుమారుండు పుట్టెను. వాడు పుట్టినపుడు పట్టపగలు చుక్కలు నడిరేయి సూర్యు డుత్పత్తి ఆయెను. మేము వార్త విని ఆనెగొందిమీద వెళ్ళి ఊటుకూరు దాటి మెలకసీమ జొచ్చి ఈశ్వరము భేదించి, శూన్యాంతమందు నిలిచి ఉండగా ఉత్తరమందు ఉరిమి ఉరిమి దక్షిణం ధగ పొగలై ఆకాశమందు మేఘం బట్టి మించి మించి, ఉరిమి ఉరిమి పిడుగుపడెను. అప్పుడు అష్టదిక్పాలకులు తల్లడించి అల్లకల్లోలమై దేశాలు తల్లడించి, ప్రజలు పరాభవమై, రాజ్యాలు రాష్ట్రం విడిచి, తల్లి బిడ్డను కానక బిడ్డ తల్లిని గానక, యీలాగున నష్టమై నప్పుడు నేను ఒక్కడనే నిలిచినాను. దిక్కు లేని వాడను, నేను పాపాత్ముడను. నీవు ధర్మాత్ముడవు, నాకు

ఇక ఎవ్వరు లేరు. నీకు జీవత్వమున్నది; లేదు. నాకు నామంబు లేదు. నీకు రూపంబు లేదు. నాకు కులము లేదు. నీవు నేను ఇద్దరమున్ను, ఒక్క అమావాస్యపున్నమ కూడిన దివసమందున్నూ, ఉదయాస్తమానాలు లేని కాలమందున్ను తల్లి బిడ్డలకు, అన్న చెల్లెండ్లకున్ను అత్త అల్లుండ్లకున్ను శ్మశానమందు లగ్నం నిశ్చయము చేసినారు. మురువుగా ఈ ముహూర్తం కన్నుల చూడవలసి ఉంటే శ్రీరంగం నుంచి కాశీపట్నము జేరి, సుబ్రహ్మణ్యమునకు బోయి పర్వతానకు వచ్చి అహోబిలమందు నిలిచి నన్ను ఏమరక నిరంతర సుఖస్వరూపుడవై యుండవలెను. నిన్ను జూడు నీ ముఖంబు జూడు నీ భవిష్యంబు చూడు. నీవు అడిగేది చూడు. నీవంటి పాపాత్ముని నీవంటి అప్రమాణునికి ఈవిచారం వ్రాయగలది యేమి ఉన్నది, నీవు సర్వజ్ఞుడవు. నేను అనంతుడను, అయిన ఈ ప్రకారం వ్రాయవలయును. చీమ, మర్కట, విహంగ, కుక్కుట, శ్వాస, గజ ఈఆరున్ను గుణధర్మాలు. గురు తెరిగి నన్ను ఏమరక నైన బ్రహ్మ మందు గలిసి బ్రహ్మానంద సుఖ స్వరూపుండవై యుండవలెనని ఆశీర్వాదములు చేసి, పంపించిన ఆశీర్వాద లిఖితము.

కురుపట్నంబులును, తుళువ పట్నంబులును భూమి సకల సమృద్ధి బొంది యుండును. ఆ రాయపట్నాలవారు మాఘమందె నష్టమందిరి. అటుమీద రామరాజు సింహాసనం బవలంబించి మాఘమందే పోయెను. తర్వాత రాయపట్నాలు తీసివేసిరా అని పలుకబడెను గనుక ఆ వర్ణసంజ్ఞ గలవారు కడకాగా రాయపట్నంబులు తీసి వేస్తిమి. అటు భవిష్యద్వర్త మానంబుల, కందవోలు తురకలకు ఇచ్చి శతతారాగ్ర ధర్మచరణం రాజుమూల చేరి మాఘమందె పోవును. అతని నుంచి ఆవంశాభివృద్ధికి అనూరాధ మొదలు పలికితిమి. పాలెం ధ్వజారోహణ పర్యంతము నిలిపితిమి. చిన్నసాని తిమ్మన నుంచి వాని వంశ మణగును. మట్లవాడు గుండుపడి చచ్చును. చలమచలమలరెడ్డివారి వంశము నష్టము బొందగలదు. ఆనెగొంది నుండు రాజుల అనుక్రమాన దురాచారం గలిగి దుర్జనుల గూడి బ్రహ్మహత్యా ఘాతుకులై స్వజనహింసాపరులై పరస్త్రీ పరద్రవ్య చింతనులై యితరముగ మొగల్ వారిని అనువర్తించి 'బహులేమి' జెంది సామభేద దండోపాయంబులు వహించి అర్థ సత్యం బొంది, సన్యాసులై నిలుతురు. చంద్రతారాచతుర్థ వర్ణ మందు యథా రాజా తథా ద్విపాదమందలి వానిచేత నందేల పోవును. వారి యందు-అంశ, ఒకటి రెండు



ఒకటి బహుళమై నడచును. జీవనక్షత్రంబుల శని సంచరింపగా పూర్వీకులైన నందేల యేలే అవుకురాజు అపరాధీనులై౨ యేండ్లు ౧౧ నెలలు ఆస్థలం ఏలుదురు. ఈ మధ్య వర్ణతాత్పర్యం పొంది పోదురు. కిరాతకులు ప్రబలం. రాజులు ఏలిన రాజు ఆదవేణి కందనవోలు ఏలిన అయిదో వర్గునందలి తృతీయ వర్గత్రయం పేరట తురకనాశం అయి రాజ్యభ్రష్టత్వం పొంది పోవును. భూకంపం తోచును. సూర్య సోమమండలంబులు ధూమాకారం పొంది ఉదయమవును. మరిన్ని మఘనక్షత్రమందు విజాతిపురము గోలుకొండ అశ్వపతివారు కట్టుకొని ఆనగరాలలో చెల్లు దేశములకు హానిన్ని, రాచూరులు చేరి చెఱతురు. విభవమందు రాచూరు కందనవోలు ఆదవేణి దుర్గత్రయాం బోవును. కందనవోలు ఏలినవారు కటుంబము సహాగాను శ్రీశైలప్రాంతము జేరి క్రమాన నష్టముబొందుదురు. ఆదవేణికి వచ్చిన అఘపరుడు తిరుగడు. ఆకాశము అరచును. అడవులకు ప్రజలై చెడిపోవుదురు. అనంతశయనులు పయనము తర్లుదురు. వరద రాజులు వీడి తరాలు సామాన్యం అహూబిళము, మహానంది శ్రీశైల మందు అభిమాన దేవతల మహోత్సవాల క్రమము తప్పును. మొదలు యాగంటి యందు రెండో పర్యాయం శ్రీశైలమందు గోవధలు నడచును. జింకాపురం శ్రీశైలమును మొగలివారు చెఱతురు. హస్త,చిత్త,స్వాతులందు శని సంచరింపగా భీమరథి లంకా మలయాచలంబు ఉత్తర దక్షిణాద్యంతంబులుగ శ్రీశైలము విరూపాక్షంబులు పూర్వ పశ్చిమయుతంబులు గాను, భూమండ లంబులు క్షామశాంబరంబులు బొంది, ప్రజలు శాక పాకంబులు గొని బహు రోగంబుల సమయుదురు. అతివృష్టిచేతను అనావృష్టిచేతను మూషికంబుల చేతను, మిడతల చేతను స్వచక్రపరచక్రంబుల చేతను, భూమి ధరించగా, అరణ్యభారం బొందును. సప్తావస్థల సస్యాధులు ఫలింప నష్ట మౌను. వర్ణాశ్రమ ధర్మంబులు నష్టం బొందును. గండికోటయందు, అత్యంత వర్ణాలవారు ఒక్క తావున పానాలు చేయుదురు. స్వాతియందు సంచరించిన పదమూడు నెలలు పదిదివసాలు పోగాను, అశ్వపతి శరీరం నష్టం బొందగలడు. బ్రాహ్మణులకు మతివిభ్రమం గలిగిని. తమ రాగల రాజులెల్లా వృద్ధి బొందుదురు. రాచశూన్యమైన దేశమందున్న దేవ బ్రాహ్మణులు వృత్తి శూన్యులై మొగలివారలచేత, దండహింసల బాధలబొంది, విదేశీయ గతులగుదురు. దుర్దశల బొందగల ప్రభువున్ను, దుఃఖము బొందిన ప్రజలున్ను,

దుస్థితి జెందిన దుర్గములున్న, పరిపాలింప శక్తులుగాక, అశ్వపతివారు రామేశ్వర పర్యంతం రాజ్యం చెఱచి, రామేశ్వరం చేరి అందఱు తమలో తాము కలహించి నఱకులాడుదురు. ఆనెగొంది జేరి, బహుద్రవ్య నిక్షేప వినాశార్థముల కొఱకు మదమత్సరంబుల బెంచి, అద్భుతంబులు గావించి రణరంగం బొనరించి, ఆమని భోజన మధ్యంబున నిలువక నష్టం బొందుదురు. హతశేషులైన వారు ఆనగరం చేరుదురు. ఈ ప్రయోజ నంబులు, లక్ష్మీముఖపర్యంతం నడచును. శ్రీవీరధర్మజ మునిపుంగవాయ నమః

ఐశ్వర్య ప్రభావంబు సన్యసించెదము, యాగంటి శ్రీశైలమందు తురకలు గోవధ జేసి, నిర్మూలనం కాగలరు. శ్రీశైలభ్రమరాంబిక యందు చెమటలు బుట్టును. కట్టిన పుట్టంబులు చెదలు పట్టును. దేవళ ద్వారంబులు గట్టుదురు. బనగానిపల్లెలో జుఱిగడ్డ వెంకటేశ్వర్లుకు అత్యంత రథోత్సవాలు నడిచీని, ఆ పేటలోపులి చొచ్చును. ఆకోటలో ఉన్న భువనేశ్వరము మీదను ఆలవరి రాజవీథులందును, హనుమంతుని బలము సంచరించి పోవును. ఆదేవుని తూర్పున వేరుమండి చెట్టు పుట్టును. తాటిపర్తి చింతలరాయని దేవళమందు, బూరుగమాను మొలచును. ఆ పరమేశ్వరుని మూర్తి బింబమునకు వికలం వచ్చును. బానుక్కులలోనున్న భేతముచెర్లయందున్న కురుకుంద యందున్న శిరువెళ్ళ యందున్న ఆంజనేయులు ఏడు మనుషుల ప్రమాణం కనబడును. పగలు చుక్కలు కానబడును. ఈశాన్యభాగాన రెండు ధూమ కేతువులు బుట్టును. వినుగొండ బెల్లంకొండ, కొండవీడు, గుత్తి, గుఱ్ఱంకొండ, పెనుకొండ, గండికోట, చంద్రగిరి, యేలూరు, అరణి, చెంచు దుర్గంబులు మారుతోరణం కాగలవు. ఒక భాగమందు రక్త వర్షం గలిగిపోవును. తన భక్తునకు ద్రోహంచేసిన కత్తి తిమ్మడనే పాపచిత్తునకు కుంభినీ పాపం కట్టడి చేస్తిమి. దుష్టాత్ముండైన, ఆకత్తి తిమ్మని మాటలకు పరమాప్తుండై విని రాజ్య భ్రష్టుండైన శతతారా ప్రథమ చరణం రాజు తమకులం పేరిట ప్రణవం గలిగి, శరీరత్యాగం చేసుక పోవునని నిర్ణయిస్తిమి. అశ్వపతివారి చేతి బాధలచే ౧౦ వేలున్న చోట ధ్వజభిందు సూర్య సంఖ్యలు నిలుచును. శార్దూలాదిక్రూర జంతువులు, ప్రజల బాధలు పెట్టును. తరిమితరిమి కరచును. అబ్బలు బొబ్బలు, శతవాది రోగంబులు ప్రజల బాధ పెట్టును. పుత్ర మిత్ర కళత్ర వస్తు వాహనాదులు విక్రయించి ఉదరపూర్తి



చేయనేరక పాపకర్ములు క్షయింతురు. సామిద్రోహులయిన భృత్యులు గురుజన ద్రవ్యాపహారులైన శిష్యులున్ను, మిత్రఘ్నులైన బంధువర్గమున్ను గలిగి గోభూసుర సాధు రాజ బృందంబులు నిర్వహించి రథోత్సవాది సంపూర్ణులై విభవములు కుదురు పఱుతుము.యజ్ఞాది సకల ధర్మంబులు బ్రాహ్మల ప్రసిద్ధి బొంది రక్షింతుము. కమ్మ యలమవారల చరణ జవసత్వంబు ప్రసాదించి తొలుత రెడ్డివారిని నాశనం బొందించిన వీరు బ్రాహ్మణ్య ద్రోహులైన మునుపటి శూద్రకులంబునకు నాలుగోవర్గ సంహరించమన, సందియ్య గలవారము. చేరి వారలకు మహైశ్వర్యమిత్తుము. పూర్వార్థ వర్తమానులగు కోమటివారికి అపజయంబు గలుగును. జారులు చోరులు క్రూరులు అపకారులు, మూఢులకు మేము మిత్రులమై మెలగుదుము. వినుకొండ, కొండవీడు, వేలూరు, చంద్రగిరి, గుత్తి, గండికోట, గుఱ్ఱంకొండ, పెనుకొండ, దుర్గంబులు గుప్తమై ఉన్న బహునిక్షేపంబులు సంగ్రహించుకొని, పెనుగొండను పట్టాభిషిక్తులమై అందులకు మెచ్చి కదలి బ్రహ్మపుర సంవత్సరమున సంవత్సరాలు గల నగరం ప్రవేశింతుము. తన్నగరదిగ్భాగంబుల కల్యాణం నిర్మితంబులైన గురు సంరక్షకులు గావించుచు, మూర్తిమంతులైన మంత్ర లక్ష్మీమయంబైన చౌషష్టిపతిమలయందు శీతంబులయిన యంత్రంబులు ధరియించి తత్వగుణాంతర భాగంబున కుదురుపఱచి సకలవైభవంబులు ఘటిల్ల తత్పట్టణ దివ్య సింహాసనాసీనులమై అందు కదలి బంగారు పురంబు మొదలైన స్థలంబులు చూచుచు ఆదవేని కందవోలు మొదలైన దుర్గమంబులు సంపూర్ణ విభవాలంకార లక్ష్మీ సమృద్ధిగావించిన బనగానిపల్లె విజయం చేసి, జుఱ్ఱిగడ్డవెంకటేశ్వర్లుకు రథోత్సవంబులును సదాశివత్వంబు ప్రజలకు నొసంగి భావనారాయణ పురంబు భూస్వర్గంబుగా నిర్మించి యాగంటి కొండయందు దివ్యంబులైన వెలలేని వజ్రంబులు గలుగ జేతుము. మరియు నప్పురంబునకు ఇంద్రాది సురల భాగంబు నుండి ఏక వర్ణాదులయిన నగరతటాకంబుల మరియాదలుగా చిత్రశాల నిర్వహింతుము. తడవులేదు. మఘయందు సంచరింపగా వచ్చిన కల్పంబు మొదలుకొని నిండిన మీదట నేను ప్రసిద్ధంగా విజయం సేయగలవారము. కనకగిరివారికి లంపటవస్తే నగరలేటి రాజువచ్చి,వారి సంకటం పరిహరించి తొమ్మిది తునకలైన అగునొక భాగంబు సేయబడిన శ్రీని సంరక్షించిన గతి నాలుగు పాదములు ధర్మము తప్పకుండా రాజ్యము ఏలుదము.

నాదబ్రహ్మం నిర్గుణాకారం వీరబ్రహ్మోర్క తేజసమ్.
నాదబ్రహ్మ మితి ప్రోక్తమ్ నానాదేశాని లక్షణమ్.
కవాటసంధి మహావాక్యం భావజ్ఞేన పండితః
క్రమేణ వాక్యం నధృఢం సత్య ప్రాప్నోతి పురుషాం గతిః
గూఢార్థభావజ్ఞ సర్వాత్మ సర్వనామకమ్.
నిత్యాత్మ నిర్మలం బ్రహ్మం గురువార్తా గురుకేశవా..

# సప్తమాశ్వాసము

భగవంతుడు మహాకారణ నిర్ణయము చేసి ఆనతిస్తూ ఉన్నాడు. అభిప్రాయాన వినవలెను. శుకవాక్యము - విమలతేజో విజయనగర ప్రాంతపట్టణ బ్రాహ్మణోత్తములారా! భక్తజనంబులారా ! మేము ఒక్క రహస్యము చెప్పుచున్నాము. దీనిభావము తెలుసుకునేది. ఈ దేవరహస్యము హాస్యము చేసిన వారిని వారి రోమకూపాలు ఎన్నో అన్ని అర్బుదసంఖ్యలు నరకకూపాన వేయించగలము. తెలిసేది. ఇందుకు ఆనందించిన పుణ్య పురుషలను అంగహారమైన ఆత్మలో అనుకూల పఱుతుము. కాగ గ్రంథముఖంగా వచ్చిన వార్తలు పరశు రామావతారం పల్కేపల్కులు విని భయము చేత ఉండేది. మొదట ముప్వురము మునిశాపబద్ధులమై ముఖ్యతేజో విలాసానికి మోసం వచ్చి, ఈలోకానకు చేరినాము. ముప్వురము వరుసతో తేలితే - దేవసాంప్రదాయకమైన పురుషలము వారిమీద మాకు వాత్సల్యము గద్దు. వారికొరకు మేము రావలసినపని ఉన్నది. మేము వచ్చేవారి నిమిత్తమైన వారికై వచ్చేము. లేని పరరూపాల జూపినాము. ఇది ప్రహ్లాద కారణమైన పని; కాగలదు. ఆపని గలిగిన సుగతులు భక్తులున్నారు. పది అవతారమూర్తులు మొనసే ఉన్నారు. ఇదిగాక మాయొక్క మర్మవేదాంత రహస్యమున్ను విజ్ఞాన సంపద ఇప్పుడు యోగగ్రంథ రూపకముగాను వాక్యసరవిగాను అనంత వేదాంత రహస్యమున్ను వెదచల్లినాము. ఇది రాజు సవారిచేసేటప్పుడు భట్యంగము చేసే బిరుదు గద్యపద్యాల పద్ధతి ప్రకాశ మైనది. ఇదిగాక తెలియని రహస్యము చూచి చెప్పినాము. ఇది ఆరాజు రాజవీథి తర్లి వచ్చేటప్పుడు పురస్త్రీలు సౌధాగ్రములనుంచి ముత్యాలసేసలు చల్లిన రీతుల చిత్కళంబులైన జ్యోతులు ఆసంబంధులకు కానబడీని. ఇదిగాక యీ కారణార్థము కొఱకు మేమున్ను అవతరించినాము. ఇందరమున్ను ఈభూలోకానే ఉన్నాము. వారి వారి స్వరూపాలు వారికి తెలియకుండా మాయ గల్పించి మర్మము చేసినాము. బహుశబ్దాలు వక్కాణించి వారిని తపస్సున వేసినాము. వారు కారణజన్ములు. అవును.

అయితే యీకారణము గోప్యమైనది గనుక దినదినమున్నూ గ్రంథసరణికాలాను సారముగా వినవలెను. వారిని దూషింప పనిలేదు. వారిని దూషించుట మమ్ము ముఖాముఖి దూషించునట్టుగా తెలిసీని. మమ్ముల దూషించి నందులకైన సహించు కునేము. అందుకు సంవత్సరమూ నిర్ణయ మైనది. తేట శాయరాదు. మీరు అనుమానపడవద్దు. అవశ్యం వచ్చేము. హెచ్చరికతో ఉండేది. మహాప్రకాశ మైన కాలానకు ఉత్పాతమైన ధ్వని గలిగీని. దాని వెంబడిగానే అత్యంతము వేడిమియైన దుష్టదేహాలు భూమిమీద పడి భస్మమయ్యాని, సుజనకాయంబులు పడి నిర్జీవ వంతులుగా నుండగలవు. ఆ పిమ్మట ప్రపంచ రభసంమళ్ళా అయ్యాని. అనేక బ్రహ్మకల్పాంత బాధలు అనుభవించి, అఖిల ప్రపంచము జీవకోట్లకున్ను ఉత్కృష్ట నరకాలు లేవు. వారివారికి తగిన లోకాలు ఇత్తుము. కాగా కాలతరిగాడు కాలపురుడు ప్రకాశ మైతే, నిర్దయులైనవారు చెడేరు. కాగా పంచరాత్రిళ్ళు స్మరణ చేస్తే సేవించేరు. భక్తదేహాలు పరితాపాలుమాని మాయొక్క దరిసెనమొచూనే నిద్రలేచిన పురుషులవలె లేచి,పరమానందాన బొందుదురు. మా కొఱకు వచ్చిన మునులు భాగవతులు, భక్తులు వీరలందరినీ, ఆమాయ దేహాలు చెఱచి మా సమానాంగము లొసంగి, మాసమానుల చేసుకొని, జగత్తుపాలించి, ధర్మము నాలుగు పాదాల నడిపి దయయు, సత్యము, దానము, వ్రతము, తపఃస్వాధ్యాయ యజ్ఞ కర్మలు ద్విజులు ఆచరింతురు. తక్కిన వైశ్యశూద్ర జాతులు తమ తమ స్వధర్మాలు, విప్రసేవ, మానామ కథా సల్లాపంబుగా ప్రొద్దు పుచ్చుకుందురు. సంకరజాతులు సహాగా సత్యవంతులై సత్వ గుణ ప్రతిపాదకం గానే ఉందురు. మీదట మేము మీతోగూడ మేటివా రున్నచోటికి వచ్చెదము. ఇక్కడ ఉన్నవారికి ఇక్కడ గ్రంథమంతా కాలసరణి కాగలదు.గట్టిగా తెలిసేది. ఇది మహా రహస్యమైన ఏష్యమైన వివరము. ఇది నిర్మాణం; తప్పరాదు. దైవము వాదించే కార్యాలు వేదములు గనుక అటువంటిదిఇది. అంతఃకరణతో ఉండేది. మీరు ధీర విచారులై దేవరహస్యము దెలిసి మీలో మీరు ఆలోచించు కుంటూ,మేలిమితో ఉండేది, ఈవాక్యార్థం గీతార్థం; బ్రహ్మ వాక్య పూజాహారం భూషించవలెను.

శ్రీమత్సకలచరాచర హృదయసదన నివేశ ఘన స్వరూపులైన నిఖిల బ్రహ్మాండోత్పత్తి కారణ ప్రకార ఘనతేజోమయ మహాధృవసంకాశులైన గుణావర్తక కాలాకాలానువర్తక వేదవేదానువర్తక వీరణ భేదవిక్రమ లక్ష్మణ చక్రవక్ర, ఆరంభవాద



పరిహరణ పరమపురుషులైన భాగవతకథా సల్లాప ఆనంద కందళిత హృదయార విందులైన ఆత్మత్రయానుకూలురైన అజపయోగాది అఖిలయోగాంగధారణ నిపుణులైన కామాదిగజవర్గ సింహాది కిశోరంబు లైన నిష్కల్మష నిధినిధాన మూర్తులైన నిర్ణిద్ర పరులైన నిగమాంత రహస్యజ్ఞాన బ్రాహ్మణ్య మూర్తులైన పరమ యోగీంద్ర స్వాము లయ్యవారు తమ దివ్య లీలావతార వినోదజన్మచారణమున్నునై ఆవరణ వివరణ విహరణ భూమిన్నినై, అమితభక్త పరమేష్ఠి పాలితమైన సర్వఋషి సాంప్రదాయకులైన పరమనగర వాసులైన శేషాంశ జాతులయిన భూసుర బాలురకు పుత్తెంచిన ప్రయోజనము మీకు చిదానంద సిద్ధయోగశీలత గలిగీని. అవిద్యాహరణ ఆత్మత్రయానుక్రమ్య ఆవరణ విచ్ఛేద అవిద్యోత సంయోగానందము సంభ వించునట్లుగా సంకల్పించిన జాబుల వివరము. మేము మీకు చెల్లవలసి చెల్లించే కాణయాచి గ్రామాలలోనే కదలకుండ అటువంటి వారి కోరిక గురిచేసి చెప్పుతూ ఉన్నాము. తెలిసేది; ఆనందించుకునేది. అది యేమి అంటిరా బయలాది పంకతత్వ మున్ను తాలిమిజన్యాది తలములున్ను అయిదు ఆరింటను మునుపు చెప్పిన వారితోటివారు ముగ్గురు గూడి గొప్ప ఊర కూర్చుండి ఉద్యోగాలు సల్పు చు ుదురు. అదిగాక ఆశరీర పంచకమున్ను గొప్ప జ్ఞాన పంచకమున్ను అంగారక విపర్యాది -పంచకమున్ను గూడిన కొంచెపు గ్రామాన ఉండి కాలక్రమణ సేయుదురుగాక! పెక్కువ గలవానితో గూడి విడియపు చొక్కు చేత ఉందురు. ఈతీరున మీయిళ్ళలోనే ఉండగా వారువారైరని మమ్ము దూరేటందుకు పని యేమి ఉన్నది? తామసచిత్తులై పోయిన కాలానకు కట్టలుకట్టుతూ ఉన్నారు. పూర్ణవాహినియైన పుణ్యనదీ తీరాన ఉండి దాహముగొని వచ్చి పాడుబావిలో చెలమ తీసికొని ఉదకపానము చేయ బోయినటువలెనే యున్నది. అది యేమంటిరా, మేము మీలోని వారమై అనువర్తించి కూడా కొన్ని దినంబు లుంటిమిగా ! ఆనాడే కోరి చేర్చి కూర్చి నేర్చి కాచి చూచి చెడుగు మార్గాలు చిడుముడి చేతలు దుడుకు దగులు ఉడికితె అడిగితె ఉన్న అర్థము. మేము చిత్తగించక పోతే పైవివరముగా కనుపించి వేరై కనుపించినప్పుడు వినిపించరాదా? ఎమ్మెలు విడువరాదా? కమ్మ చేర రాదో! కలల నోలలాడరాదో! మిమ్ము నందుంచరాదో ! మేలు కృశింపరాదో! సొమ్ము వెచ్చింపరాదో! చూచి వలపించరాదో! మీ కథలు చెప్పరాదో! మేలు జయమందరాదో! అయితే ఆనాడే

మోసము చేత చెరుచుకుంటిరి. వేధింప వేరిమి క్రూరదోషమా ?మితి అపరాధమా? మేలుగాక పోయెనా?మా వెర్రికి ఏమనవచ్చును? అయిన ఆకారదర్శన ప్రత్యుత్తర భావానకు పరిచరింపక పోతిరి. ఆనందముచేత అనుమానము చేత అన్న అపేక్షచేత ఈవగల చేతనే ఏమి తెలియక పోతిరి. అప్పుడే చేరి కోరి దూరి పల్కితే మీదివ్యకోమల శుభాంగంబుల జొచ్చిమచ్చిక నుండగలును. సరియాన పక్షమోక్షము, పర పక్షము ప్రాప్యమోక్షము పరమమోక్షము కలుగును.

పరమ మోక్షము నాలుగువగలుకల కలవంటి మానవ సందిస్థానాలు ఉన్న మహాత్ములంతాను మాట అనువర్తించి యుండిరి గనుక ఆ మూడు జాగాలు చేరి తూరిపారి నూరి వచ్చి చొచ్చి కొంచుమించితే మంచి మోక్షము గలుగును. మీ ప్రయోజనాలు ఈలాగున ఉన్నవి. ఇతను కావాలంటే కాక పోదు. లేదా అంటే లేకపోదు. రాదా అంటే రాకపోదు. వచ్చెనా అంటే అన్నపుడే రాదు. మీరు మహాతామసులు. ఘనులా యెరుగరు. గ్రంథ వివరమా తెలిసి నన్ని పరవాచేయరు. దేవమాయ శక్తి వివరాలు మీకు తెలియవు. దివిజుల ప్రభావము తేటచేసికోనేరరు. చెప్పిన వివరము చెవుల బెట్టక మనసు నిలువక మదముతో గూడి మరపు చేసుకొని పోతూ ఉన్నారు. మరియాదలు తప్పినవి. మతతంత్రాలు, మనోవికారాలు, డంబాచారాలు, దత్తురపగలు, తామసౄకృత్యాలు ధర్మహీన ప్రయోజనాలు, దయారహిత గుణాలు, దండన పాలన విధానాలు, టక్కు టెక్కు భాషణలై భూమికిమోపై పొగలము వచ్చి యున్నది. వారు వచ్చేవారుగా ఉన్నారు. మీకు నిదానంగా చెప్పేటందుకు మాకు మనస్సుకు రాదు. చెప్పిన వివరము సిద్ధాంతముగా ఒప్పుకోరు గనుక ఆవివరము వెళ్లనాడినాము. ఇకను గ్రంథములు నానాముఖములుగాను అంగ మత్సర మడియాసలతో ఉండీని. ఉగ్రశక్తి ప్రేరితాన కల్మషాలు ముంచుకొని ఇంకా మీకు అవుగాములకు సంశయాలు దోచీని. మేము మునుపు ఒకట రెంట మూట చెప్పిన వివరము ఇప్పుడే తెలుపుతూ ఉన్నాము. తెలిసి కలిసి మెలసి కలగక నిలిచి మెలసి తలచి కుల నామ గురుశ్రేష్ఠంబులు చాలించి గ్రంథ సంచారమునకు భక్తి గలిగి యుక్తిచేత శక్తి ప్రయోజనాలు బెగడక చంద్ర సూర్యాగ్నిమయమైన జన్మదేశమందు చిత్తము నిలిపి, జగన్నాథురాకకు ఎదురు చూస్తూ ఉంటే తత్సంవత్సర చైత్ర శుద్ధ ౹౹లు ఆదివారంనాడు దేవఘడియలతో



వీరపురుష శ్రేష్ఠం విజయం చేయగలరు. ఈ వివరము తెలియచెప్పి నాము. ఇకనైనను మనస్సులో నిలుపుకొని మా వంశం వారు మీలో అణగి అల్పులవలెనే ఉన్నారు. వారి యెడల వాత్సల్యము కలిగి ఉండేది. అది యేది అంటిరా వారిహృదయాల మేముఉన్నాము. వారిని సంతోష పెట్టితే మాకు సంతోషమయ్యాని. అనుమానము లేదు. ఇది తెలుసు కొని నడచుకునేది. పేరు పేర చెప్పలేదని పెద్దతనాలు పుట్టించుకోబోక మనస్సులో వారిని వచ్చేవారుగా చూచేది. ఇంతే ఆశీర్వదము రెండో ఆశీర్వాదము మూడో ఆశీర్వాదమునకు మొనసి వచ్చినది.

శ్రీ గురవే నమః

శ్లో. కావేరి గిరిజాతోయం వైకుంఠం రంగమందిరం
బాదామీ మేకమే రాజ్యం రామధర్మజమే మయం
శ్రీరంగమే గౌతమం చైవ, వారణాస్యంతు మే మయం.
ఆరామధర్మజం వందే ఆత్మరక్షణమే మయం
ఆత్మాత్మా కాంతి మేకాంతం ఆనందగురు మన్వథా
త్రైలోక్య మేకమే రాజ్యం రామధర్మజమే మయం
రమ్య మేకో రమాదేవో రామధర్మజమే మయం
చంద్ర మేక సమం విష్ణుం చంద్ర మేక సముద్భవం
చంద్రసూర్యసమం వందే చంద్రజ్యోతి మయో మయం
అంగీరసే మధూమాసే నవమ్యాం శుక్లపక్షకే
భానువారే చ యామ్యార్థం వీరభోజాసముద్భవం
ఆనందనందనం మధ్యే శ్రీమత్రైవల్య మందిరం
శ్రీముఖం పిశంగిలం పిలపిల వీరధర్మాత్మకేశవమ్.

**విరూపాక్షమందు భూతాళలిఖితం**

శ్లో. ఈశ్వరాబ్దే మాఘమాసే దశమ్యాం రోహిణీ యథా
ఇందువాసర యుక్తానాం వీరభోజవసుంధరా
పార్థివో పార్థివో భూపా వ్యయో భూపా క్షయంగతః
పునః పంచమవర్షేచ వీరభూపా భవిష్యతి
ఖరే వర్షే ధనుర్మాసే తృతీయాం శుక్లపక్షకే

సోమశ్రవణ మధ్యాహ్నం వీరభోజో వసుంధరా
నంద మాశ్వీజ మాసే  చ దశమ్యాం శుక్లపక్షకే
భానువారే చ యమ్యార్థం వీర భూపాలకో పతిః
నందిముఖా పరమానందం నందితానందమందిరాం
నందనానందధర్మజ్ఞా బ్రహ్మ మానందకేశవం
హతః పరద్వీజాతీనాం వేదశాస్త్ర సమన్వయం
యస్య సైరణమాత్రేణ సత్యం సత్యం న సంశయః
అస్మ్యపి లిఖితం యాత్రా విరూపాక్షేశ్వర సన్నిధౌ
తుంగభద్ర  నదీతీరే సత్యం సత్యం న  సంశయః
రామబ్రహ్మ నిర్గుణాకారం వీరబ్రహ్మేర్క తేజసం
నాద బ్రహ్మేవతీ ప్రోక్తం నానాదేశాని లక్షణం
పినాకీనుత్తరీ రమ్యే తపస్వాతంతు మహామితం
అవనిలోన సంతుష్టం కరుణాపాంగ మీక్షణీ
ప్రాణనాథాయ గంగాంబా స్వజటాజూట సంభవం
యస్యోపరి ప్రోక్తా దివ్యపురుష మయోః
మా మేమేక మేకం మహామేకమేకో మామేకమే సర్వమ్మేకమేవా
మా మేక మేకం మహామేరుమధ్యే మామేకమేసర్వతో మయః
మా మేకమే రాజ్యం మామేకం సర్వసంపదా
ధర్మ మేక మహాత్మానాం ధర్మమే పుత్ర సంపదా
ధర్మమే మమామేరురాజ్యం ధర్మమే ధర్మదేవతా
యామ్యాయ వాసుదేవాయ యామ్య యామ్య జనార్థనాః
యామ్యాయ యశ్చ మద్భక్తా యామ్యాయా శ్చ ముక్తయే
యామ్యాయాశ్చమత్కులం యామ్యా ధ్యానపరాయణా

ఈశ్లోకాలు అక్షర పరతత్త్వ శ్లోకాలు. సాంద్రసింధువేదము లోనివి. ఈ శ్లోకాలు చూచి యీ పత్రిక లిఖించి  మీ సమీపానకు పంపించినాము. అక్షర పరతత్వలక్షణం ఎరుగక యెవరు దూషింతులో వారు కులక్షయమై పోదురు. ఈ శ్లోకాలు అక్షర పరతత్వంబు ఎరిగి యెవరు వీరధర్మజులను భజనచేతురో వారు ఆచంద్రస్థాయిగాను సుఖాన ఉందురు.

# అష్టమాశ్వాసము

భూలోకాలు మర్త్యలోకాలు మా యధీనం కేదార రామేశ్వర పర్యంతం ఏక రాజ్యముగా ఏలుతూ ఉన్నాము. ఆశ్వయుజ దీపావళి అమావాస్య పున్నమి అవుతూ ఉన్నది. కార్తీక శుద్ధగ౨లు నాటికి రామధర్మజులు ఉద్భవ మవుతూ ఉన్నారు. శుద్ధసువర్ణమైన మాసేవ చేసుకొని యుండేది. మురహరుం డనే ముక్కంటి మహిమలు ముజ్జగత్తులకున్ను తెలియదు. ఈ మనుష్య లోకం ఈలాగున నిర్వంశమై పోతూ - ఉన్నది. కార్తిక శుద్ధగంకే పోతూ ఉన్నది. అందరు నిర్మనుష్యులై పాయ్యేరు. శ్రీమన్నారాయణుని మహిమ అప్పుడుగాని తెలియదు. దేశాలమీద చోరజను లెల్లా నెల్లికాయపీచు వలెనే అనావృష్టి దోషం తగుల వలెను. ఆసనాన గండ మాలపుండ్లు వీపున రాచపుండ్లు, రొమ్మున గండమాల పుండ్లు, నెత్తిన పెడతటి పుండ్లు ఈ ఆరువ్యాధి రూపాలచేత, పేరాముదపుగింజ చిట్లినట్లుగా, అమావాస్య పున్నమజూచి నాశనమై పాయ్యేరు. ఇది ఆదిగురి వచన మహిమ, కార్తికమే నివ్వయమని  నా మహిమ తెలుసుకొని యుండేది. నా మీద భక్తిలేనివారు అవశ్యం నష్టమై పాయ్యేరు.

శ్లో. మాసకార్తీక మేకం తు సర్వం మాసాత్మమే మయం
వేదాంత సూక్ష్మగీతానాం ఉపదేశం మీద తెలియదు
శ్రీమా మాయుష్యం భవ
మాస మాశ్వీజమేకం తు సర్వమేకమే మయం
అమావాస్య చంద్రమేకం తు ఆది వీరకాలమే మయం
అడ్డపున్నమ విశ్రాంతం ఆదిత్యా మండలం మయం
విష్ణు వీరదర్శనం  చైవ వీరధర్మజ కాలమయం.

మా శాల్మికులైన వారికి మా మహిమ తెలియదు. కార్తిక శుద్ధగ౨ల నాటి ఉద్భవ మయ్యేము. ముందర పుట్టే కార్యాలు వేద ఘోషణ లోకాల కెల్లా వినబడీని. పువ్వుల వాన గురిసీని. ఆమీదట అమావాస్యనాడు చంద్రోదయ మయ్యీని. సూర్య నందిని ఉద్భవ మయ్యేము. తూర్పున శిరస్సుగాను, పడమట తోక శిరస్సు బండికల్లంత వెడల్పుతోక యిరవై బారల పొడవు.  ఈతీరున గల ధూమ కేతువు

పుట్టి ముప్పై మూడు దినాలు లోకానకెల్లా కానబడీని. ఆ మీదట పుణ్యాత్ములైనవారికి సూర్యమండల మందు మనుష్య రూపంబులు కాన వచ్చేని. ఆకాశము ఎఱ్ఱనయ్యీని, అయ్యయో అనే ధ్వని వినబడీని. ఆకాశాన భుగుళ్ళు భుగుళ్ళు మనే ధ్వని వినబడీని. కేశవ నామాలు వినబడీని. ఆవులు ఆకాశం చూచి అరిచీని. గ్రామాంతరాల పట్నాంతరాల నెత్తురు వర్షం గురిచీని. పట్నాల లక్ష్మీదేవి యేడ్చీని. రామధర్మజులు సూర్యమండల మందు ఉద్భవమయ్యీని. సూర్యనందిని ప్రకాశమయ్యీని. వీరయోగి వస్తూ ఉన్నాడని భూమి పలికీని, వేదాంతం చదివీని. దేవునిమీద ఆకాశమున ఉండి అంతర గంగోదకం కురిసీని. సముద్రాలు ఉప్పొంగీని, వాద్యాల చప్పుళ్ళు వినబడీని. సూర్యనందిని అయిదు దినాలుండి భూమిమీద ప్రకాశమయ్యీని. ఆ మీదట మూడు బ్రహ్మ కల్పాలు పూర్వము ధర్మము ఎట్లా నడచునో ఆ తీరున ముందర నడిపిస్తూ ఉన్నారము. నానావర్ణాదులయందున్ను సజ్జనులైన వారు ఎవరున్నారో వారిని సంరక్షింతుము అని అయ్యవారు ఆనతిచ్చిన వాక్యము. భూత భవిష్యద్వర్తమాన కాలాలకున్ను నానా దేశాలకున్ను వ్రాయించినది మూడు లక్షల ముప్పైరెండువేల గ్రంథము. ఈ గ్రంథమంతా వ్రాయకూడదు. కలుగుమాత్రం వ్రాయించి మీ సమీపానకు పంపించి నాము. మీరు ఈ పత్రిక ప్రత్యేకముగా చదివించుకునేది. ఈ వివరము విని దేవ బ్రాహ్మణ విశ్వాసం గలిగి రామధర్మజుల మీద భక్తిగలిగి నడిపిస్తిరాయనా ఆచంద్ర స్థాయిగాను సుఖాన ఉందురు. పదో అవతారంబు రామరామాత్మారామంబు. పదకొండో అవతారంబు నేను. శ్రీశైలమందు మల్లికార్జునస్వామిదేవుండు కన్ను దెరచి ప్రజాక్షయం చేసే కొఱకు సంతోషపడుతూ ఉండీని. తూర్పునాటికి భైరవుని పంపు, దక్షిణరాజ్యానకు కాళిపంపు, పశ్చిమరాజ్యానకు ఎఱ్ఱుపంపు. ఉత్తరాజ్యానకు దుర్గి పంపు. తురకాణ్యదేశానికి దుర్గిపంపు, కందన వోలుసీమకు ఎఱ్ఱు పంపు. నందిమండల సామ్రాజ్యానకు నాగేంద్రుని పంపు. శరణన్నవారిని మాపేరు దలచిన వారిని మరవక కాచి రక్షిస్తూ వచ్చేని. సందుసందు దేశానకు హనుమంతుడు భద్రకాళి వీరభద్రుడు మొదలైన వారి పంపులు. దుర్జనులు స్వామిద్రోహాలు పరస్త్రీ పరధన హింసకులు మిత్రద్రోహాలు క్షుల్లకులు తుచ్ఛకులు కుహకులు విశ్వాస ఘాతుకుల శక్తులు తోడుబోతులు చాడీకాండ్లు దుర్మార్గులు శివద్రోహాలు విష్ణుద్రోహాలు సంకర జాతులు జిడ్డకులు నిందకులు నాశకులు ద్రోహము చేసేవారిని సంహరింతుము. పంపుల కట్టడి చేసినాము. ప్రభుభ్యాం శూద్రులు నాశనమై పొయ్యేరు.



పద్మాక్షుశాపంచేత వేడిమంటల కాలి చచ్చేరు. మా తమ్ముడు భరతునికి గంటలు కట్టించితిరి గనుక శూద్ర కులమెల్లా నిర్మూలనం చేస్తిమి. మాశాపానకు దప్పరాదు. బ్రహ్మాస్త్రము తప్పినా గాని మామాట తప్పరాదు. పంచాంగాలు మూలబడును. బ్రహ్మదేవునికి ఆకలిదప్పులు అయ్యేదివసం వచ్చినది. బ్రహ్మదేవునికి సృష్టిపనిలేదు. నాణెము తక్కువ నాణెముగా జూచేరు. ఏమిరారా పోరా అనేమాటలు రావయ్యా పోవయ్యా అనేరు. వావివర్తనములు మానేరు. మదమాత్సర్యాలు ఎచ్చి కామక్రోధలోభమోహాలు వచ్చేని. తండోపతండాలైన గాలి చేత వానచేతను పశువులు, గొఱ్ఱెలు, అడవిజంతువులు మొదలైనవి ప్రాణికోట్లు ఆకాశంబు జూచి అరచీని. 'మేము పోతూ ఉన్నాము. మాకు ప్రాణాలు లేవు. బ్రతుకులు లేవు' అని అరచీని. విషపుగాలి చేతను మనుష్యులు మొదలైన ప్రాణికోట్లు భూమండలమందు నిర్మనుష్యులుగా మడిసేరు. మామంత్ర శక్తిచేత మాభక్తులైనవారికి పునరుద్ధారణ చేసి బ్రతికించుకొని సంరక్షించుకునేము. కేశవుని నమ్మినవారిని నిలిపేము. కేశవ కులమంతా నిర్మూలం చేసేము. మా భక్తులైన బ్రాహ్మణులు సుఖాన ఉండేరు. మా పాంచాననం వారు సుఖాన ఉండేరు. క్షత్రియులు వేరేకదా, ముత్తరాచువారిని నిలిపేము. కోమట్లు వేరేకదా. బేరికోమట్లను నిలిపేము. శూద్రులు వేరేకదా, తెలుగు బలిజవారిని నిలిపేము. ఏకులమందైనా శతాపరాధాలు చేసినాగాని మమ్ము నెర నమ్మినవారిని కాచి రక్షించేము.

శ్లో. యామ్యాయ యతిమా శ్రేష్ఠ యామ్యాయస్య చింతన
యామ్యాయ సురశ్రేష్ట యామ్యా యామ్యామహాన్యథా.

శ్రీమత్పరమహంస శుకమూర్తి మనోవిలాసా, అరిషడ్వర్గజయపారాయణ ! పరం జ్యోతి స్వరూపా! వేదవేదాంత భోగభాగ్య ఘన గంభీరా ! ఆఖండలాఖండ పద్మాంకుశాత్మక ! శ్రీకూర్మ సింహాసన మహోదయ సాక్షాత్కారసజ్జన పాలకా ! అనవరత భూసురాశీర్వాద సంపన్న సకలసంపద! సంపదశీలా ! వీరప్రతాపా! నానావిధ రాజసంహార! చతుర్దశభువన లోకైకశరణ్య! భక్తవత్సల! దానవకులవిచ్ఛేదన! జయజయ యేకో మహాప్రసిద్ధ చాణూరమల్ల కదనప్రచండ! నానావర్ణమండలీ కరగండ కాళిందీకల్లోల మధుకైటభ ! దుష్టనిగ్రహ శిష్టపరిపాలన! కుముద కుముదాంధకార భాస్కర నీలమేఘలావణ్య ! జయ జంభారి మురాంతకోత్తమ ! సకల కల్యాణ లక్ష్మీ సమేత! త్రిమూర్తి స్వరూపా! త్రిగుణాత్మక ! అచ్యుత పర బ్రహ్మ ! సాకార నిరాకార గోత్రపట్టీశ ! కులపావన ! రామధర్మజులకు ప్రతినామమైన వీరధర్మజులకు వీరాచార్యాయ వీరగురవే నమః.

# నవమాశ్వాసము

## సర్వజ్ఞుని కాలజ్ఞానము

సర్వజ్ఞుడనే ప్రమథుండు కల్యాణానకు వచ్చేటపుడు కల్యాణం ఏలాగున నుండే నంటేను - ఇండ్లపాడవు రత్నాలున్ను, కుండల నిండా పాడిన్ని, పంటలున్ను, కొండలకొట్టడి బంగారులు కలిగియుండును. బసవేశ్వరుడు ప్రభురాయలు బిజ్జలుడున్ను కల్యాణం పాలించేటప్పుడు పండ్రెండు ఆమడల పట్టణము సంపదలు వర్ణింపగాను ఈతీరున ఉన్నప్పుడు బసవాది ప్రమథులున్ను ప్రభుదేవర మొదలైనవారు అనుభవమంటపములో సమయమై కూర్చున్నపుడు సర్వజ్ఞుండనే ప్రమథుడున్ను వారి ముఖాంతరాల నిలుచుండి బసవన్నతోను కాలజ్ఞానము చెప్పుచున్నాడు. బసవస్వామి ఆశంసాలు - ప్రమథగణాధీశ్వరులారా! యీ భృత్యుని విన్నపము వినరయ్యా. మొదట నన్ను కైలాసమందు పుష్పదంతుండని మన్నింతురు. ఇప్పుడు ఈమర్త్యమందు సర్వజ్ఞుండనే నామమిచ్చి రక్షిస్తిరి. మాలింగమందు తోచి నటువంటి భూత భవిష్యద్వర్తమానాలు తెలియ చెప్పుచున్నాను. నేను స్వతంత్రుండ గాను. మీరు చిత్తగించేటందుకు విన్నపము చేస్తూఉన్నాను. నాతో నుండి చెప్పి వినేవారు పల్కేవారు మీరే. శరణుశరణార్థి. మీబుద్ధి స్వామి చెప్పదొడంగెను. బసవన్నా యిప్పటికి కలియుగం ఎంతాయనంటేను చనిపోయినది రెండువేలయేండ్లు అయెను. ఇకను నాలుగులక్షల ముప్పైరెండు వేల యేండ్లు. సందు సందుల వచ్చే ముచ్చట లున్ను సవిస్తారంగా తెలియ జెప్పుచున్నాము. మీరు విని చిత్తగించరయ్యా! యీ విక్రమనామ సంవత్సరము మొదలు ఇరవైనాలుగేండ్లకు కీలకనామ సంవత్సరం లోను ఈ బిజ్జలరాయని దివాణములోను బల్లి పలుకు శకునము మీలింగమందు తెలుసుకొని అందరు నెరుగంగ జగదేక బ్రహ్మయ్యకు అద్రోహం అప్పగించి సంగమేశ్వరునియందు లీనమయ్యేరు. ఈ విక్రమనామ సంవత్సరం పోగాను రాక్షసనామ సంవత్సరానకు ముప్పైనాలుగు ఏండ్లు అయ్యాని. ఇరవైయేండ్లకు తిరుగా అంతాగూడా మీరు మర్త్యమందు ఉన్నది అరవై యేండ్లు అయ్యాని. ముందుర వర్తమానాలు చెప్పుచున్నాను. మీకు గమనం



చేయగాను ఉన్న గణాధీశ్వరులున్ను, చరలింగమూర్తులును, చెన్న బసవన్నగారున్ను మడియాలయ్య బింబిబాచయ్యన్ను మాదిగమారెయ్యనున్ను మొదలైన ప్రమథులందరినిన్ని పిలిపించుకొని మీ జ్ఞాన దృష్టిచూచి మాకు ముక్కంటి రూపం అయింది. అని చెన్నబసవయ్యకు మడియా లయ్యకు తెలియచెప్పి అద్రోహం ఆ భక్తునకు అప్పగించి మీరందరితోను తెలియ చెప్పుటే సాక్షి అనిబసవన్నగారితో విన్నపము చేసెను. అలాగే ఆడులయ్య మధువరుస గార్ని కనులుదీయించిన ఆ ద్రోహమునకు బిజ్జల రాయన్న జగదేక బ్రహ్మయ్య గారు చేసిన గణాధీశ్వరుల అనుజ్ఞవచ్చును. అది విని గణాధీశ్వరులు సమస్తమైన వారున్ను చెన్నబసవన్న గారున్ను విచారంచేతురు. ఈ బిజ్జలరాయుని మేనల్లుడు, బిజ్జలునికి పట్నం గట్టి తాను ప్రధాన పట్నము గట్టుకొని, పండ్రెండారేండ్లు రాజ్యం చేసేరు. అంత గురువరేశ్వర్లున్ను మఠాధికర్తలున్ను సమస్తమైన గణాధీశ్వరులున్ను చెన్నబసవన్న గారికి తెలుపుదురు. చెన్నబసవన్నగారికి క్రోధినామ సంవత్సరం మొదలు చేసి రాక్షసనామ సంవత్సరానకు పండ్రెండు ఏండ్లు ఆయెను. మనము హుళిబెళము లోకి పొయ్యేపని వచ్చును. ఈ యున్నవారికి భిన్నాయము చేయమందురు. అలాగే వారికి భిన్నాయము చేసి మేము పొయ్యేమని విన్నపము చేయగాను చెన్నబసవన్న గారు 'మాకు తన ప్రసాదము తీరదు అదిగాక తిరిగి వచ్చే టందుకు ఇక్కడ నున్నదే లెస్స. మీరున్ను ప్రమథులున్ను సుఖాన పోయిరం'డని సెలవు ఇత్తురు. ఇచ్చిన మీదట బసవన్న 'మీకు మాకు ఎన్నటికి దరిసెనం అయ్యాని? అనంగా అందుకు చెన్నబసవన్న గారున్ను గణాధీశ్వరులున్ను ఏకవాక్యముగాను 'మీకున్ను మాకున్ను నాలుగువేల యెనిమిది నూర్లయాభైతొమ్మిది కలియుగాబ్దములు నడచీని. అప్పటికి మీకున్ను మాకున్ను దరిసెనమయ్యాని అని శివుని ఆన నమ్మండి' అని అందురు. అంతటనుంచి మేము వచ్చేటంత పర్యంతరంలోగా వచ్చే మహిలు సర్వజ్ఞుడు చెప్పుచున్నాడు - మా విన్నపము వినరయ్యా - ఈ బిజ్జలరాయని వంశికుడు వీరవసంతరాయలు పుట్టగలడు. అతడు పుట్టిన వెనుక మీకు మాకు దరిసెనమయ్యాని. సందేహము లేదు అని హుళిబేళానికి గమనం చేసేరు. ఆ వెనుక ఇక్కడ నున్నవారు నేలమాళిగలలోను మట్టు చేసుకొని యుండేరు. కొందరు శ్రీశైల గహ్వరాలలో నుందురు. ఉసిరి కాయంత బట్టెలున్ను, వేపకాయంత ముంతలున్ను, దీనికి తగిన సూక్ష్మరూపాలు దాల్చుకొని యుందురు. అక్కడనున్న వారు ఎన్నడు

పోదురు అంటే బిజ్జలుడు పోయిన వెనుక అల్లుడు బిజ్జలుడు పంద్రెండేండ్లు అయినమీదట పోదురు. నాటికి కలియుగం ఎంతాయనంటేను రెండువేల యెనభై అయ్యాని. ఆముందర చేసిన బండారమున్ను పుస్తకాలున్ను పురాణాలున్ను అన్ని నిక్షేపముచేసి యెక్కడవారు అక్కడనే యిమిడి ఉందురు. ఇందుకు సాక్షి యేమంటేను పదకొండు ఆనందల క్రమాన అయిన వెనుక రెండు ఆనందలలోను రుద్రముని దేవసాంప్రదాయకులచే మీరు చేసిన బండారం పాడుపడుటయే సాక్షి. అంతట బిజ్జలుడు వీడి పోయిన తర్వాతను అంతట కల్యాణం పాయ్యాని. ఆ సమయమందు బోయకంపీరుడు రాజ్యం చేసి ఐక్యమైపొయ్యాని. వాడు ఏలిన తర్వాతను ఆ సమయమందు రాక్షసవంశము లోను ఒకడు శివునిగూర్చి అనేక ఉగ్రతపస్సులు చేయును. ఆతపస్సులకు శివుడు మెచ్చి ప్రసన్నుడౌను. ప్రసన్నుడు కాగానే దైత్యుడు 'స్వామీ నాకు లింగము ఇయ్యవలె'నని అడుగును. ఆ మాటవిని శివుడు వాని భ్రమింప చేసేటందుకు సురాపానము గంజాయి త్రాగి, రారాయనెను. వీనికి లింగము ఇయ్య గానె నన్ను దేభీలు ఉపేక్ష చేసును.'ఓరీ అలాగే యిస్తా యున్నాను నీవు వస్త్రము దెచ్చుకోరా' అని లింగముమరుపు చేయును. వానికి రాజ్య భోగమునిచ్చి పదమూడు పట్నాలు ఏలుమని దీవించెను. బయలైపోయెను. అంతటసురత్రాగినవల్ల సురతానుఢనే పేరుచేత పదమూడు పట్నాలు ఏలును. వాడు ఏలే కాలమందు ఈ కల్యాణములోను మేదరివాడైన వాడు బిరుదుకోట అనే నామంచేత దుర్గం గట్టి అందులో గాజు గంబాలు నిలిపి వాడు ముప్పై యేండ్లు ఏలి ఐక్యమై పొయ్యాని. వాని పారంపరివారలు రెండు వందలయేండ్లు ఏలుదురు. ఆ తర్వాతను యవనులు ఏలుదురు. వారిలో ఆరుగురు సత్యాన నేలుదురు. ముగ్గురు అసత్యాన నేలుదురు. వారి తెగలు అయిన వెనుక వాని లంజ అనే భోగస్త్రీ యేలీని అక్కడి నుండి లంజలు ఏలుదురు. ఆ కాలమందున వావివర్తనములు తప్పి జనులు నడిచేరు. ఇందుకు దృష్టం ఏమంటేను ఈభీమనదిలో తీర్థము ఉప్పులగుటే సాక్షి. అందుకు గురుతు అసత్యాలు ఆగడాలు అధర్మాలు గలజనులు ఏలుదురు. ఆ సమయమందు ప్రౌఢదేవరాయలు ఏలును. అతని కిందను పల్లెలు పట్నాలు అయ్యాని మరియొకనితేజం కలిగీని. నూరు దొడ్డస్థలాల అయ్యలు తిరుగుదురు. ఆయనకు దృష్టాలు చూపుదురు. మరిన్ని ప్రభులీలలు పుట్టును. అది యాభై ఆరుదేశాలలోను భక్తుల ఇండ్ల వెలసును. అది చూసి భవుడు భక్తుండవును. ఆ వెనుక కలి



పాతబడిపొయ్యాని. మరువు చూపును. ప్రౌఢ దేవరాయలు యాభై ఆరుయేండ్లు ఏలి శ్రీశైలగోపురద్వారములు గట్టించి అతడు మరి లింగమందు ఐక్యమయ్యాని. అప్పటికి కలియుగం లెక్కలేదు. విజయనగరానకు ఎనిమిది పేర్లు చెల్లును. హంపి అనేది ౧, నాగరం ౨, ఆనెగొంది౩, పంపాతీరం ౪,విద్యానగరం ౫,గజపురం ౬, రాయదుర్గం౭, విజయనగరం౮, ఈ యెనిమిదిపేర్లు చెల్లి ఈ మహి అంతా కంపీరుడు రాజు ఒక పురాణకున్ని అడుగును. రాజా ఈక్షేత్రము వారణాసి కన్నాను వరిగింజంత వాసి. మరిన్ని యీ క్షేత్రమందు శివుడు మన్మథుని దహనం చేసినాడు. దానికి దృష్టం మన్మథకొండ అనేకొండ గలదని చెప్పును. విద్యానగరం అనేది పేరు ఏలవచ్చె నంటే ఆ పురాణకుడు చెప్పును. విద్యారణ్యుండనే ఒడయండు ఒకడు గలడు. అతడు నిత్యం కాశిలో స్నానము చేసి విశ్వనాథున్ని పూజచేసి మధ్యాహ్న కాలమందు ఈ క్షేత్రానికి వచ్చును. విరూపాక్ష లింగము వచ్చి వాంఛితంబు అడుగు మనును. స్వామీ నీరూపముచేత పట్నము నిర్మించి విద్యానగరం అనే పేరుపెట్టి వెలయించుము. ఇది కృతయుగమందు - ఈ లింగానకు హరిశ్చంద్రుడు ఒక మంటపము కట్టించి అనేక శివాలయములు గట్టించి వసిష్ఠుచేత ఈ మహిమ అంతా నిని ఆదేశం విరూపాక్ష లింగానకు ధారవోసి తాను అయోధ్యకు పోయెనని చెప్పును. ఆవెనుక కంపీరుడు తాను నొక మంటపము కట్టించి అనేక శృంగారాలు చేసి కృతయుగంనాటి వారికి హరిశ్చంద్ర ప్రతిష్ఠలు, నవ నందుల జేసి అవి అన్నిఅనువు చేసి వారు లింగైక్యమయ్యే ముందర తమ సీమంతా విరూపాక్షలింగానకు ధారవోసి శిఖాసూత్రాలు ముద్రికలు కృష్ణ భీమరథియందు చెల్లించి అతడు హోసమ దుర్గానకు పోయి ౩౯ యేండ్లు ఏలి ఐక్యమై పోవును. బసవన్నా మరిఒక దృష్టం చెప్పెదను. మాటూరు అనే పట్నం గలదు. అక్కడికి రాతి గరిడీలు దెచ్చి విరూపాక్షలింగానకు ద్వారబంధాలు గట్టేరు. నిజము తప్పరాదు. ఇది ఫల మేమంటేను అది మొదలు జేసి రాజులకు కంటకాలు అయ్యాని ఆ సమయమందు రాయసంతతిలోను కుమారరాముడు అనే రాజు పుట్టును. అతడు విష్ణు అంశ అవతారం అనిపించుకొనును. ఆకొమార రామునికి భూలోకమందున్న రాజులెల్లా అరెప్పణాలు పెట్టి కొలుస్తూ ఉందురు. అతడు ఏలేకాలమందు ఏమిపుట్టు నంటేను రెండేసి మొనలుగల శూలాలు గుమ్మటా లెక్కింతురు. అంతట గజపతి అనే రాజు

పుట్టును. కొమరా రాముని లక్షణాలు శూలాల మహిమ విని అనేక ఉగ్రుడై సవాలక్ష యేనుగులున్ను చతురంగబలాలున్ను వీటితోను వచ్చి అనేక యుద్ధం చేసి భంగపడి పోవును. కొమార రాముడు వారిని తరుముకొని పోయి వారిని హతహతం చేసి దారి దివాణంలో జొచ్చి వారి యిలవేల్పు పంచతాండవ మూర్తిని తీసుకొని వచ్చి విజయ నగరంలోను సింహాసనము మీద ప్రతిష్ఠ చేసి అరవై యేండ్లు ఏలి అతడు ఐక్య మాయెను. ఇందుకు సాక్షి యేమంటేను ఆపట్నాన నెత్తురు కోట అగడ్త నిండి యెర్రబారుటే సాక్షి ఆ తర్వాతను రాయసంతతి వారు ఎవరు ఏలుదురంటేను దేవరాయలు కృష్ణరాయలు, చెన్నరాయలు, ముకుందరాయలు, చెన్నకేశవరాయలు బాలసరస్వతి రాయలు, విష్ణురాయలు, మహదేవరాయలు మొదలు చేసి యిన్నూట అరవై యేండ్లు ఏలి తమతమబిరుదులు చెల్లించుకొని కృష్ణా కావేరి నందున గోపురాలున్ను మంటపాలున్ను కోనేర్లున్ను లింగప్రతిష్ఠలు నిలుపుకొని వారు లింగైక్య మయ్యే సమయమందు రాయపట్నానికి రాజులేక మూడు ఏండ్లుండును. అంతట అల్లుని సంతతివారు రామరాజు అనేవాడు పుట్టును. అతనికి పట్నముగట్టే సమయమందు అనేకదుర్గాలు అనేకబలాలు కూడును.దుర్గాధిపతులై మల్లుబడుదురు. తామే రాజులై యేలుచూ ఉందురు. ఆ సమయమందు రామరాజు పోగాను చిక్కిన బలం చేత పట్టుకొని విభురాముఢు అనేవాణ్ణి సహాయం చేసుకొని విజయనగరం ఏలుతూ ఉండేటప్పుడు చెన్నబసవన్న ప్రమథుల కొరకు ముప్ఫైఆరు పయనాలు చేసి ఆమీదట పయనమై ఊరికిపొయ్యే టప్పుడు వారి వెంటపడి పోగాను వారిని జూచి ఓకర్మలారా! మీరు మా వెంటవచ్చేటందుకు మీకు ప్రాప్తిలేదు. మీరు చేసిన ఉపకారానకు వెయ్యేండ్లు రాజ్యభోగము ఇస్తిమి. అని ఆశీర్వాదము చేసి వారు పయనమై పొయ్యేటప్పుడు, ఈవాకిలి పాపపు కన్నులకు కానరాకపోవు గాక యని శాపం పెట్టిపోదురు. అంతట వీరు కురుమసంతతి కృపగలవారు ఆ సంతతి నూరు ఏండ్లు ఏలుదురు. వారు సత్యాన ఎనమన్నూరు ఏండ్లు ఏలుదురు. ఆమీదట ఏలే లక్షణాలు వినవో బసవన్నా అని చెప్పును. విరసంచేతనున్ను చరాచూరుల చేతనున్ను కులనాశనం చేస్తూ స్త్రీలను పట్టుకుంటు బాలల జంపుకొనుచు గోవధ జేసుకుంటూ ఈలాగున ఏలే సమయమందు గజపుత్రులు ఏగుదురు. వారు రామరాయలు ఏలే లక్షణాలు విని చూడబోదురు. వారిని ఎదురుకొని తోడితెచ్చి దివాణములో పంక్తిని



భోజనాలు చేతురు. చేసేటప్పుడు పంచతాండవమూర్తిని జూతురు. అంతట ఈదేవుడు మాయిలవేల్పు ఈ మూర్తిని మాకు ఇవ్వమని అందురు. అనంగానే మావారు మిమ్ము జయించి తెచ్చినారు మీరు మమ్ముల జయించి మీచేత నాయెనా మమ్ముల గెలిచి తీసికొని పొమ్మందురు. అంతట వారు భోజనము చాలించి పింగళస్వరాల పొగమంటలు వెళ్లగాను కోపము చేత వెళ్ళి పోదురు. ఢిల్లీదనుక తరముకొని పోదురు. ఇది తప్పరాదు. ఇందుకు గురుతు ఏమంటేను ఈనీమాలు నేను పలికిన వాణ్ణి గాను. ముందు ప్రభుస్వామి పలికినాడు. ఇందుకు గురుతు చెప్పుచున్నాను. విను. మా స్వామి కళ్యాణానకు తూర్పుదిక్కునఅయిదు ఆమడలో మేడిచెట్టు పనసపండు పుట్టుటే సాక్షి. రాయలు గజపతులు కొట్లాడిపొయ్యే ముందర ఆ తర్వాత నుండి రాజులుపాడిదప్పి కొడుకులు తండ్రిని చంపి, తండ్రి కొడుకుల జంపి, అన్న తమ్ముల చంపి తమ్ముడు అన్నను చంపి యీ క్రమాన ప్రజలు పాలనక్రమాలు తప్పి చరాచూరులు బట్టి దేశాలలో లింగాలు కొట్టివేసేరు. గుడి తీసి మసీదులు కట్టేరు. దొంగల నేలించి బందిపోట్లు కొట్టేరు. ఈ తీరున కలియుగం ఉండును. అటు తర్వాతను అతిశయంగల దైవాలు అరటి పొరలో కాయవలెనే దాగియుందురు. బూడిద గప్పిననిప్పువలె దాగి .యుందురు. అట్లా ఉన్న సమయమందు దృష్టం ఏమంటేను ఒక శివభక్తుని ఏకలింగ నిష్ఠపరుని దెచ్చి సోమసూర్య వీథులలోను బండిమీద పెట్టుటే సాక్షి. శివభక్తి దూషణాలకు అది మొదలు. అతగాణ్ణి కొట్టంగాను ప్రజలు చూచి 'చూస్తిరా శివున్ని పూజించిన ఫలము! శివభక్తి యీపాటు ఆయెగదా' అని దూషించేరు. వార్లలో గలిసి యిక నెక్కడి శివుడు? ఎక్కడ బసవన్న? యెక్కడ గురుచలేశ్వర్లు ? అని నమ్మక యీలాగున పల్కి భ్రష్టులై చెడిపోదురు. వారు యమపురిపాలై పోదురు. దాని తర్వాతను శివపురాణాలు చదువగాను హాస్యం చేసే వారు ఏడు జన్మాలు నక్కరూపులై పుట్టుదురు. మరియొక పురాణ దూషణవల్ల సూకరరూపాలు ప్రాప్తించును. అని చెప్పుటే సాక్షి. ఆనక్క రూపంవాడు శివుని మీదను ఏడు ఆగమాదులు చేసి పవిత్రుండౌను. ఆమీదట పాండు దుర్గానకు ప్రతికోట పుట్టును. దానివెనుక ఆడుగుద్దలవాండ్లు పుట్టుదురు. ఆసనాన వృషణాలు అయ్యేను. తర్వాతను దక్షిణ దేశాన నున్న లింగాలు కొట్టివేసేరు. ఆముందర జనులు ఏలుటచాలిన దనుకా లింగాలు అంతరంగమందు ఉండును. అదియెందుకు

అంటేను ముందర జనులు దృష్టతనువులున్ను చండాలమున్నూ వావివరుసలు దప్పును అందుకు లింగమూర్తులు మనసుకు దోచును. ఖేచరాన నుండును. అనాచారాలకు అబద్ధాలకు చాలవెరచి ఉందురు. లింగమూర్తులు ఖేచరాన ఉండుటకు ఏమి గురుతు అంటేను ముందర గురువులమీద శిష్యులున్ను రాజులమీద బంట్లున్ను తిరుగ బడుదురు. వీటికల్లా గురుతు ఏమంటేను మీరు కూర్చున్న అనుభవ మంటపములోను తురకలు ఫకీర్లు ఉండుటే సాక్షి. ఇదిగాక చెన్నబసవన్న వీరవసంతరాయలు వచ్చిన దనుకా యాభైఆరుదేశాలల్లోను మహిమలు మూర్తి మంతాలు శీలాలు ఆచారాలు తత్వాలు జ్ఞానాలు ధర్మాలు షట్స్థల నిర్ణయాలు ఆత్మోపధర్మాలు అన్నిన్ని ఉళిమాళిగలో నిమిడి యుండును. అటుతర్వాత కార్తీక శుద్ధ ౧౫ లనాడు ఆస్తంభాననున్న బంగారు రేకులు ఒలుచుకొని పోవుటే సాక్షి. ఇందుకు దృష్టం ఏమంటేను ఈభీమనదిలో తీర్థము ఉప్పులవుటే సాక్షి. అందుకు గురుతు అసత్యాలు ఆగడాలు అధర్మాలు గల జనులు ఏలుదురు. ఉన్నటువంటి తొమ్మిది నవనంది ద్వారాలు కోటకు చేర్చుకునేరు. ఆముందర ప్రజలందరును శుభాలు తప్పిని, చరాచూరుల పాలు అయ్యేరు. బిడ్డలు పెద్దతనాలు సాగనివ్వక పొయ్యేరు. బాలనాయకం బహునాయకం స్త్రీనాయకం అయ్యాని. ఒక జాతివారు ఒకజాతితో కలిసి పొయ్యేరు. విచిత్రమతం పుట్టును. అది యేమంటేను శరణ స్థలం పేరు కలిగిని. సర్వాంగప్రసాద మనే హేళిక మంత్రం పుట్టును. దానివల్లను కృష్ణవేణి తీరమందు ఎర్ర గొల్ల క్షత్రియులు ఏగుదురు. వారి సతులు వీరసేవ్య రహస్యంగాను లింగవంతులై గురుచరేశ్వరులు వైష్ణవమతం చేత ఉందురు. అప్పటికి రాయపట్నము రాజులేక చెడిపోవును. చెడుగుణాలై పోవుదురు. దీనికి సాక్షులు రామరాయలు ఢిల్లీ రాజును కలుసుకొని వచ్చి మహాయుద్ధముచే అతని తలకోసికొని కాశికి వచ్చి వరగుమ్మటములో నిలిపేరు. నాటికి కలియుగము లెక్క లేదు. రణస్థలి తర్వాతను ఏమి పుట్టు నంటేను అందున్న చరమూర్తులు షట్స్థల బ్రహ్మమనుకునే వారు. ఆతతాయులు ప్రమథులున్ను మొదలైనవారు తమలో తాము కలహంబు ముట్టించుకొని చాలా బాహ్యమై తమలో తాము దూషించు కొని వచనాలు ప్రతి నియమాలు స్థలనిర్ణయాలు తమతమధర్మాలున్ను స్వరూప జ్ఞానాలున్ను అతి శాంతత్వాలున్ను అన్ని తామసులై ఆచారాలు ఎంచుకుంచూ తలలు పగల కొట్లాడు



కుంచున్ను రోష చిత్తులై గంజాయి నల్లమందు తిను కుంచూన్ను అజ్ఞాను లైపోదురు. అసత్యాలున్ను అధర్మాలున్ను అనాచారాలున్ను అదే ఆచారంగా నడతురు. గురువుల మనుకునేవారు గురుతు లెరుంగక అజ్ఞానులై బోధులు గాక తత్వరహస్యములు గానక కామక్రోధయుక్తులై ఒకరి ఆచారాలు ఒకరు అసహ్యించుకుంటూ శిష్యుని విత్తానకూ, స్త్రీలకున్నూ మోహపడి భవపాశాలకు లోను అవుదురు. సద్గురువులు దబ్బర లయ్యేరు. కోటికి వకరు గలిగేరు. జ్ఞానముగల గురువులు శిష్యులు లేక పొయ్యేరు. గురువులలోను శిష్యులలోను గురుదేశి ఉందని నమ్మక గురువుల లక్షణాలు ఎంచుకుంటూ ప్రకృతి చుట్టాలకు మిద్దెలు, పట్టెమంచాలు పరుపులున్ను వేతురు. గురువులకు దొడ్లు కొట్టాలున్ను పిడకగూళ్ళున్ను తోటలు జూపి దొడ్లు చూపి జీతగాండ్లకు ఇచ్చినట్టు భత్యాలు ఇచ్చేరు. వంచన లేక నడిచే గురువులు అపూర్వ మయ్యేరు. గురువుల సందుశిష్యుల సందు మేర గల్పించుకునేరు. ఏడాదికి ఒక వరహా ఒక మాడ ఒక పావలా అని మేరజేసి భవపాశాలు పొంది పోదురు. ఇట్లు శిష్యులు అసంఖ్యాకులు గలరు. గురువుల లక్షణాలుదప్పి శిష్యుని అజ్ఞానతిమిరంబు బాప లేక సుజ్ఞానుల జేయలేక వృథాక్షేపం చేస్తూ, శిష్యుడు ఇచ్చే ముప్పాతికలో అడ్డుగ తక్కువైతేను దూషించుకుంటూ పొయ్యే గురువులున్ను అసంఖ్యాకులు గలరు. ఈ అసత్యానకు మహాలక్ష్మి సైచక అనాచార్యాలు అతిహీనుల చేరును. బలవంతులు బలహీనులయ్యేరు. మాలమాదిగెలు కోయబోయలు అధిక సంపన్ను లయ్యేరు. వారు గుణవంతులై కులజనుల మని మెచ్చుకునేరు. వారిని బ్రాహ్మణులు మొదలైన వారు కొలుస్తూ ఉందురు. వారికి వెరవబోదురు. అష్టాదశ వర్ణాల వారున్ను పైకమున్న చోటనే కుడుతురు. వారు వీరు ఏకభోజనం చేతురు. వెల్తికులాలకు పోరాడుదురు. ఆ సమయమందు ఒక చుక్క పొడుచును. అనేక క్షామం తగులును. పశువులు హతాహత మవును. మేలులేక పోవును. అనేక ప్రజనాశన మవును. అనేక భూమి పాడవును. లింగ శూన్యమై పోవును. వ్రతాలు మానును. ఆచారహీనులై పోదురు. నిష్ఠలున్ను జపతపాలున్ను నీమాలు సహించక పోదురు. ఆసమయ మందును రాయపట్నాలు నాశనమై పోవును. విరూపాక్ష లింగము గుప్తమై లోనికి దిగిపోతూ ఉండును. ఆ దేవాలయములోను అతిథులు ప్రబలమౌదురు. ఆదివాణములోను పెద్దగూబలు పొర్లును. ప్రజ శూన్యమై మూగ చెవుడు అయి

మొండి ముక్కిడి వాండ్లై, నివాసం చేసుకొని యుందురు. రాజు సుఖం లేక పొయ్యీని. రాయభూమి అంతాను ఉరిమంటల చేతను తాపానబొంది యుందురు. ఆ సమయమందు దృష్టం ఏమంటే ఈ గుళ్ళలో ఉన్న వీరన్న బయలై పోవును. అతడు స్త్రీలను విషయించి మాయమై పోవును. ఇందుకు గురుతు రామరాయుడు పోయిన వెనుక పెనుగొండ నరసరాయుడు పదమూడు ఏండ్లు ఏలి పడిపోవుటే సాక్షి. ఇందుకు దృష్టం ఏమి అంటేను ముందర ప్రతాపరుద్రుడు ఓరుగల్లు ఏలే సమయమందు తిరుపతి వెంకటేశ్వరుని నమ్మిన వైష్ణవుండు సేవ్యమై లింగవంతు డవుటే సాక్షి. మరి ఒక దృష్టం తెలంగాణ్యములోను కృష్ణాగోదావరి మధ్యమందు విప్ర మతములోను షణ్మతానువర్తియై శివసమ్మతస్థుడై మహాదేవనామం చేతను ప్రసిద్ధికెక్కి అనేక గుడిగోపుర సకలదాన హోమాలు ప్రతిష్ఠలు చేసి సకలశాస్త్ర ఆగమ పురాణాలు ప్రకాశమయ్యే టట్టుగాను ప్రసిద్ధి కెక్కించును. వారిని శివుడు గూడుకొనుటే సాక్షి. ఇందుకు గురుతు గ్రామమందు ఊరప్రతిమలు ఊగులాడుటే సాక్షి. ఇంకా దృష్టం ఏమంటేను ఈ కల్యాణానకు వాయువ్యమూలను సముద్ర తీరాన గంగ అనే భూమి కలుగును. అక్కడ రాయదుర్గం అనే దుర్గం గలుగును. ఆదుర్గంభూమి లోను ఆరెజాతివాడు అనిపించు కొనును. వాని పారంపర్యము ౫౫ యేండ్లు తిరిగిన వెనుక సదాశివనామం చేత బుట్టును. వాడు ప్రసిద్ధికెక్కును. వాని లయకాలానకు ఏమి చేసి పోవునంటేను రాజులకు మెడచిక్కమై చోరత్వము చేత అన్యరాజ కోలాహలుడై అసహాయ శూరుడై అంత్యమందు ఈ కల్యాణానకు ఈశాన్య భాగమందు రౌద్రయనే దుర్గం గలదు. ఆ దుర్గం దనుక దండు ఎత్తును. మహాబలవంతులైన దొరలు సంసారుల అనేక బాధలు పెట్టుదురు. చారాచూరులు చేసును. రామాద్రికి తూర్పుదిక్కుగాను దక్షిణాభిముఖుండై స్వస్థానానికి విజయుండై చేరును.చేరి అయిదు యేండ్లకు మృతినొందును. అదిఅయ్యేముందర కాశీక్షేత్రమున్ను కుంభకోణమున్ను గోకర్ణమున్ను వీటి మహత్తులు తప్పీని. కంచి మహత్తులు మించి పొయ్యీని. ఆ తర్వాతను పురాతనులు ఉదయ మయ్యేరు. భవులు భక్తు లయ్యేరు. ఆ సమయమందు ఈగణాంగులు ఆదుకున్నమాట సరివచ్చీని. పదమూడు ఆనందలకు ఉన్నవారికి దరిసెనమయ్యీని. ఆలాగే పదమూడు ఆనందలలోనున్న మహిమలు చెప్పుచున్నాను. వినవయ్యా బసవన్నా ప్రభురాయా కల్లలు తటపట మున్నా



అనాచారమున్ను చండాలమున్ను ఘనమయ్యీని. పతివ్రతలు భంగ పడుదురు. ఇలను వ్రతాలు చెడును. వావివరసలు జాతినీతులున్ను దప్పిపోదురు. మానవులు అనాచారానికి బోదురు. సదాచారానికి చేరరు. ఆ సమయమందు దృష్టం ఏమంటేను ఈ కల్యాణానకు తొమ్మిది ఆమడలోను ఇద్దరు కాయముతో కైలాసము పోదురు. ఆ పొద్దున పువ్వుల వాన కురిసీని.ఈ త్రిపురాంతకుని గుడిముందర కంబాన ఉన్న రాతి తేలుబయలై పోవును. ఇకరాతికోడి కూసి బయలై మాయమై పోవును. ఈచెరువులో నీళ్ళు ఎర్రనౌను. రాతి నంది లేచినాలుగుదిక్కులకు ఉరుకులు పెట్టును. ఇక గణంగులు వచ్చే ముందర వన్నెలాపురి మల్లికార్జునుని నొసలకన్ను నెత్తినజడ నోట అమృతము గురుచుటే సాక్షి. ఆమాటలు అన్ని దేశాలవారు వినేరు. అంతట రాయకం తీరును. ఆతర్వాతను రాయసింహాసనం లేచును. రాయదళం కూడి కాశీక్షేత్రానికి పోదురు. పొయ్యేటందుకు గురుతు ఏమంటేను మునుపు చెప్పిన కురుమ వారి సంతతి దక్షిణాభిముఖులై రాజుల జయించి రామేశ్వరానికి మొగమై పోగాను అప్పుడు రాయదళము వారిని తరుముకొనిపోయి అనేక యుద్ధములు జేసి నర్మదలో కత్తులు కడిగి కాశికి వచ్చి రామరాయల తల జూతురు. అతగానికి ఉత్తర క్రియ చేయంగాను ఒక దృష్టము జూపీని. ఆతల ఉత్తరముఖమై స్వర్గానకు విజయుడై పోవును. అంతట రాయదళము ఒక్కరైన పడక విజయనగరానికి వచ్చి, రాజ్యము పాలించేరు. ఇది అయ్యేటందుకు హస్తినాపురాన మహామారి అనే దుర్గి పుట్టీని. అది పుట్టి రామేశ్వరముదనుకా సుడిసీని. ప్రజల అనేక బాధలు పెట్టును. భస్మీపటలము చేసును. ఉరి మంటలు పుట్టించు కుంటూ రాజ్యము చాలా చెరుచును. అది రౌద్రసప్తకములో బుట్టీని. అది పుట్టి వింధ్యలంకసందు ౧౭ కోట్ల పునుకలు పడుటే సాక్షి. ఆముందర కష్టాలు చాలా కలిగీని. ఆ సమయమందు విభవ పంచకములోను ధూమ కేతువు పొడిచీని. ఆది రాజక్షయం ప్రజాక్షయం. అంతట రాజ్యాధిపతి దక్షిణాభిముఖుడై రామేశ్వరము దిక్కు వచ్చి లయమై పొయ్యీని. నాటికి కలియుగం లెక్కలేదు. ఆ సమయమందు రాయబలం విజయనగరం ఏలుచూ ఉండును. ముందర జెప్పిన గజపతిరాయలు నాటి తాండవమూర్తిని ఇవ్వక పోయినందుకు అనేక కోపముల చేత ఢిల్లీ రాజుల పొడగని వారు తాను ఏకస్థులై యున్న గుర్రా సంచిని జేసుకొని బిరుదు కోట దుర్గానికి వచ్చి యీ కల్యాణములోను

రాజమార్గాను వెళ్ళిపోయి అనెగొంది చేరి లక్షా తొంభైయేడు తేజీల వెంటబెట్టుకొని ఉన్న తురకలెల్లా అడనే చేరుదురు. నాలుగు లక్షలయాభై ఆరు తేజీల వెంట బెట్టుకొని ఉన్న తురకలెల్లా గూడి విజయనగరము చాలా చరాచూరల బట్టీని. నికాలు చేతురు. ఆ మంది తొక్కుడుకు.ఒక కోటి తిమురులై పొయ్యీని. ఆ సమయమందు కూడలి సంగమేశ్వరుడు నందినెక్కి తానే రాజై అంతరాన ఉండి చూస్తూ ఉండీని. అంత రాయలు మూడునెలలు అతిఘోర యుద్ధము చేయగాను పుట్టెడు నల్లపూసలు రాలును. అంతట రాయలపుట్టుబడి అస్తమయమై పోవును. ఇందుకు సాక్షి యేమంటేను అది అయ్యేముందర ధూమకేతువు పొడిచీని. ఒక నెలలో రెండు గ్రహణాలు వచ్చీని. అధికమాసములోని కాముని పున్నమ అయ్యీని. అప్పుడు లోకానకు ప్రళయం వచ్చినట్లుగానే ఎండీని. ఎనిమిది దిక్కులకు ఒక్కటే మంట మండీని. నిప్పుల వాన కురిచీని. శ్రీశైల యాత్రలు దప్పీని. ఆరెదొండ గుడియంతా చుట్టుకొనేని. పెద్దపులి పిల్లలు పెట్టీని. తొట్లలో ఊగీని. పాతాళగంగ నీళ్ళు ఇంకీని. ఆక్షేత్రాన కల్లు చేపలు అమ్మేరు. వేశ్యలగుడిసెలు ఎగసీని. కాకులు మడసీని. జంగమ రక్తము పడీని. ఆసమయ మందు జనులమొర ఆలకించేటందుకు రాజు లేక పొయ్యీని. రాజులు ఐక్యమైన వెనుక ప్రజలు చరాచూరు కలిగి ఉండీని.చాలా జనంగలవారికి ఇంటికిఒకరు లేక పొయ్యేరు. ౩౬౦ రోగాలు ఎగసీని. వైద్యం పారక పొయ్యీని. పదిహేను ఏండ్ల వాండ్లు జారత్వం చేసేరు. చతురంగబలాలు లేకపొయ్యీని. ఆసమయమందు మాలమాదిగలు కోయబోయలు చాలా ఉండాలు అయి ఉందురు. వారు ఉన్నద్రవ్యం కూడబెట్టి లయమై పోదురు. అది ముందరను వీరవసంతరాయలకు చేరును. ఆ వీరవసంతరాయలు గౌతమీతీర మందున క్షత్రియ వంశములోను వైష్ణవ మతంలోను పుట్టును. అతడు పుట్టినందుకు గురుతు ఏమంటీను నొసలకన్నులు గలవారున్ను అరికాలకన్నులు గలవారున్ను రెండు తలలవారున్ను అనేకమాయలు చూపేవారున్ను బుట్టుటే సాక్షి. మరియొక దృష్టం ఆరుమతాలలోను మూడు మతాలు అయ్యీని. ఆమూడు మతాలవారున్ను పురాతనము వచ్చే ముందర ధర్మాలు తప్పి నడుతురు. అది యేలాగున అంటేను సార్థమతంవారు తీర్థాలు అమ్ముకునేరు. జపతపయజ్ఞ ఫలాలు పీరులపాలు చేతురు. దురన్న పాయ సాన్నాలు భుజియించి అదే ఆచారంగా నడిచేరు. ఈలాగున నడిచి



యమపురి పాలగుటే సాక్షి. ఆతర్వాతను వైష్ణవమతం వారు శంకరనామముచేత బుట్టీని. అతడు షణ్మతానుకూలి అయ్యీని. అతడు ఐక్యమైనదనుకా వైష్ణవులు ఒకతీరుగా నడుతురు. అటు అవతల బహునీమాలు బహుసేవ్యాలు బహుమంత్రాలు బహుతంత్రాలు మరియు హుతాగ్నిగుండాలు రేషణవ్రతం మొదలుచేసి నడచి రాక్షసబాధలపాలై పోవుటే సాక్షి. ఇక సేవ్యమతంవారు బసవన్నా గురు లింగ చరేశ్వరులున్ను ఏక భావనలున్ను భజనలున్ను లింగ నిష్ఠలున్ను కలిగియుందురు. ఆముందర శరణస్థలం మొదలు చేసి వీర వసంత రాయలున్ను చెన్నబసవన్న గారున్ను వచ్చినదనుకా భక్తులు భక్తస్థలాలు తప్పి నడిచేరు. ఆ మహేశ్వరులు ఆచారాలు తప్పించి కామక్రోధాలపాలు అయ్యేరు. భక్తులు చాలా కష్టపడేరు. తమస్థలాలు విడిచి సంస్థాలపాలు అయ్యేరు. మంత్రతంత్రాల జిక్కి తాము చదివే పురాణాలు వచనగ్రంథాలు కట్టిపెట్టి తమలో తాము హింసలు జేసుకొని హరగురువచనాలు ప్రమాణాలు తప్పించి బహుబహు నీమాలు గురువుల ఉపదేశక్రమాలు దప్పి పూర్వపు గురువుల విడిచి మరియొక గురువుకై భ్రమసి పొయ్యేరు. గురులింగ చరేశ్వరుల కని ధర్మాలుపలికి అడిగి తెచ్చిన ధర్మద్రవ్యం ఇంటనున్న వారికిన్ని పడుచులకున్ను పెట్టేరు. ఆ సమయమందు మహేశ్వరుడు బిక్ష అని వస్తేను అయ్యా అంతకు మున్నుపే రాకపోతివి అని గదమా యింతురు. మల్ల దోలుదురు. ఎవరైన పెద్దలు అనుభవముచెప్పితేను తల ఊపుచూ వినేరు. లోపల విషమగుణాల మునిగి ఉండేరు. శివఅభిమానం తప్పేరు. గురులింగ దూషణలు వినేరు. అన్యదైవాల స్తుతులు చేతురు. తమలాంఛనాల మీద తామే ఆశ పడుదురు. మరియొక విచిత్రం నడచేరు. తమతమ పీఠ లింగాలు తప్పించి గద్య పద్యాలున్ను పలుకులున్ను రథాలున్నుకల్పించి యిష్టలింగ ప్రణవమంత్రాలు తప్పి భక్తులు భవులు అయ్యేరు. స్త్రీలలోను పురుషులలోను మరిన్ని వ్రతాలు నడిచేరు. కామతంత్రాల పాలు అయ్యేరు. స్త్రీలు నిజపురుషుల నొల్లక పొయ్యేరు. ఆడంబరాలు పలికేరు. భక్తవిభేదాలు చేసేరు. భక్త మహేశ్వరుల నందరిని ఒకతీరున జూడక విశ్వాసదాక్షిణ్యం భక్తి నడచేరు. ఒకరి క్షేమాలు ఒకరు జూడక పొయ్యేరు. శివఅభిమానం వచ్చునపుడు పారిపొయ్యేరు. నాటి మర్యాదలు నాటికే గాక నేడు ఎట్ల చెల్లీని అని ఉదాసీన వాక్యాలు ఆడేరు. ఆ సమయమందు ప్రభుస్వామి భక్తులైనవారి యిండ్లకు

పోయి రూపం చూపితేను మూఢులై తెలియక పోదురు. పురాతన వచనాలు చదివేరు. తమ రచనలు గల్పించేరు. అంగనా సతుల మోహముచేత భక్త వంచన చేసి తామసులయ్యేరు. కామిత ఫలాలు చెరుచుకునేరు. నవ్వులుగాగ కడు మూఢులై భవభవాంతరాలపాలై పొయ్యేరు. భక్తులుభవులు అయి చెడిపొయ్యేరు. నిజమైన వారు తమమహిమలు చెడకుండా యెరుక పడకుండా బూడిదెగప్పిన నిప్పువలెనే అడగి యుండేరు. ఆ సమయమందు ఢిల్లీ రాజు నాశనమై పొయ్యేరు. అనేక శరీరాలకు ఆపదలు వచ్చీని. ఆ సమయమందు విరూపాక్ష లింగానకు తల్లడమయ్యీని. నాటికి కలియుగము ఎంతాయెనంటేను ౪౮౫౪ అయ్యీని. ఆ తర్వాతను పూర్వభాగంబున సరస్వతీ తీరంబున విశ్వకర్మ జాతంబులోను ఒక పుణ్యుండు పుట్టీని. అతడు శివస్వరూపమయ్యీని.ధర్మంగా నడిపించీని. శ్రీశైలప్రదక్షిణాలు చేసీని. కల్యాణద్వారానకు వచ్చీని. అక్కడ కొన్ని దినంబులు జ్ఞానాదికంబులు దెలిపీని. అక్కడనుంచి వారణాసి క్షేత్రంబునకు వచ్చీని. నిజసేవ్యా చారంబులు అనేక బ్రాహ్మణులకు జ్ఞానాతిశయం తెలిపీని. తమసముడుగా ఉండీని. పూరాతనుల దరిసెన మయ్యీని. ఇందుకు సాక్షి యేమంటేను ముందర రామేశ్వర క్షేత్రమందు అయిదు పురుషుల నేల అంతా యేకమంట వలెనే అయిదు దినములు ఉండుటే సాక్షి. పురాతనమతం కిరాతకమత మయ్యీని. విభూతి రుద్రాక్షలు అపూర్వ మయ్యీని. వైష్ణవమతం మించీని. శివభక్తులు నూటికి ఒకరు ఉండేరు. శ్రీశైలబిళములోను ఉన్నవారు సుఖాన ఉందురు. ఆ తర్వాతను నిప్పుల వాన కురిసీని. గుండ్లు దేలీని. బెండ్లు మునిగీని. మారిదుర్గి అష్టదిక్కులబాధ పెట్టును. అప్పుడు ఈశాన్య మందున్న వారు చేటులేక యుందురు. బలవంతులైన సంసారాలు మ్రింగును. ధూమకేతువు పొడిచీని. అది పొడిచేముందర ధాన్యవృష్టి అయ్యీని. అది అనుభవించి సుఖం దప్పేరు. రోగాలు ఘన మయ్యీని. కాశిక్షేత్రాన ప్రజలకు ఆపదలు వచ్చీని. ఇందుకు గురుతు కలిగీని. ఈ కల్యాణానకు ప్రసాద గుండములోను విభూతి బండారం బైటపడును. మీరు చేసిన వచన బండారం ఒక శివభక్తునిచేత ప్రకాశమయ్యీని. మరి ఒకమఠస్థల మహేశ్వరుడు బైటపడును. ఆ సమయమందు జనులు చాలానష్ట మయ్యేరు. చచ్చిన వారికి ఏడ్చేవారు లేకపొయ్యేరు. అగ్ని ఆరీని. దివ్యప్రకాశాలు లేకపొయ్యీని. విభూతి రుద్రాక్షలు పంచాక్షరి శివపూజలు మరచేరు. వీరభోగవసంతరాయలు చెన్న బసవన్న



వచ్చినదనుక శశభక్తి అపూర్వమయ్యీని. అంత పర్యంతం దానధర్మాలు ఆచారక్రియలు శీలాలు నీమాలు సద్గుణాలు అన్ని ఖేచరాన ఉండీని. వీరవసంతరాయలు పదకొండోయేట బయట వెళ్ళును. పంచ రాత్రిళ్ళు శ్రీరంగాలు జూచి అనేక వైష్ణవులు కొలువంగాను త్రిపురాంతకానకు తూర్పుకడగా శ్రీశైలంమీదికి వచ్చును. వచ్చి శ్రీశైలంమీద లింగమును చూడకనే గంగలోకి దిగీని. గంగలో అనేక భక్తులున్ను ప్రమథులున్ను పురాతనులున్ను లింగవచనాలుచేసుకుంచూ సభ అయి కూర్చుండగాను వారికి శివరూపం శివపూజలు చూచి హాస్యంచేత రూపించి పలుకుదురు. ఈ గంగ విష్ణుపాదమందు పుట్టినది అని వైష్ణవులు అందురు. అనంగానే విష్ణుపాదమందు పుట్టినందుకు ఏమి గురుతు అని అడుగుదురు. వీర వసంత రాయలు వినును. విష్ణుపాదమందు పుట్టినది అని ఒకరు వేడుకొండి అనెను. అనంగానే వారు ఒక వాక్యంబు పలుకుదురు. 'ఓరి ద్రోహి ఈ గంగను ఇంక చేస్తూ ఉన్నాను. మీరు వైష్ణవులు నించండి' అని అందురు. అనంగానే మీరు ఈ గంగను ఇంకచేయండి. అందుకు మీరు నించకుంటే యేమి గుర్తు చెప్పు మనేరు. అది మేము నించలేకుంటే మాయీలాంఛనాలు ఈ ముద్రలు ఈ మతధర్మాలు ఈ వైష్ణవ సంగం విడిచి మీ భక్తుడనై శివచిహ్నాలు దాల్చి లింగధారణై ఉండేము. ఇదే ప్రమాణం అని అందురు. అనంగానే అప్పుడు ఆశపడి ఒక మహేశ్వరుని గురిచేసి అందరు హస్తార్పితం విభూతి అతని పాదానికి ధరింతురు. అతని పాదం గంగలో పెట్టింతురు. అంతలో గంగోదకం అతని పాదమందు ఇంకును. ఇంకంగానే వైష్ణవులు తిరుగా నించలేక ముఖభంగితులై పారిపోదురు. వీర వసంతరాయలు ఇన్ని పౌరుషములు ఏల పలికితిరి అని అనెను. అప్పుడు వారు శరణనిరి. ఆ సమయమందు సూర్య కిరణాలు పారి చంద్రగుప్పుడు లేచును. కాకి చిప్పలతో నీళ్ళు తోడుకునేరు. అంతట వీర వంసతరాయలు భక్త మహేశ్వరులతో గూడిమల్లి కార్జునుని దర్శనానికి వచ్చును. వచ్చి ముఖమంటపములో గూర్చుండి వారికి శివలింగధారణ జేతురు. ఆ వెనుక మహేశ్వరుని దర్శనం చేయింతురు. అతని భక్తికి దేవుండు మెచ్చి అయిదువేల యేండ్లు రాజ్యము స్థిరముగా ఏలుమని శిరస్సున చేతులు బెట్టి రాజ్యం పట్టము కట్టును. అంతలో చెన్నబసవన్న చేరవచ్చును. అప్పుడు ఆచారవంతులు వీర దాసోహాలు మూడుకోట్లు వత్తురు. అయిదు వేలలక్షలు మూడు వేల స్థలాలు

బ్రాహ్మణులున్ను మాయకోలాహాలు వత్తురు. అప్పుడు వారితో కూర్చుండి వాయవ్య మూలకు వెళ్ళి విద్యానగరానకు వత్తురు. రాగానే రాయల దివాణములో సింహాసనం బయటపడును. అప్పుడు వీరు వసంత రాయలు విరూపాక్ష లింగానకు నమస్కారం చేసును. విరూపాక్ష లింగం వచ్చి ముత్యాల సేసలు చల్లించును. అయిదువేలయేండ్లు రాజ్యం ఏలుమని పట్టము గట్టును. ఆ సమయమందు కలియుగము ఎంతాయె నంటేను అట్టిమీద అయ్యాని. ఆ సమయమందు కూడిన మారయ్య కూతవేసును. ఆకూత విని కల్యాణములో ఉన్నవారు ఉళిబెళములో ఉన్నవారు ఇకను మనవారంతా వచ్చిరి అని అంత వెళ్లివత్తురు. ఇందుకు గురుతు ఏమి అంటేను పదమూడు ఆనందలలో మళ్లుదురు. ఇందుకు ఏమిగురుతు అనేరు. గ్రామమందు ఉన్న రాతి ప్రతిమలు ఊగులాడుటే సాక్షి. ఈ త్రిపురాంతకేశ్వరుని ముందున్న కల్లునంది రంకెవేస్తూ నందాపురం దాక పోవుటే సాక్షి. అప్పుడు వీరవసంతరాయలు చెన్నబసవన్న సకల సన్నాహాలతోను కల్యాణానకు వత్తురు. అప్పుడు బిజ్జలరాయుని దివాణము లోను రాయసింహాసనం బయటపడును. ముప్పదిఆరు హేమ కలశాలు పెట్టి శృంగారింతురు. అందులో చెన్నబసవన్నా మీరు మర్త్యానికి రాలేదు. కాని అంతా విశ్వాసముతోనే ఉందురు. ఓయి చెన్నబసవన్నా! అప్పుడే ఖేచరాన నున్న ఆచారాలు శీలాలు నీమాలు మూర్తీమంతమై నిలుచును. యాభైఆరు దేశాలలో హతశేషులై యున్నవారు రాజ్య బలం అరి అప్పనాలు బెట్టి కొలుస్తూ ఉందురు. చతురంగబలాలు కూడును. అన్యదైవాల శబ్దం చెవులబడకుండా కట్టు చేసును. సకలసన్నాహాలతో ఏక చక్రాధీశ్వరుడై యేలు చున్న సమయమందు శివపూజలు లింగ నిష్ఠలు గలిగి యుండును. వీరభోగవసంతరాయలు దిగ్విజయంచేత సత్యము తప్పక దర్మము నడిపించీని. కాశిక్షేత్రము ఉన్న మహిమలుచూపీని. సత్యము తోను నదులు నిండి పారును. కంచికుంభకోణం జాతర నడచీని. శ్రీశైల మహోత్సవాలు నడచీని. ఆ సమయమందు తాను వృషభ ధ్వజం పట్టించు కొనును. శివఅనుభవముచేత భక్త మహేశ్వర్లకు భృత్యుడై పాలించే సమయమందు అనిష్టాలు మాయలు మర్మాలు మాత్సర్యాలు అనాచారాలు కనిష్టపునడకలు మాయమైపోవును. అప్పుడు సమస్తమైన జనులు ఆనందము చేత ఉందురు. అన్య దైవ భజనలు లేక ఏకోత్తరిదృష్టిగాను సకల శుభాలు అనుభవింతురు. ఆనందము పొందుదురు. ౭౭౦లక్షలు౯౬ వేలు



౧౨వేల షట్స్థల బ్రాహ్మలు తమతమ నెలవులలో నిలిచి తమతమ కార్యధర్మాలు నీమాలుసలుపు కుంటూ ఉందురు. ప్రభుస్వామి అందరినీ రక్షించీని. అప్పుడు ధ్యాన పూజలున్ను ఫలించును. ఇది శివుని ఆన, తప్పరాదు. ఈవాక్యాలు కల్లో నిజమో యెరుంగము అనేవారు ఎవరు గలరో వారికి చంద్రసూర్యు లున్నంత పర్యంతం రౌరవాది నరకములు తప్పరాదు. ఇది దూషించినవారు హాస్యం చేసినవారు శతకాలాలు నరకద్వారాన పడుదురు. సమస్తమైన బాధలు వచ్చును. సందేహము లేదు. ఇవి సర్వజ్ఞుని వచనాలు. సర్వసమ్మతము మోక్షమార్గము అని నమ్మిన పురుషులు ఇది విని కృతార్థులౌదురు. ఇవి శివుని గూడిన పలుకులు. ఇవి విని జనులు కృపచే ఉండేది.

# దశమాశ్వాసము

శ్రీమద్హృదయాంకుర పృథివ్యాపస్తేజోవాయురాకాశాది చరాచర భూతసృష్టి నిర్మాణ సంరక్ష శిక్షాదక్షులైన, సమస్త ప్రశస్త కల్యాణ భాజనులైన, శ్రౌతస్మార్త నిత్యకర్మానుష్ఠాన క్రియాతంత్ర జ్ఞాన వ్యవహారహేతు భూతాత్మకులైన, సాంద్ర సింధువులైన, బ్రహ్మాయు నిర్మాణ ప్రమాణజ్ఞులైన , సమన్వితేంద్ర సప్తఋషి గ్రహనక్షత్ర దేవ దైత్యమానుషాది పంచభూతాత్మక విశ్వప్రతిష్ఠాపనా చార్యులైన, సకల గుణగణాలంకార లక్షణ లక్షితులైన, మత్స్య కూర్మవరాహ నారసింహ వామన రామ రామ రామశ్చ బౌద్ధ కల్కి కృష్ణాద్యవతార మూర్తులైన మణిగణఖచిత కూర్మ సింహాసనాధిష్ఠాన ప్రాజ్య సామ్రాజ్య ధురంధరులైన, అనంత లక్షణ లక్షిణ గుణగణ శ్రేష్ఠులైన సురగరుడోరగ యక్షరాక్షస కిన్నర కింపురుష సిద్ధ విద్యాధర మహాసేవ్యమాన పాదారవిందులైన, చతుర్దశ భువనాది ప్రత్యుత్థాన నిత్యాభ్యుదయంబై విశేషులైన చండమార్తాండ మండల నివాసులైన, శుక్లబీజ జ్యోతిర్బీజ తేజోవిరాజితులైన, పరబ్రహ్మమూర్తులైన, నిరంతర వైకుంఠులైన, నిత్య సత్య విలాస కైలాసులైన శుభలక్ష్మీ సమేతులైన సనకసనందన సనత్కుమార శుక శౌనక జనకజప్రముఖ సేవకమనోహర అరవింద సందోహ నిష్యంద మకరంద పానాసక్త చిత్తమిళిందమిళితాయమానులైన, హిరణ్యాక్ష హిరణ్యకశ్యప రావణ కుంభకర్ణాది దనుజభంజన చతుర్విధోపాయపరులైన అపభ్రంశాభ్రతేజోమూర్తులైన, జలాభ్యుదయ విజయనగర సంపూజ్య రాజ్యాభిషేక పరబ్రహ్మ కల్పానుకల్ప నిరంతరానంత తపో నిష్ఠాగరిష్ఠులైన, శాశ్వత విశ్వరూపులైన రాజశ్రీ వీరధర్మరాజు లయ్యవార్ల కుమార వీరధర్మజునిచేత వ్రాయించిన నమ్మిక నిరూపం. శుక్ల సంవత్సరమునకు ప్రతినామమైన భార్గవ నామ సంవత్సర వైశాఖ శుద్ధ ౭లు సోమవారంనాడు ధనుర్లగ్నం పుష్యమీనక్షత్రములో ప్రథమ పాదమందు సూర్యమండలాన నుంచి అనేక దివ్యభూషణాలు ధరించుక దివ్యరథ మెక్కి సకల దేవతలు సకల మునులు రథగజ తురగంబుల నెక్కి కొలువగాను, అప్సరః స్త్రీలు ఆడగాను, గంధర్వులు పాడగాను, కిన్నర కింపురష సిద్ధ విద్యాధర ప్రముఖులు సేవిస్తూ రాగాను, వైశాఖశుద్ధ ౫లు కొలువు పాకకు వచ్చి అక్కడనుంచి అహోబిళానకు వచ్చి



సప్తమినాడు సూర్యనందికి వచ్చేము. ఇందుకు నమ్మిక యేమంటిరా యన మఖ నక్షత్రానకు అగ్బరిగుర్రాలు తుంగభద్ర నీళ్ళుతాగినదే మొదలుగాను ప్రజాక్షయమయ్యేదే గుర్తు. కృష్ణనిర్యాణం మొదలుకొని ౪౬౯౯ యేండ్లకు కలి రూపనాశనమయ్యాని. ప్రజోత్పత్తి సంవత్సర ఆశ్వయుజ బ౧౧లు నాడు కృష్ణనిర్యాణం. ప్రజోత్పత్తి సంవత్సరాననే పట్టాభిషిక్తులయ్యేము. వికారి మూడేసి విష్ణునామముల మీద వేంచేసి ఆరుమూళ్ళు పద్దెనిమిది అగుమీదటను ఉద్భవ మయ్యేము. అగ్బరిగుర్రాలు తుంగభద్ర నీళ్ళు తాగినదే మొదలుగాను మూడుదినాలకు వచ్చేము. మూడు దినాలు అనగా మూడు ఏండ్లు, మూడు నెలలకు ఈ తీరున ఇచ్చిన రూపం మొదలు పూర్వమందు అయోనిసంభవులమై అత్రిమహామునుల కుమారులమైన దత్తాత్రేయుల పేరు గలిగి ఆత్రేయగోత్ర ప్రసిద్ధులమై మహామునులతోడ పుణ్యప్రదేశములయందు అనేక బ్రహ్మ కల్పాలు తపస్సు చేసి బనగాని పల్లెకు వచ్చి ఆయా ప్రదేశంబున యాభైమూడు ఏండ్లు తపస్సు చేసి అందుండి వైకుంఠానకుం బోయి లక్ష్మీదేవికి మ్రొక్కి మాధవస్వామికి సేవచేసి చతుర్విధముక్తులు గైకొని అందుండి వైకుంఠ సమీపంబున అనేక బ్రహ్మకల్పాలు రాజ్యము చేసి ప్రథమావతారమెత్తి, ఆనందాశ్రమములకు శిష్యుండనై అనేక బ్రహ్మకల్పాలు తపస్సు చేసి రెండో అవతారమెత్తి, ఆనందాశ్రమాలకు శిష్యుండనై అనేక బ్రహ్మ కల్పాలు తపస్సు జేసి మూడో అవతారమెత్తి, ఆనందాశ్రమములకు శిష్యుండనై నాలుగో అవతారమెత్తి, ఆనందాశ్రమములకు శిష్యుండనై అనేక బ్రహ్మ కల్పాలు తపస్సు చేసి అయిదో అవతారమెత్తి, ఆనందాశ్రమములకు శిష్యుండనై అనేక బ్రహ్మకల్పాలు తపస్సు చేసి ఆరో అవతారమెత్తి , ఆనందాశ్రమములకు శిష్యుండనై అనేక బ్రహ్మకల్పాలు తపస్సుచేసి ఏడో అవతారమున, ఆనందాశ్రమములకు శిష్యుండనై అనేక బ్రహ్మకల్పాలు తపస్సు జేసి యెనిమిదో అవతారమున, ఆనందాశ్రమమున అనేక బ్రహ్మకల్పాలు తపస్సు చేసి తొమ్మిదో అవతారమున, ఆనందాశ్రమములకు శిష్యుండనై అనేక బ్రహ్మకల్పాలు తపస్సు చేసి పదో అవతారమెత్తి, ఆనందాశ్రమములకు శిష్యుండనై అనేక ఏండ్లు తపస్సుచేసి పదకొండో అవతారం, మనుష్యావతారం, బనగాని పల్లెలో ఇరవై అయిదు ఏండ్లు తపస్సు చేసి నాభక్తులకు భూతభవిష్యద్వర్త మానాలు తెలుపుచూ అన్నాజికి ప్రతినామమైన వెంకటాద్రికి కుమార

పద్దు ఇచ్చి పాణెములో వీరనారాయణదేవుని సమ్ముఖాన మమ్ము ధ్యానము చేయు మని చెప్పి ముందర మేము రాజ్యము చేసిననాటికి పురోహితుడవు కావలసినదని ఫణిభట్లకు మేము వచ్చే పర్యంతం ఫలాహార నియమంగా ఉండమని చెప్పి మేము మనుష్యరూపం చాలించి దివ్య రూపంబున సూర్యమండలానికి పోతిమి. అంతట మాపేరు వహించిన జితేంద్రియుండనే కుమారుని వెంటబెట్టుక వెంకటాద్రి సూర్యనందికి చేరెను. మా భక్తులైన వారు సమర్పించిన ఆవులను మాపేరు పెట్టి జితేంద్రియుడు పోషించుకుంటూ ఉండెను. అంతట మేము కొన్ని దినములు నాద బ్రహ్మమున వైకుంఠాద్రిచేత సాంద్రసింధువనే వేదములు అరవై ఆరులక్షల తొంబైమూడు వేల గ్రంథము ప్రమాదీచ సంవత్సరం ఆరభ్యం మూడు ఏండ్ల తొమ్మిది నెలలు వ్రాయించితిమి. తర్వాత గోపరాజు దగ్గర ఉండే కత్తితిమ్మని మనుష్యులు కందనూరు నుంచి సూర్యనందికి వచ్చి జితేంద్రియునికి చెప్పి ఆవుల చెఱబట్టుకపోయిరి. ఆదోషము కత్తితిమ్మనికి గోపాలుగానికి చుట్టుకొనెను. జితేంద్రియుని రక్తము భూమి మీద పడి భూమితడుపుచు తడిసినప్పుడే ఆయుధ ప్రాణుల పాపాత్ము లందరిని నిర్మూలం చేసేము అని సంకల్పించితి. ఆ జితేంద్రియుని నిర్వహించలేక దుఃఖావేశముచేతను కుమారునితో కూడ చచ్చెనని చిచ్చు తగిలించుకొనెను. ఆ సమయమందు మేము వచ్చి నిలిపి వెంకటాద్రికి చెప్పి తిట్టితిమి. నీవు వెర్రివాడవు. ఈపని చేయవద్దు, నీవు కుమారుడవు. నీకు విచార మేమి? మేము వచ్చేటప్పుడు మన జితేంద్రియుణ్ణి తెలుగు జంగణ్ణి ఆకులు తెచ్చిన యీడిగె తిమ్మణ్ణి ఆవులను మరి పూర్వమైన భక్తులను తోడుక వస్తూ ఉన్నాము. నీకున్నూ ఈలోగానే మానవ శరీరం పరిహారమయ్యీని. ఈ దివ్యరూపం ఇచ్చిన నావెంటనే వస్తూ ఉన్నావు. ఇందుకు సందేహము వద్దు, నమ్మిక యిస్తిమి. మీరు వచ్చేటందుకు గురుతు ఏమంటిరా యన పింగళ సంవత్సర పిళపిళమాసాన వచ్చేము. వచ్చి ఆనందాశ్రమములు వక్కణ నిమీళనం కొంతకాలం రాజ్యపరిపాలన జేసేము. నిమీళన మనగా పదునాలుగు ఓంకారాలు. మేము వచ్చినది మొదలు కృతయుగ ధర్మాలు నడిపేము. కలియుగాంత్యమందు గాని కల్క్యతారం లేదు. శ్రుతిపురాణేతిహాసాలలోను మా యవతార మహిమ మారాకడ పూర్వ మహిమను పూర్వమైన మునులు ఆనతిచ్చినారు అని అంటిరా యన శాంతిపర్వమందు కడపటి



మా యవతారమహిమ వ్యాసులు చెప్పినారు. విద్యారణ్యులు మా యవతారమహిమ మారాకడ విజయలక్ష గ్రంథమందు సంకీర్తనలోను మాయవతార మహిమ మారాకడలు నిర్ణయం చేసినారు. విజయనగరమందు శాసనాలు వ్రాసి వేసినారు. శంకరా చార్యులవారు సరస్వతీ పీఠమైన శృంగేరియందు శాసనాలు వేయించినారు. కృష్ణమాచార్యులవారు తాము చేసిన చతుర్లక్ష సంకీర్తనలోను మాయవతార మహిమ మారాకడలు నిర్ణయము చేసినారు. అతడే నేను. ఇదిగాక సర్వమైన మతస్థులలోను నిర్ణయము చేసినాము. సర్వదా మేము రాకపోయినట్టాయెనా కాశిలో బ్రాహ్మణవధ బ్రహ్మహత్యలు మొదలైన మహాపాతకాలు చేసిన పాపాన బోదుము. మేము చేసిన తప్పులన్ని నిర్మూలనమై పొయ్యీని. ప్రతిజ్ఞ తప్పరాదు. అన్ని నిదర్శనాలు ఆనతిస్తిమి. శ్రీశైలాన పొగమంటలు వెళ్ళీని. బసవేశ్వరుడు ధిమిధిమియని నాట్యమాడీని. యజ్ఞేంద్రునిలో ఆవును వ్రేల్చిన పాపాన బోదుము. కావేటి రంగని పాదమనే సాక్షిగాను అని నెలతప్పీని. ఘణాఘణాయని మువ్వలు మ్రోగీని. బసవేశ్వరుడు గోరిసెలు విదిళించు కున్నదే గుర్తు. నాగభోగ ప్రతిమ మావారు వచ్చేరు అని కిలకిల నవ్వీని. మాయింటి ప్రాకారాన ఆరెదొండచెట్టు పుట్టీని. భ్రమరదేవళంలోను ఒక మొసలి వచ్చి ఏడుదినా లుండి పొయ్యీని. భ్రమరాంబ చాలుగాను మంగళసూత్రం తెగిపడీని. భ్రమరకంట నీళ్ళు కారీని. మల్లేశ్వరుని దేవళములో ఒకమొసలి ఏడుదినాలు ఉండి పొయ్యీని. సిద్ధాపురం వీరన్న కుండికంట నీళ్లు కారీని. అలింపూరు జోగులాంబ కంటను నీళ్ళుగారీని, ఆయమ్మ స్తనాల పాలుకారీని, కందనూరి గోపాలుని గుడి ముందర తింత్రిణి మాను పుట్టీని. మహానందిలో ఈశ్వరుడు వెడలించీని. రెండు పాములు దేవళములో పారాడేని. ఒకపాము దొడ్డది. అది శిఖరాన మూడురోజు లుంది. మహానందిలో పంచమహావాద్యాలు వాయించినట్లు ఉండీని. సూర్య నందీశ్వరుని గుడిముందర పనసమాను పుట్టీని. ఆచెట్టు ఆక్షణమె పువ్వులు పూసీని. కాయలు కాచీని, పండ్లు పండీని. అంతట మాయమయ్యీని. శిరివెళ్ళ నరసింహుని గుండిముందర గంగరావి చెట్టు పుట్టీని. నందేలలో పదహారు కొమ్మల యెదురుగుమి పుట్టీని. బహుధాన్య నామ సంవత్సర వైశాఖ శుద్ధ3లు శుక్రవారమునాడు పల్లెకు తురకలు వచ్చేరు. జుర్రిగెడ్డ తిరువెంగళనాథుని గుడిముందర ఏరుమండిచెట్టు పుట్టీని. బహుధాన్య సంవత్సరం బనగానిపల్లెకు నాగయ్యా అనేటి అయిదేండ్ల

బ్రాహ్మణుడు చదువకనే వేదమంత్రాలు చదివీని. బనగానిపల్లె పేటలో పులి చొచ్చీని. నల్లముఖం వానరుడు వచ్చి బనగాని పల్లె పూర వాకిటిలో ఏడ్చీని. నల్ల ముఖం వానరుడు ఊరుచుట్టు తిరుగాడి పొయ్యీని, అహోబిళాన దుర్నిమిత్తాలు పుట్టీని. తాటిపర్తిలో కాకులు గద్దలు మూకలు గట్టు కొని ఆడుతూ వచ్చేవి. బనగానిపల్లెలో మేకపోతు పాలు పితికీని. చలిమెలసీమలో కల్లుబసవన్న రంకెవేసీని. తిరువళ్లూరు వీరరాఘువ స్వామికి చెమట పుట్టీని. భద్రకాళి ఉగుతూ ఉండీని. కంచికామాక్షి దేహాన చెమట పుట్టీని. ఆయమ్మ కంట నీళ్ళు గారీని. ఆయమ్మ స్తనాల పాలుగారీని. అడిగొట్టు అణగీని. ప్రల్లదాలు ఉడిగీని. దుర్జనులు ధూళి గలసేరు., రంగాపురం నష్టమయ్యీని. ఇంజేటిపాడు అహోబిళం ప్రాంతాలయందు పట్నంకట్టే మని యెవ్వడు తలుస్తూ ఉన్నాడో వాడు నిర్వంశమై పొయ్యీని. నందిమండలాన అనేకులు మడిసేరు. యమ్మనూరు జయాన ఉండీని. ఆడమండలం వాండ్లు జయాన ఉండేరు. శాలివాహనశకం ౧౫౪౧ధూమకేతువు పుట్టీని. తోకచుక్క పుట్టీని కందనూరు దగ్గర జగడ మయ్యీని రాచవీటి దగ్గర మూకలు కందనూరు దగ్గర చచ్చేరు. అందరిలో రక్త ప్రవాహ మయ్యీని. ఆ రక్తము తుంగభద్రలో కలిసీని. అనేకులు మడిసేరు. అది మొదలు పంచాశ్రమదేశం ప్రజలు మడిసి క్షామడంబరాల చేతను వ్యాధుల చేతను నాశన మయ్యేరు. కందనూరు గోపాలుడుగాడు వద్దిమడుగులో పడి చచ్చీని. రాచబిడ్డడైనవాడు బ్రహ్మహత్యలు చేసునా ఆ హత్యలు చుట్టుక గోపాలుగాడు నిర్వంశ మయ్యీని. శాలివాహన శకవర్షంబులు ౧౫౫౫అయ్యేవరకు నానాదేశాల యందు ప్రజలు కొందరు మడతురు. హందె మల్లుగాడు సిద్ధిరాముడు రాజ్యభ్రష్టులై పొయ్యేరు. గండికోట మందుల చిత్తుల కాలి చచ్చేరు. పెమ్మసాని తిమ్మానాయుడు నిర్వంశ మయ్యీని. ఉదయగిరి నెల్లూరు రూపనాశన మయ్యీని. గండికోటకట్టుకొని గోల కొండ కట్టుబడీని. ఏడాదికి ఆదవేని కట్టుకొని గడిపట్నాలు పోయిన మీదను కందనూరి పర్యంతం అగ్బరివారు చరాచూరులు పట్టేరు. కందనూరు దొరలు పర్వత మల్లయ్య సంసార వాంఛలమీద తృప్తి. పురంబుల ఘనత మెరసి నా బిడ్డలు అనగా భక్తులే శ్రేష్ఠులు. మామాట అనువర్తించి మమ్ము చెరతురు. గొప్పపట్నాలు అనగా విజయపురాలు క్షయసంవత్సరాన ఆకురాలీని. ప్రభవ సంవత్సరాన ఈతాకు రాలీని. విభవ సంవత్సరాన వృక్షభేద మయ్యీని. పండ్రెండు



ఏండ్లకు మాధవుడు పడీని. మాధవుపతి పణతులకు ఆయుధము చేత మరణం ఉన్నది. అశ్వంమీద నైజాం పోయిన చలిచలమల నారసింహారెడ్డి చచ్చీని. వానికి ముందర బ్రాహ్మణ్య మిచ్చి మేము వచ్చేటప్పుడు తోడుక వస్తూ ఉన్నాము. స్త్రీల కన్నుల నెత్తురు బిందువులు పుట్టీని. వడగండ్ల వాన అంపవాన కురిసీని. తూర్పునాడు ధూళిగలసీని. స్వరూపనాశన మయ్యీని. చెరువులు కుంటలు బావులు నదులు జలాలు లేక ఇంకి పొయ్యీని. పొగమంట వెళ్ళీని. జుర్రేటి నీళ్ళు ఇంకరాదు. కలప గ్రామంవారు నాడే పొడగనేరు. కలపగ్రామ మనగా బనగానిపల్లె. మేము వ్రాయించిన లెక్కలు భద్రకాళిపురమందున్నవారు సుఖంగ్రామంవారు నాడే పొడగనేరు.

# ఏకాదశాశ్వాసము

శ్లో వేదవద్వీరనార్యాణాం సుబ్బయార్యమమాత్మజః
వీర భోజోద్భవం పక్ష్యే దైవజ్ఞాభీష్ట సిద్ధయే.
త దేవానందబ్రహ్మోక్త సిద్ధాన్తే నకరో మ్యహమ్
భానుమత్యనుసారేణ రుద్రాన్ద్వానాంతు లక్షణమ్
గజవేదనవాంభోధీ కలివర్షగతే భువిః
ప్లవంగాబ్దే భానుబింబం కంకణాకార ముచ్యతే.

గజము౮ వేదాః౪ నవ౯ అంభోధి౪=౪౯౪౮ వెళ్ళిన మీదట ప్లవంగ నామ సంవత్సరమందు సూర్యబింబము కంకణాకారముగా అగుపడును.

శ్లో. ప్లవంగే ద్విత్రిగ్రహణా ః సూర్యాచంద్రమసో క్రమాత్
ఇమే పంచగ్రహణాశ్చ కృష్ణవేణ్యాశ్చ దక్షిణే.

ప్లవంగ సంవత్సరమున సూర్య గ్రహణాలు౨ చంద్రగ్రహణాలు3 ఈ అయిదు కృష్ణవేణికి దక్షిణ భాగమందు తెలియవచ్చును.

శ్లో. యమే సూర్య గ్రహే కించిత్ దృశ్యాదృశ్యో భవే త్తతః
యమే చతుస్యా గ్రహణాం కృష్ణవేణ్యా ముదగ్దిశి.

ఈ అయిదు గ్రహణాలు కృష్ణవేణికి ఉత్తరమందు ఒక సూర్య గ్రహణం దృశ్యాదృశ్యంగా అగుపడును. కడమనాలుగున్ను బాగుగా అగుపడవచ్చును.

శ్లో. జనానాం సర్వదేశానాం సంజ్ఞార్థం గురుమహే వయమ్
అయ మాదిత్యమధ్యే తు సవ్యస్యం కంకణాకృతిః
సేతు వేషార్థయో ర్మధ్యే కాశీ శ్రీరంగదేశయో ః
భిన్న కంకణరూపస్యాం కుంభకోణే రవే ర్వపుః.



శ్లో. గౌతమీనర్మదా మధ్యే భిన్నకంకణ ముచ్యతి
తస్యా ఉదీచిదిగ్భాగే కాశీ వింధ్యాద్రయో రపి
అస్మిన్ శ్రీశైలదేశే తు కంకణాకార ముచ్యతి
శేషాద్రీ గౌతమీ మధ్యే ఉదయో దివి దృశ్యతి.

పగలు నక్షత్రములు అగుపడును. సూర్యుని యివతలగా శుక్రుడున్ను ఆ శుక్రుని యీవల ఆవల స్వాతి చిత్త లుండును. అప్పుడు సూర్యుడు నడుమ చంద్రుడు అంతా ప్రవేశించి ఉండును. మధ్యకాలానకు రవి బింబము 30 లిప్తలు అనగా మరుగుమాట. ఈ సంగతి తెలియచేస్తూ ఉన్నాము. సూర్యుడు ముక్కాణి బింబం ఉండును. ఈ బింబము చుట్టువారా దిరుగును. అప్పుడు నక్షత్ర ఉదయం అవునని ఈశ్వరుడు పలుకుచున్నాడు.

శ్లో. ప్లవంగే పంచగ్రహణే సూర్యాస్తు వలయాకృతిః
తన్మధ్యే విష్ణురూపస్యాత్ తద్భక్తానాం ప్రియావపమ్.

అయితే యీ గ్రహణాలలోను సూర్య గ్రహణం వలయాకృతిగా ఉండును. ఆ సూర్య బింబము నడుమగా 'శ్రుతి పీతా భాస్వత్యణూపమా' అనే విష్ణురూపం మా భక్తులైన వారికి తెలుసును.

శ్లో. ఏషామాపౌర్ణ మధ్యే వం లోకే ఖ్యాతి గమిష్యతి
తథా తు పుష్పవృష్టి స్యా ద్వహం తు పుణ్య జంతుషు.

టీక - అమావాస్యనాడు చంద్రుడు ఉదయిస్తూ ఉన్నా ఉన్న మరుగు ఈమాట తెలియజేస్తూ ఉన్నాము. సూర్య బింబ ప్రమాణము౬౫౦౦ యోజనాలు. చంద్రబింబము ౪౮౦౦ యోజనాలు.

శ్లో "ఛాదయే దర్క ఇందు స్యాత్" సూర్యుని ఆరాధించే
వాడు చంద్రుడు గనుక నున్ను "శీతాంశుబింబవలయం స్యాత్"

పూర్వం బింబాధికం యథాచంద్రబింబము లిప్తలు౯ -౪౬ఘ సూర్యబింబము లిప్తలు ౧౦-౪౮ . మానైక్యబింబం ౧౦-౧౭ తచ్చరోషంభవేచ్చన్న విషువచ్ఛాయల చేత తీసుకరాబడ్డటువంటి శుద్ధవిక్షేపం తీసి వేసిన గ్రాసలిప్తలు

శ్రీశైల దేశానకు శూన్యమైనది. విలిప్తలున్ను శూన్య మైనది. ఈరీతిన సూర్యమండల మందు చంద్రుండు అంతా ప్రవేశించి యుండును. చుట్టూవారా ఎక్కువగా ఉన్న సూర్యబింబము వలయాకృతి అవును. నడుమనున్నటువంటి చంద్రుడు విష్ణురూపంగా అగుపడును. ఇదే అమావాస్య పూర్ణిమ. అనగా సూర్య మండలమందు చంద్రుడు ఉదయించి నాడని తత్త్వవేత్తలచే పలుకబడిన మరుగుమాట. ఇదే అమావాస్యనాడు చంద్రోదయ మయినది అని బ్రహ్మవేత్తలైనవారు తెలుసుకొని సంతోషపడుతున్నారు. పుణ్య పురుషులమీద పుష్పవర్షం కురియును. 'ఇదం రహస్యం తద్రూపం దృష్ట్వా వీరోదయం భువి-యూయ మిత్యేవ పుణ్యాత్మా జ్ఞాత్వా శ్రీవీర ధర్మజా' ఈ యొక్క రహస్యమైనటువంటి ఈ గ్రహణము భూమి యందు దృష్టాంతరం చూచేయెడల లోకానికి విరోధము గలిగేటట్లు పుణ్యాత్ములు వాడుకొందురు వీరధర్మజు లుద్భవ మయ్యేటందుకు హేతువు. ఇతి దైవజ్ఞ విరచితే వీరధర్మజ చరిత్రే ప్రథమాధ్యాయః

ప్లవంగాష్టకవర్షాణాం వృషాది దశరాశిషు
యావ చ్ఛిష్టసురాచార్యా తావద్రాశిత్రయం క్రమాత్.

ప్లవంగ సంవత్సరము మొదలుకొని యెనిమిది సంవత్సరములకు వృషభరాశి మొదలు పదిరాసులదాక బృహస్పతి రాశిత్రయములుగా నడచును.

శ్లో. త్రిభిస్యాదష్టవర్షాణాం క్రమా దేకైక వత్సరే
యావ చ్ఛిష్టసురాచార్యో తావన్నభయా వహం
ఏకైకాబ్దే త్రిరాశి : స్యాత్ ప్లవంగాది యథా క్రమాత్
గురుకర్కటరాశ్యాది త్రివర్షే ఏకరాశినామ్.

తా. బృహస్పతి అయినవాడు సంవత్సరం ౧కి మూడురాసులు త్రొక్కుచు నడచును. కర్కాటకం మొదలుకొని ఒకరాశియందు సంవత్సరం ప్రకారం మూడు రాసులు మూడు సంవత్సరాలు ఉండను. కడమ సంవత్సరములు అతిచారంగా నడచును. అట్లా నడిచినందున రాజులకు భయం కలుగును. ఇది దైవజ్ఞ విరచితే వీరధర్మజ చరిత్రే గురు చారే ద్వితీయోధ్యాయః శనిచారః.



శ్లో. కీలకాబ్దే ప్రదిష్టే తు మీనరాశిం శనైశ్చరే
మేషే సాధారణాబ్దాన్తే గ్రాం ప్రమాదీచవత్సరే.
రాక్షసే యుగ్మరాశిం స్యాత్. ప్రవేశో భాస్కరాత్మజా
చాయాసూను ప్రవేశం స్యాత్. పింగళాబ్దే తు కర్కటే.
ఇతి దైవజ్ఞ విరచితే వీరధర్మజ చరిత్రే
తృతీయోధ్యాయః శనిచార ః.
కన్యారాశిగతే జీవే విక్రమో వీరధర్మజ
ప్రయాణోభవేత్ - శ్రీ మార్గ పీతాంబరధర ప్రియా ః.

కన్యారాశికి బృహస్పతి వచ్చేటప్పటికి వీరధర్మజులు ప్రయాణం భవతి - అయియున్నారు.

శ్లో. తులారాశిగతే జీవే ధూమకేతూద్భవం భవేత్
అళిస్తే తు సురాచార్యో వృష్టిస్యాత్ ఫలవృద్ధయః

తులారాశి బృహస్పతి ప్రవేశమైతే ధూమకేతువు ఉద్భవ మవుతూ ఉన్నది వృశ్చకరాశి ప్రవేశమైతేను అధికవృష్టిచేత ఫలవృద్ధి యగును.

చాప స్తేతు సురాచార్యో లోకేస్మిన్ వీరధర్మజః
పుణ్యపాలనం స్యాత్ రాక్షసం దుష్టనిగ్రహః.

బృహస్పతి ధనుస్సునకు ప్రవేశమైతేను వీరధర్మజులవారు పుణ్యుల రక్షించును. దుష్టుల నిగ్రహించును.

మృగరాశిగతే జీవే నగసత్య పరాక్రమాత్
పినాకినీ మపి సైన్యం చ శ్రీశైలస్య సమాగతాః

మకరరాశియందు బృహస్పతి ప్రవేశ మైతేను వీరధర్మజులవారు సకల పరాక్రమం గలిగిన సైన్యములతో పినాకినీ తీరమందు వచ్చి శ్రీశైలానకు వస్తూ ఉన్నారు.

కుంభరాశిగతే జీవే భూమిదేవ్యాం శుభావహం.

తా. కుంభను బృహస్పతి ప్రవేశ మైతేను పర్వతం మల్లి కార్జున స్వామి

వాక్యముచేతను ఆ వీరధర్మజులు కేదార రామేశ్వర పర్యంత మేక చక్రముగా నేలును.

శ్లో. ఋషజ్యతే సురగురౌ కీర్తిమాం రామ ధర్మజా
పట్టాభిషేకం కుర్వంతి పాలయం ధరణీసురాన్

తా. మీనమందు బృహస్పతి ప్రవేశమైతేను కీర్తిమంతులైన రామధర్మజుల వారికి పట్టాభిషేకం కుర్వంతి దేవ బ్రాహ్మణోత్తములు చేయుచున్నారు.

శ్లో. మీనరాశిగతే మందే మ్లేచ్ఛానాం నాశనం భవేత్
కించిత్ సౌఖ్యంతు జగతిసంయుతే క్రియతే శనౌ.

తా. మీనరాశియందు శని ప్రవేశమైతే మ్లేచ్ఛనాశనం మేషమందు శని ప్రవేశమైతేను జగత్తునకు కొంచెము సౌఖ్యము కద్దు.

శ్లో. వృషభరాశిగతే మందే ఈశాన్యే విషవాయవః
తై స్యా ద్విపరీతజనాః యమలోకం గమిష్యతి.

తా. వృషభరాశియందు శని ప్రవేశమైతేను ఈశాన్యమూల విషపుగాలి పుట్టి విపరీత జనుల యమలోకానికి తీసుక పోవును.

శ్లో. శనౌ స్థితే జుగ్మరాశౌ భవేత్ భూభారనాశనమ్
ఆనందే దనుజాబ్దే తు లోకేశ్మిన్ కలినాశనమ్.

శనైశ్చరుడు మిథునరాశికి ప్రవేశింపగానే భూభారనాశన మగును. ఆనందరాక్షస సంవత్సరం లోగా లోకమందు కలియుగధర్మం నాశనమగును. ఇతి దైవజ్ఞ విరచితే వీరధర్మజ చరిత్రే చతుర్థోధ్యాయః

ఆనందాత్సరే సూతా దూతనాట్యసమాగతాః
వసుధాకీర్ణకృపణైః భేతాళస్య తథాగతః.

ఆనంద సంవత్సరం పుట్టగానే యమదూతలు నాట్యమాడుదురు. భేతాళ పంపులచేత ప్రజలు నాశనమగుదురు.

# ద్వాదశాశ్వాసము

## శ్రీవీరప్పయ్యగారి కాలజ్ఞానము

సంతోషంబు, మరియు దండ నమస్కారములు గావించి "వీర గురవేనమః మీ దివ్యమంత్రోపదేశంబున కృతార్థుండనైతి. ఇంకొక్క ఆనతి అడిగెద.నామీద కటాక్షం ఉంచి వసతి యివ్వవలెను. కలియుగ వర్తమానంబును కలియుగ మహత్వంబును కలియుగ చర్యలున్ను కలియుగావస్థలున్ను బుద్ధి ప్రసాదింపవలె" నని అడిగిన భైరవానందయోగికి 'వినుము నాలుగువేల అయిదునూర్ల ఎనిమిది యేండ్లు వెళ్ళిన వెనుక ధర్మదేవత భూమియందు ఒకానొక పుణ్యస్థలంబున దేశంబుల అరుగుచు నుండును. పాపము నానాటికి హెచ్చి వచ్చును. అందున లేని కలహంబులు పుట్టును. అతి ఆహారము అతినిద్ర పుట్టును. నిలిచిన తావున నిలువక సకల నరమృగాదులు సంచరించును. శాంతులు కోపవంతు లగుదురు. నీచులు అధికు లగుదురు. అధికులు ఎందుకు కొరగానివారగుదురు. బ్రాహ్మణులు తమతమ కార్యాలు విడిచి ఒక్కొక్కో మతస్థులై తమతమ మతముల విడిచి నీచుల నాశ్రయించి షట్కర్మరహితులై చెడిపోదురు. రాజులు తమ రాజధర్మంబులు విడిచి నీచ ఉద్యోగులై నీచకార్యంబులకు జొచ్చి స్వకార్యంబులు లేక వెతావెతలై దేశానకు ఒక్కడై పోదురు. వైశ్యులు తమ కులంబు పోగొట్టుకొని దుష్కర్ములై పోదురు. శూద్రులు అసత్యవాదులై చండాల సాంగత్యము గలిగి దరిద్రులై చెడిపోదురు. జాతి సంకరంబులై పరస్పర వైరంబులు హెచ్చి పోట్లాటలున్ను కొట్లాటలున్ను మరణకర్మ శూన్య కృత్యంబువల్ల బహుగా చత్తురు. పైర్లు స్వల్పముగానే పండును. పశువులు కొంచెముగా పాలు పితుకును. తండ్రి కొడుకులు తమలో తాము కలహింతురు. గురుదేవ బ్రాహ్మణ దూషణంబులు పుట్టీని. వావివరుసలు తప్పి నడిచేరు. ఒకరి చేతి సొమ్ము ఒకరు తీసుకునేరు. చోరుల బాధలు హెచ్చీని. అగ్నిభయంబులు గలిగి ఉండీని. అడవిమృగాలు పల్లెలు చేరీని. ఏనుగుకు నంది బుట్టీని. నందికి ఏనుగు బుట్టీని. ప్రజలు బహుగా చచ్చేరు.

వాదంబులు హెచ్చీని. వేశ్యావశీకరణాంజనాల చేత ప్రజలు భ్రమసి దురాశను ద్రవ్య నాశకులై దరిద్రులై చెడిపొయ్యేరు. గరుడ, కాక, గార్ధభ, ఘటిక, ఘట, ఘాట, మాయా ఇంద్రజాలంబులు పుట్టీని. తిలలు కండలు గ్రక్కీని. ఆకండలు కాకులు, గ్రద్దలు భక్షించీని. వాటిని చూచి ప్రజలు వెఱ్ఱిపట్టి గంతులు వేసేరు. కొరువులు నోటగరచుకొని తిరుగుదురు. బెండ్లు మునిగీని, గుండ్లు తేలీని. కొండలు మండీని. కడుపులు విరిసి చచ్చేరు. నెత్తురు గ్రక్కుచు గుండె నడినెత్తులు పగిలి చచ్చేరు. పశువులు బహుగా గుంపులు గుంపులుగా జచ్చీని. పట్నాలు ఒకనికి ఒకడు ఏలుదురు. నీచజాతుల వారు ఆచారవంతు లగుదురు. హెచ్చి బ్రాహ్మణ నిందలు చేయుదురు. దేవ నిర్మితమైన వానలు చెడును. మన్నీలు చెడుదురు. విజయనగరం ఊర్జితమై కొన్నాళ్ళకు చెడును. కాశి నలభైదినాలు పాడై యుండీని. కురుక్షేత్రమందు గుంపులు కూడుదురు. కొండవీడు విష్ణుభక్తు లేలుదురు. గోదావరి యింకి పండ్రెండుదినాలుండి తిరిగి ప్రకాశమౌను. కాళహస్తి ఈశ్వరుని సముఖమందు ఉండే ద్వారపాలకులు ఒక ముహూర్తంబున గంతులాడుదురు. వెంకటేశ్వరుని కుడిభుజం అదిరీని. మంగళగిరిలో మాయవాదులకు వైష్ణవులకు కలహమై రెండు తెగల వారు మడిసేరు. కుక్కలు గుర్రాల జంపీని. చుక్కలు రాలీని. కార్తిక బ౧౨లనాడు ఉత్తరపు దిక్కున నాలుగు ముఖాల చుక్కలు పుట్టీని. ఆ చుక్కలు ఇరవై అయిదేండ్లు ప్రకాశముగా ఉండును. కర్నాటకం లక్ష్మి చరించీని. దేవాలయములు మ్లేచ్ఛులపాలయ్యీని. శిలావర్షం కురిసీని. ఒకరొక రెంచక మ్లేచ్ఛులు కొంతకాలము రాజ్యంబు చేసేరు. మొరసకమ్మ రాచవారు కొంచెపడి పొయ్యేరు. మళయాళం మ్రగ్గీని. ధారణ తగిలీని. దివ్య తిరుపతుల మార్గంబులు తప్పీని. భూమినెత్తురు చేత తడిసీని. ఎముకలు కొండల పొడవున పడీని. భూతప్రేత పిశాచ గ్రహాల కోలాహలాలు ! భోయని ప్రజలు కూసేరు. కాకులు వికార స్వరాలుగా కూసీని. గూబలు ఏడ్చీని. ఝూము ఝూముకు తప్పకుండా నక్కలు కూసీని. కొండవీటికి ఉత్తరాన రాతి గరుడ గంబము మండీని. అరవ దొరతనాలు చెడీని. ౪౮౭౫ యేండ్లకు యుగము పోతే ఆమీదట కాశివద్ద గంగ కానరాక పొయ్యీని. ౪౯౮౨ యేండ్లకు కంచి కామాక్షమ్మ నెత్తురు గ్రక్కుకొని గాలిచేత వానచేత శ్రీశైల దక్షిణభాగాన ఉన్న గుండ్లు దొర్లీని. నెత్తురువాన గురిసీని. బండలు పగిలీని. ఆకాశాన గద్దలవలె కాకులు ఆడీని. గుండ్ల చీము నెత్తురు గురిసీని.



గ్రద్దలవలె కాకులు ఆడీని. అప్పుడు పుట్టిన బిడ్డలు మాట్లాడీని. ఆకాశాన ధ్వని బుట్టీని. ఆకాశాన నాలుగు చుక్కలు పుట్టి మాయమయ్యీని. హాహాయనేధ్వని ప్రజలు పలికేరు. ఆకాశాన అర్ధరాత్రి ఘణం ఘణం రాంరాం అనే శబ్దము వినబడీని. భూమి పెరిగీని. భూమి వ్రక్కలయ్యీని. భూమి నానావర్ణముగా కనుపించీని. ఒకని సొమ్ము ఒకనికి ఒకని ఆలు ఒకనికి మారు పొయ్యేరు. పుణ్యవాదుల ప్రభావంబు చెప్పీని. పుణ్యపురుషులు పుణ్యాత్ములు బ్రతికేరు. పుణ్య స్థలంబులు చెడీని. దేవస్థలంబులు పాపాత్ముల చేత నష్ట మయ్యీని. నిక్షేప ద్రవ్యాలు బైటపడీని. వెంకటాచలమందు చండాలురు మ్లేచ్ఛులు ఎక్కేరు. వెంకటేశ్వరుని మహిమ హెచ్చి పొయ్యీని. ఈ దివ్య స్థలంబుల అద్భుతాలు పుట్టును. తిరువళ్ళూరు వీరరాఘవస్వామికి తిఘమేన చెమట పుట్టీని. కష్ణా గోదావరీ మధ్య మందు అనేక కలహంబులచే పోట్లాడి చచ్చేరు. ఒకరి కొకరు లేక ప్రజలు అడవుల పాలయ్యేరు. శీతోష్ణోదకములు అధికముగా కలిగి యుండును. కృష్ణలో నడుమ బంగారు తేరు కనిపించును. ఆతేరు చూచిన వారికి కన్నులు కానరాక పోవును. ఒకరి దుర్గం ఒకరు పాలించేరు. ఒకని నీతులు తామే చెప్పేరు. శైవవైష్ణవ మతాలు రెండున్నూ ప్రబలముగా నడచీని. మధుర, తంజావూరు మొదలైన పట్నాలు శివభక్తు లేలుదురు. అశ్వపతి సంస్థాన మయ్యీని, గజపతి ప్రబల మయ్యీని. కొంతకాలములో నరపతి యుండును. కొన్నాళ్ళు రాజులనే పేరులేక కర్నాటకం మ్లేచ్ఛ కులాంతక మౌను. దేవాలయములలో శిలలు విగ్రహాలు కళలు తప్పీని. అద్భుతమైన తేరులు విరిగి పడును. ప్రజలకు ముక్కు ముక్కర కానరాక పొయ్యీని. కొండల మీద నుండి లక్షోపలక్షలు గుండ్లు దొర్లీని. ఆయుధాల వాడి చెడును. భ్రమర గుడిలో రెండుతలలు గల మొసలి కనుపించి భ్రమరాంబలో ఐక్యమగును. అస్త్ర శస్త్ర భవుండైన పరమహంస ఉదయగిరి శిఖరాగ్రంబు అమావాస్య నాడెక్కినం జూచి జనులు చంద్రగ్రహణంబని భ్రమసేరు. శివవైష్ణవ దేవాలయంబు లలో రక్తంబులు పుట్టీని. ఆకాశంబున నుండి రెండు బంగారు రెక్కల పక్షులు వచ్చి పురంబున వనంబుల సంచరిస్తూ ఉండగా పాపాత్ములైన జనులు పట్టేరు. చంపమని జనులు లక్షోపలక్షలు కన్నులు కానరాక చచ్చేరు. తూర్పు పడమట దిక్కు దాక యోజన ప్రమాణ మయ్యీని. మహాద్భుతము కోక పరచినట్లు కనుపించీని. కొండలు ఘటాఘటా యని ధ్వని చేసీని. మరిన్ని నానాటికి వింతలుబుట్టీని. ఓహోహో

ఆనందభైరవయోగి! యింకా నీవు వీర భోజుండవై జనియించుము. ఆనందజియ్యరై పుట్టెడు నేను వీరవసంత రాయ వీర భోజవసంత వీరశేఖర వీరనారాయణ వీరశంఖ వీరాది వీర బ్రహ్మమనే నామంబుల అవతరించెదనని యిట్లు జననంబై వారలు భూప్రదక్షిణంబు జేసి సమస్తమైన పరమహంస లాగుకొని తమతమ ప్రభావంబులు కనుపడని మహిమచేత శక్రధరు పాదుకలలో ప్రకాశింపుచు కొంతకాలంబు తిరుగుచు మహావీరబ్రహ్మమనే నిక్షేపంబున్ను సంగ్రహించి అంజనీ మహాకాళి వెనుక పరిశంభుని తాళప్రమాణంబు లోగా వేసిన నవరత్న భండారంబు గ్రహించి అక్కడ తర్లి ఉద్యానవన మందు ఉన్న దేవదేవునికి తూర్పుభాగాన యాభై బారల నిడుపున కాల భైరవుని ముందర మహాశక్తి గర్భమందు రెండు లక్షలున్ను ఏనూరు వజ్రాలు దుర్గము ఎత్తు అది గ్రహించి అక్కడ అర్ధపీఠ శక్తి నడినెత్తిన నున్న యవల గ్రహించి మురయందు వీరియొక్కరి గర్భ మందున్న ముత్యములు గ్రహించి కొల్లాపురము నందున్న నిక్షేపాలు కొల్లలాది రత్న ద్వీపంబున నున్న రత్నంబులు పరిగ్రహించి భూమియందు వేసిన నిక్షేపాలు భక్తులకు ఎగచల్లుదురు. చతురంగ బల సమేతుండనై భూప్రదక్షిణంబు సేయుచు వచ్చి కాశి జేరి విశ్వనాథుని సందర్శించి పంచ ముఖుడైన విశ్వనాథుని పఠనంబు చేయుచు గజపతి గర్వం బడంచి అశ్వపతిని గొట్టి మరిన్ని తక్కిన రాజుల కొట్టించి కంచి జేరి అమ్మవారిని జయించి అందుండి వెంకటాచలమునకు వచ్చి వెంకటేశ్వరు జేరి అంతట పూర్ణ సింహాసనస్థుండై శార్వరి సంవత్సర చైత్రబంం-లు సుఖంబున రాజ్యంబు చేయుచుండు నని యెవ్వరైనా మా నామ భక్తులైన వారు తలతురో వారికి మోక్షంబు అయ్యాని. భక్తి పూర్వకంబుగా పూజించి జరిపించిన అష్టైశ్వర్యమున్నూ పుత్రపౌత్ర అభివృద్ధిన్ని మోక్షంబు కలుగ జేయుదుము. అది తథ్యంబు.

సీ. సకలార్థ పరివార జనులు సేవింపంగ
నిగమార్థముల నొప్పునగరిలోని
మండపత్రయముల దండి కవ్వలిచెంత
పూర్వపద్వీథికి పొడవుగాను
పూర్వకుండలికిని పొడవైన తావున
నాలుగుత్రోవల నట్టనడుమ



మహి నభోధానంద మండపాంతర్గత
విజయాఖ్య కల్యాణవేది యందు
వెలయ స్వస్తిసమేతుడై వేదరీతి
నమర కన్యయు పిన్ననా డట్లు మరియు
మంగళస్నానములు చేసి రంగుమీర
పెండ్లిపీటలమీదను ప్రీతిజెలగ.

తరువోజ మంగళ ద్రవ్యముల్ మంత్రోక్తి దనర
మంగళంబులు పాడ మరి అంగనలును
మంగళతూర్యముల్ మహిమ జెలంగ
మధుపర్క మర్కముల్ తత్వ మ స్వాది
సరణి యథార్థముల్ జాడలుగాగ
స్వస్తికారోహణ స్థలి పీఠమునను
సంగతిస్పర్శదిశాభాషితములు
సరవిగా తమ నేత్ర సమదృష్టి నమర.

(కాలజ్ఞానములోని ఉత్తర కాండలోని భాగము)

సంపూర్ణము

# ద్విపద

## శ్రీ వీరగురు పరబ్రహ్మణే నమః

కావింప దూతల కపిలు డేతెంచి
హోమంబు గావింప హోమగుండంబు
భీమదేశంబున పెడబొబ్బ లిడుచు
జనుదేర నొక నిశాచరుని బుట్టించి
మనుజుల భక్షింపు మని వాని పనుప
భాద్రపదంబున పడమటి దిశను
రౌద్రవేగంబున రహిని వసించి
పడమటి కరుదేర ప్రజలు భీతిల్ల
వడకుచు జనుదేర వరుణుండు చూచి
యువరోషమునను నత్యుగ్రత దనర
తవిలి హోమము చేయ దనర గుండమున
ముప్పది రెండు మోముల శక్తి పుట్టి
మది నల్గి యాశ్వీజ మాసంబునందు
చదురుగా నామీద శని సప్తమంబు
వీక్షించి దేవతావిభుడు మానవులు
భక్షించి దేవతావిభుడు మానవుల
భక్షింపు మని పంప నటురౌద్రలీల
మేటిజీవుల బట్టి మ్రింగ నూహింప
గాటంబుగాను యుగాంతమై తోచె
చటులమై వృశ్చిక సంక్రాంతియందు
చటుల తత్కాంచి వక్షంబున చేర్చి
వరుణ దేవుని జూచి వసుధేశు డనియె



గురుతుగా లింగాల కొండకు పోయి
కడమ భైరవునితో క్రమ మెల్ల దెలిపి
పనిబూని దానవియను సమకాల
శక్తి పశ్చిమదిశ సరగున బంప
భక్తి దప్పక స్వామి పనులు గావింపు
మని నీవు చెప్పిన నావిధం బంత
మనమున దలచగ మా శరణమున
వలనొప్ప గర్వించి వాడున్న జూచి
తల ద్రుంచి యాధ్వజస్తంభంబునందు
గట్టి, ఫలమ్ముగ కడు వరణుండు
పట్టుగా చని కాలభైరవుతోడ
గట్టిగా నెరిగించి కాదంటి వేని
మనమున వీరధర్మజు పాదమాన
నిను సంహరించెద నిజమని పలుక
వరుణ దేవుండుగ్ర వాక్యంబులకును
వెరచి మీరలు సెల్ల విచ్చిన యట్లు
గావింతు నన సమకాలశక్తియును
వేవేగ దా సెల విచ్చిన నదియు
నట దక్షిణంబుల కరిగి భూసురుల
మకరకుంభంబుల మాసంబులందు
కకవికలను మహాకల్పాంత మయ్యె
పడియేడ్చు మానవుల్ భ్రమయు మానవులు
కడు నేల బడి దుమ్ము గరచు మానవులు
బెదరు మానవులు తబ్బిబ్బుమాటలను
పదరు మానవులు జీవంబులు విడిచి
తలగు మానవులు చిత్తంబుల నొంది
పలవించు మానవుల్ పలువిధంబులను

గుండెలు వ్రక్కలై గూలు మానవులు
తడయక పెదవులు తడుపు మానవులు
మరి భక్తజనముల మందిరంబులకు
శరణార్థులగుచును జనెడి మానవులును
కావవే దయనని కరుణ రక్షింప
తీవరంబుగ నోరు దెరచు మానవులు
విశ్వమంతయు మహాభీతిని బొంది
తహతహపాటున తల్లడించుచును
ఏడి నారాయణుం డేడి రక్షకుడు
ఏడి రాజోత్తము డేడి సామంతు
డేడి సంక్రందనుం డేడి గురుండు
శివు డేడి మనలను చేరి రక్షింప
ఎం దున్నవాడొకో యెవ్వరు దిక్కు
కందళితానందకరుడైన శౌరి
రామదర్మజులకు రాదయ్యె కరుణ
దీమసంబు వరుణ దేవుండు మనకు
ఇచ్చిన అభయంబు ఎక్కడ పోయె
చచ్చిన మీదట సౌఖ్యంబు లేల
కుశలవక్మాపాలకుడు మహాత్ముండు
విశదంబుగా మమ్ము నేలు నటంచు
ఆశతో నుంటిమి అయ్యయో నేడు
ఆశలన్నియును నిరాశలై పోయె
సురపతి మము దయజూడలే దయ్యొ
మరచి యున్నాడొకొ మనయుఖవరాజు
వీరధర్మజు దయావృత్త మెం దరిగె
కారణ మేగతి కాగల దొక్కొ
అని భక్తవీరు లున్నతి భీతినొంది



ఎనయంగ చింతించుచున్న యత్తఱిని
వినరావొ భక్తుల విన్నపంబులును
శక్తి 'యుపద్రవ జాడల' ప్రజలు
యుక్తి దప్పిన రీతి నున్నారు నేడు
మన సురపతియైన మర్యాద లుండ
వని మీకు దెల్పెద నవుర బాగాయె
శాశ్వతం బైనట్టి సకల కార్యములు
అశ్వని గూడి వా డన్నియు మఱచె
చండార్చి శమనుండు సతులతో గూడి
గండెక్కి యున్నాడు కడగి మీ సొమ్ము
అప్పుడంబుల రీతి నారగించుటకు
ఒప్పియుండినవాడు వరుణదేవుండు
వాయుకుబేరుండు వామదేవుండు
న్యాయంబు దప్పి యున్నారు సెబాసు
ప్రభువు కార్యము తేటపడ జేయువారు
విభవత్వ మిదియని విని నృపాలుండు
గడగడ వణకి యా కపిలమునీంద్రు
నడుగగా పైబడి యభినుతి చేయ
కరుణించి రాజును కౌగిట జేర్చి
ఎఱిగింతు రాజేంద్ర యీసురపతిని
భక్తుల రక్షింప బనువు మీక్షణము
శక్తి కాములు నొచు సడలింపవలెను
అనుచు రాజేంద్రుని యధిపతి బిలిచి
పనువుము వరుణుని పశ్చిమంబునకు
సేనాధిపతిని దక్షిణభూమి కనుపు
పనితంబుగను సుమంతుని పూర్వదిశకు
ఉరికింపు వాయువు నుత్తరమునకు

విశదంబు సెలవిచ్చి వీడ్కైన పంపు
తీవ్రంబునను మధ్య దేశంబునకును
నీవును నేను నీకపిలుండు స్వామి
వార లందఱును పోవలె నని చెప్పి
పంపిన యప్పుడు పిలిచి వారలను
కనకాంబరంబులు ఘనరథం బొసగి
చను మన్న రాజుకు సద్భక్తి మ్రొక్కి
రామధర్ములు  కృపారసమున జనిరి
ప్రమదంబుతో సంధిపాటిల్ల నంత
అతిశయ మేషసంగతి క్రౌంచపక్ష
మది ప్రమదంబుతో ననుకూలమైన
సరవి నుత్తరమున సాగె నాపదలు
తారలు మూడు సందర్భించె నంత
భారమై యుత్తరభాగంబునందు
ప్రకటగోదావరి పర్యంతభూమి
వికటమై విపరీతవృత్తులు పొడమి
ఒక్కొక్క తిథియందు నొక్కక్కకోటి
నుక్కణగును తొలి యుగ్రరాక్షసులు
ఆ రెండు కలియుగ మన్యోన్యకలహ
క్రూర స్వభావులై కూలెడి విధము
విషవాతములచేత విపరీతగతుల
విషయ వాంఛల చేత విపరీతగతుల
విషయవాంఛలచేత వెరచి యెల్లెడల
మొదటి రాక్షసు లంక మూడు దిక్కులకు
పదియారుకోట్లు ఏబది రెండు వేలు
పదిమహాఖర్వముల్ పదియు పద్మములు
మూడు అక్షౌహిణుల్ మూడారునూర్లు



లక్షయేబదిమీద భక్షింప నొక్క
గడియలో చూర్ణమై కడు కృష్ణదాక
మడియుదు రావేళ మాధవుం డరిగి
ఇదె మంచివేళ నీ వేగు మటన్న
కదియుచు బడబాగ్ని కడగి పెల్లార్చి
పాంచాననోద్భూత పావకజ్వాల
లంచిత దశదిశలందున బర్వ
పృథులదంష్ట్రాభీల భీకరార్భటులు
పృథి వెల్ల గప్ప నభేద్యమై తనర
శతయోజనములు విశాలమై రుచుల
స్థితి గాంచు గడుదీర్ఘసింహ మల్లార్చి
కణగి దిగ్గనలేచి గర్జించి మించి
కమలాకళత్ర లోకైకరక్షకుఁ
తెర గేది యన నాదిదేవు డిట్లనియె
గరగరి రాక్షస గణముల నొడిసి
పురములు పల్లెలు భూరిదుర్గములు
వరుస సంకరజాతి వర్ణసంతతుల
లోకులు పదునాల్గు లోకంబులందు
సకలచరాచరజంతుసంతతుల
కకవికలై దుమ్ము గర్వగ తాను
దండించి ఖండించి తల లుత్తరించి
గుండెలు పగిలించి గుడ్లను పొడిచి
చెండాడు మని యాదిశక్తికి దెలిపి
పుండరీకాక్షు డప్పుడు ఇట్టు లనియె
బలపడి జీవుల భక్షించు నెడను
తలవక మద్భక్తతతుల నొక్కరిని
నైన భక్షించిన నపుడె నీ తలలు

మానుగా ఖండించు మా కుమారుండు
గాన రాజేంద్రుని గని పంపు వడసి
పూని యెక్కడికైన పొమ్ము నిక్కంబు
రాజును మఱి యువరాజును గాంచి
మా జయవార్తలు మావార్శితోడ
తెల్పు వైశాఖంబు తెగిపోక మున్నె
మలయుచునై యష్టమంత్రుల గాంచి
తొలుత నీవార్తలు తోడ్తోన చెప్పి
మావారు చెప్పిన మర్యాదచొప్పు
త్రోవ దప్పక పెడదోయి రాక్షసుల
సకలజీవుల నొక్క జాములోవలను
వికలంబుగా నీవు విరిచి భక్షింపు
ఏజాతివారైన నెవరైన గాని
ఏజాడ వారైన నేర్పడ జూచి
భక్త సంతతి పరంపరల బోనిమ్ము
భక్తులు గానట్టి పలుగాకి జనులు
వసియింప వలదింక శైలంబ పొమ్ము
కాంచీపురము దాక గైకొను సెలవు
పొమ్మని విష్ణువు భువనరక్షకుడు
తుమ్మరపురవీరదుర్గి కిట్లనియె
నీవు నీ సేనతో నీవేళ గదిలి
అల వారణాసిపర్యంత భూములను
కడువడి వేగ దిగంబరత్వమున
దడయక భువి నెల్ల స్థలములు వెదకి
బదరికాశ్రమ భూమి పరికించి యవల
యదధిపర్యంతంబు నున్న జీవులను
గడియకు పదికోట్లు కబళించి పేర్చి



గడియగడియ కట్లు గావింపు పొమ్ము
పగల నీతడవేల పదపద తూర్పు
బెగడొంద నెల్లూరు భేదింప వలయు
భాద్రపదంబున భద్ర నీవింక
రౌద్ర మేర్పడగ శ్రీరంగ పట్నమ్ము
సప్త ఘటంబుల సప్త దేశముల
ప్రాంతపు దేశాల బందరు దాక
అటుమీద దేశంబు లరసి పోనీక
కుటిలుల ఖండించి కొండలపొడవు
గన మొండెములు తోళ్ళు గావింపు మనియె
నంత సంవత్సరం బరిగిన లక్ష్మి
కాంతుండు నూహించి గరిమతో నపుడు
వర కుమారుని జూచి వైకుంఠు డనియె
పలుసంధి శంకింప వలవదు మనము
జయము చేకూడె నాశ్చర్యంబు గాదు
కేశవస్వామితో క్రియ లెరిగ్గించి
భాసిల్లు నీప్రియభార్యల నునిచి
రాజన్య పుత్ర మిత్రాదులతోడ
రాజితంబుగ యువరాజు మెప్పించి
పొలుచు దత్తాత్రేయమునివద్ద కరిగి
కపిలమహాముని గాంచి వసిష్ఠ
విపుల విశ్వామిత్రవిభునితో నచట
భోరున పదికోట్ల మునులతోగూడి
హోమంబు గావింప హోమకుండమున
కామేశ్వరియు బుట్టు గగనంబు నిండ
పెళపెళ నార్చుచు బేతాళ సమితి
కదియంగ నుదయించు కపిలునివలన

సెలవు గైకొని పంపు శక్తియోగమున
తలప ఘోటకపర్వతంబుల దాక
నొకనాటిరాత్రి నత్యుగ్రంబుగాగ
ఖలులను భక్షింపు గాసి పొందెదరు
భక్తగణంబుల పటుధర్మపరుల
బలభద్రుడనువాని బాడబపురికి
నంపు మువ్వరసేను డనువాని పిలిచి
పంపుమీ లంకలోపల సమీపమున
ఆ పరోక్షుడు చన నట తూర్పుదిశకు
కోపించి దైత్యుండు కుల్పు డన్వాడు
పదికోట్ల భటులతో వచ్చి రౌద్రమున
కదనంబునకు నగ్నికణములు దొరగ
సేనాధిపతిదెస చెచ్చర జూచి
సేనల నడిపించి చెలగి ముంగలను
ఆదుష్టదైత్యుల నందఱ బట్టి
నొక్కని పోనీక నుగ్రరాక్షసుల
చెక్కు చెక్కున దున్నె చెలగి కుల్పుండు
తలచూప వెరచి యుద్ధతి బారి పోయె
పొలుపుగ తారాధిపునివైపు చేరె
ఆపరోక్షుడు వెస నపరాంబుధి దెస
నేపున బరతెంచి యేగుట చూచి
ముదమొప్ప భృగుమహాముని సంతసించి
వదలక అక్షయ బాణ తూణీర
వజ్రకవచములు ప్రముఖాయుధములు
కనకకుండలములు గణుతించి పిదప
వనితామణిని హేమవతియనుదాని
కులశీలముల నొప్పుకూతు నొసంగి



వెలయంగ మామనువీడ్కొని కదలి
రాజసన్నిధి కేగి రహి పరోక్షుండు
రాజు సంతసమొంద రత్నాంబరములు
నొసగె దత్తాత్రేయు డురుసంభ్రమమున
కుసుమాంగియను దాని కూతు నొసంగి
యారాజమౌళియు ఆ కపిలుండు
భూరి రత్నాంబరంబులు కట్న మొసగె
భద్రావతి యనంగ పరమ కల్యాణి
భద్రలక్షణములు పరగిన సుతకు
నపుడె పెండిలి జేసి యలరిన గదిసి
కృషి మీరగా పుష్పగిరికి నేతెంచి
మహిమీద నాషాఢమాస మేతేర
బహుజీవకోటికి బాధ మెండాయె
పిడుగు లద్భుతశక్తి పృథివిపై దొరగె
జటుల భంగిమను రాజన్యులు గదిసి
కలహించి యన్యోన్యకదనరంగమున
బొరసి సర్పంబు నిర్మూలనం బయ్యె
వసుధపై నెత్తురు వర్షముల్ కురియ
కసిబిసిగా ప్రజల్ గాసి చెందంగ
అంతకు నంతకు నయ్యె మిక్కుటము
వావివరుస దప్పివాదముల్ బలిసి
పిలిపించు భక్తుల ప్రేమ బుట్టించి
అబ్జాక్షు సన్నిధి కరుగంగవలయు
వలవ దాలస్యంబు వలదు నిక్కంబు
ధరమీద శుభముహూర్తము రేపు గలదు
జనపతి యంత వైశాఖమాసమున
చనె సైన్యములతోడ శౌరి సన్నిధికి.

చని యువరాజుతో సకల మంత్రులును
తనరంగ సాష్టాంగ దండప్రణామ
మొనరించి సద్భక్తి నొగి సన్నుతింప
వనజలోచను డంత మనుమయత్వష్ట
శిల్పిదైవజ్ఞులు చేరి సేవింప
వేడ్కతో మునివరుల్ విబుధులు నడువ
పనిబూని చతురంగబలములు గొలువ
ఘనపర్వతములు నక్కజముగా డిగ్గ
దుందుభికాహళతూర్యనాదములు
అందంద మ్రోయ రయంబున గదలి
అక్కడక్కడ భక్తు లరుదెంచి మ్రొక్క
గ్రక్కున వారల కరుణించి దివ్య
దినకరశతకోటిదేదీప్యమాన
ఘనఘోటకము నెక్కి ఖడ్గంబు బూని
వీరధర్మజు లంత వేంచేయు నపుడు
శౌరి కుమ్మరుండు సన్నిధి చేరి
కొమరొప్పు ముత్యాలగొడు గొప్పు బట్టి
ప్రమదంబుతో యువరాజు చామరము
వీవ దేవేంద్రుండు విమలగాంగేయ
రీవి రత్నము సురటియు బట్టి నడువ
ననలుండు పాదుక లందంద నీయ
దినకరసుతు డంత దివ్యాంబరములు
గొనితేర నందంద కోణపు డతుల
పాదుకల్ రయముగా బట్టియు నడువ
ననిలుండు పార్శ్వంబు నందంద చదువ
ప్రతిలేని భక్తితో వరుణు డత్తఱిని
నడపంబు బట్టి మన్నన మీరి నడువ



నుపరివేళల పవనుండును గొలువ
చనుదేర ధనదుండు చండకోదండ
మును దాల్చి ముందర మును మిడి నడువ
ఘనగదాదండ మక్కజముగ దాల్చి
వెనుక నీశానుండు వేడ్కతో నడువ
ముంగల నిరుపార్శ్వములు నడువంగ
కపిలు డాదిగ మునిగణము లందంద
విపులభక్తిని నంత వేదముల్ చదువ
మనుమయాదులు కాలమర్మ సంగతులు
గణుతింప నాళీకగర్భు డవ్వేళ
బహుశాస్త్రపద్ధతుల్ పలుమారు దలప
తానెమ్మినెక్కి సేనానియు రాగ
అతులమౌ ప్రీతి వాద్యధరాదులునుగ
వాద్య సంగీతంబు లింపుగా పాడ
తడయ కరుంధతీ తరలాక్షు లంత
నలరెడు ఘుంగళహారతు లీయ
వందిబృందంబు కైవారంబు సేయ
సందడి జడియుగా స్వామి హెచ్చరిక
యనుచును నడువగ నవనీశసుతులు
ఘనవృషసేనుండు కలుషభంజనుడు
చెలగి సాందీపుండు చిత్రాంగదుండు
బలభద్రు డాదిగా పార్థివోత్తములు
దగ నాయుధమ్ములు దాల్చి ముదమొప్ప
మొనసియు యువరాజు ముందర నడువ
కదిసి వర్ధన్యుండు కార్తికేయుండు
సులభుండు రంభుండు సోమశేఖరుడు
ప్రబల సైన్యముతోడ పార్శ్వభాగముల

పదునాల్గువేలు నిర్ఝరవృత్తి నడువ
మాధవుం డరుదెంచి 'మహనంది' చేరి
సాధుజనరక్షణోత్సాహియై మెఱసి
సిరిదేవి శిఖరంబు చెచ్చెర నెక్కి
యరుదెంచె హరియంచు నతివ లెల్లరును
మహిమాస్పదుండగు మాధవు గొలువ
సహజభక్తిని నమస్కారంబు చేసి
విందు గావింప గోవిందు డావేళ
కందర్పవైరిని కరుణ మన్నించి
వెడలి మార్గంబున విముఖు గావించి
ఫణిఘోటకము మారువడి తటాయించి
కరవాలధారను ఖండించివైచి
ధరణి గంపింప దుస్తరమార్గములను
సాధించి శక్తుల జవమెల్ల మాన్పి
తత్త్వభేదుల షణ్మతస్థుల బిల్చి
కొందఱి నుగ్గాడి కొందఱి నొంచి
కొందఱి కొరడాల గొట్టి హుంకించి
కొందఱి దూషించి కొందఱి మోది
కొందఱి గుండెలు గుడ్లు దీయించి
చిందరవందర చేసి సాధించి
అందఱి దనభక్తు లగునట్లు చేసి
నందేల కరుదెంచి నడురాత్రియందు
తడయక దైత్యుల తాళ్ళప్ప తెంచి
వడివడి నామార్గవర్ణ సంకరము
చెడిపోవుచున్నట్టి చెనటుల బట్టి
వడిగ బొట్టలు చీల్చి వైరముల్ వాపి
సిరులెల్ల కోనాల సీమలయందు



పరిపరివిధముల భక్తుల గాంచి
కడుదుర్గముల తాను గైకొని కదలి
యుడుగక వెడలి యహోబిళంబునకు
చనుదెంచి నరహరిస్వామిని గాంచి
పనిబూని యాకర్లపాలెంబు కరిగి
మయునిచే పూజ లిమ్మడి గాంచి మించి
నయ మొప్ప నట దినత్రయ మున్నవెనుక
కపిలమునీంద్రు నాకర్షించి యున్న
విపులమున్నెల్లికి వేవేగ కదలి
కలహచూతపురంబు గైకొని కదలి
చండిచెర్లకుచేరి సర్వేశ్వరుండు
అందు భక్తులతోడ నరసి మన్నించి
ఘను డించినగరంబు గాంచి సంబాక
యను నగరంబును నరసి భక్తులను
వీక్షించి యాకృష్ణవేణి దర్శించి
అక్షీణమౌ బలాయతశక్తి మరలి
కలధనంబుల నన్నికడల శోధించి
వెడలంగ కుశలవవిభుని కైవసము
గావించి భక్తుల కిమ్ము ఖర్చునకు
శ్రీలను వెలయగా జేసి తత్పుతుడు
నెమలిగూడెమునకు నృపు డేగుదెంచి
రమణి దోడ్కొనివచ్చి రహి పరోక్షునకు
వరములు గావించి వైళంబ గదలి
నరులెన్న భూసురనగరంబుసకును
నరుదెంచి మృగశిరయను తలోదరిని
ఎందున్న దనవుడు ఈశ్వరు డనియె
అందఱు కుసుమాద్రియం దున్నవారు

కేశవస్వామి సంకేతంబు తోడ
నందుండి మాధవుం డరిగి సలలిత
కపిలునిస్థానంబు గాంచి వెలయంగ
నారాత్రి నిద్రించి యా మఱునాడు
పాళెంబు వీక్షించి వరుస నామీద
గిరిధరుండును పుష్పగిరి చేరె నంత.
శ్రీరమాధీశు డాశ్రితవత్సలుండు
కారణకార్యసంకల్ప మూహించి
సకలదిక్పతులును సన్మునీశ్వరులు
సకలభక్తజనాళి సందడి గొల్వ
మనుమయత్వష్టాదిమంత్రిపుంగవులు
ననుమతి భావికార్యము విచారించి
తన తనూభవుని అద్భుతభుజాబలుని
గని కుశలవులను గావించు క్రమము
సకలమౌ భావలక్షణములు దెలిసి
మంగళస్నానసమగ్రానురాగ
సంగతి దీక్షా విచక్షణంబులకు
సమయ మేర్పడ బొందు శ్రావణశుద్ధ
ప్రథిత షష్ఠి ని భృగువాసరంబునను
మంచి దటంచును మయు డెఱిగించె
పంచమితిథిని దిక్పతుల భార్యలును
సుతబంధుహితజనస్తోమంబుతోడ
మతిమంతులైె నట్టి మంత్రులతోడ
ప్రకటితభూషణాంబరములతోడ
సకలవైభవముల జనుదేర వలయు
రప్పించు మనవుడు రాజనందనుడు
నప్పుడు నాసుమంతావనినాథు



కనుగొని సెలవిచ్చి కమలోదరుండు
మనమున నూహించి మన పరోక్షుండు
ఘను డతం డిట కార్యఘటన గావించు
ఘనభుజాబలుడు సంక్రందనుం డతుల
తేజంబుచే మహాదేవసన్నిభుడు
రాజసింహుడు నృపరాజభూషణుడు
వాలాయముగ దైత్యవర్గంబునకును
కాలమృత్యువునైన కాలభైరవుడు
కపిలమహాముని కరుణ గైకొన్న
విపులమానసుడు వివేకభూషణుడు
నీ వెఱుగవు వాని నిజమహత్త్వంబు
దేవదేవుడు విష్ణుదేవు డెఱుంగు
ఏ నెఱుంగుదు కొంత వినిపింతు వినుము
వానిజన్మస్థితి వాడు పూర్వమున
మూడుమూర్తుల తపంబునను మెప్పించి
వాడు గైకొనె దివ్యవరములు మున్ను
కాలకంఠుని నైన కమలాక్షునైన
కాళికాభవునైన కమలాక్షు నైన
ప్రమథుల నైన దిక్పాలురనైన
సమయోచితంబుగ సాధింపగలడు
గిరివర దైత్యుండు కృతయుగంబునను
వరయుతంబుగ ప్రజాపతి అంశయందు
వీరనందీశుడై వీడుద్భవించె
సంగతి తనతల్లి చన్నిచ్చివీని
పృథివిపై కూర్చుండ బెట్టిన వెంట
మధుసూదనుని తన మదిలోన దలచి
తనరంగ నప్పుడు తలిదండ్రులకును

కనుమ వీడుచును బంగరుకొండ కరిగి
కడుభక్తి నాకాశగంగలోమునిగి
తడయక స్నానకృత్యము లెల్ల దీర్చి
చనుదెంచి కాంచనశైలాగ్ర మెక్కి
గొనకొన్నవేడతో కొండనెత్తమున
నొకకాలు పాదుగా నునిచి వేగంబె
అకలంకమౌ ద్వితీయాంఘ్రియు నెత్తి
హరికిరణంబులె అశనంబు గాగ
బరికించి యల ఊర్ధ్వబాహుడై నిగిడి
యోజనాయుత రూప మొయ్యన దాల్చి
తేజంబు దశదిశల్ తెరగొప్ప నిండ
చలనంబు మాని నిశ్చలచిత్తు డగుచు
బరగంగ రోషాదిపటలి వర్జించి
పవనుని బంధించి పంచేంద్రియముల
మదమణగించి నిర్మలబుద్ధిలతకు
మారాకు హత్తించి మఱి రేచకంబు
పూరక కుంభకస్ఫురణ గావించి
పదవిజృంభణను దుర్వారకుండలిని
నడివీధి బెకలించి నడినాళరంధ్ర
వివరంబు చెలగించి విడువక నిక్కి
కుడియెడమలను మార్కొని తటాయించి
ప్రళయకాలాభీల పటుబడబాగ్ని
కలయబట్టిన చేటకన్ను సంధించి
సకలప్రపంచంబు సర్వదా మిథ్య
అకలంకగతి గూడి హరిగూర్చి తపము
గావింప లోకము గడగడ వడకె
దేవతల్ భీతిల్లి ధృతి తల్లడిల్లి



హరితోడ నెఱిగింప నత డేగుదెంచి
పరికించి శతదివ్య వత్సరంబులకు
నీయుగ్రతపమున నేను మెచ్చితిని
ధీయుక్తి వేడుము దివ్యవరంబు
అనిన కేశవు భవత్కారు డావేళ
జను లెన్న దేవరసన్నిధియందు
నకలకారణ ప్రయోజనముల యందు
సకలంకపతియగు నట్లుగా నాకు
వర మిమ్ము వేరొక్క వర మొల్ల ననిన
పరిపూర్ణకృపచేత వర మిచ్చె తొల్లి
అది కారణంబున నవనిపై వీడు
విదితంబుగా నిప్పు డుదయించె నంచు
ఉల్లంబు రంజిల్ల నుత్సవవేళ
తల్లియైనట్టి సీతాదేవి నాకు
వినిపించుటయు జేసి వీనిజన్మంబు
కనుగొంటి నయ్య అఖండవిక్రముడు
నీమది మర్త్యుగా నిర్ణయింపకుము
స్వామి కార్యము వీడు సాధింపగలడు
అది యీ పరోక్షుని అవతార మహిమ
దేవతాకార్యంబు దీవించు మిపుడ
తపసులకైన దుస్తరము నీ యాత్మ
అని తోడుకొని వచ్చి యధిపతి యెదుట
నునిచిన కుశలపు డుత్సాహ మంది
బంగరు పచ్చల పల్లకి యొసగి
బంగారుభూషణాంబరము లొసంగి
అనఘాత్మ చెన్నమాంబాదిగా గలుగు
వనితలతో నీవు వైళంబు రమ్ము

పొమ్మన కుశలవభూపాలునకును
సమ్మతితోనమస్కారంబు సలిపి
తత్వైభవంబున దనయింటి కేగి
యతివల కవ్విధం బంతయు దెలిపి
సతులతో హితులతోచనుదెంచె నంత
కపిలమునీంద్రుని గని యువరాజు
తపసుల భక్తసంతతుల రావించి
తారకాక్షాది దుస్తరదైత్యతతుల
వారి బంధువులతోవారి రప్పించి
లోగడ వెలిగడ లోనుగా జనిన
వేవేగ తోడ్తోడ విబుధుల బిలిచి
వెలయంగ నొకరిని వెలితి గాకుండ
కలయంగ నాల్గుయుగంబులనుండి
యున్నట్టివారల నొనర వేర్వేర
తరుణుల పుత్రమిత్రాదిసంతతుల
పదికోట్ల దేవతాభటులను బలిచి
తడ వాలసించిన దండింతు ననుచు
నడరి పరోక్షుండు నలువతో పలికె
ధర వియత్తల రసాతలముల కరిగి
నటు పరోక్షుని శీల మంతయు చెప్పి
నీపుత్రపౌత్రుల నీబంధుజనుల
నీపత్నులం గూడి నీవు రమ్మనుచు
పదపదం డని మహాభక్తులు కదల
సకలలోకనివాససంఘంబు లపుడు
అకలంకభక్తితో నధికోత్సవములు
ఎన్నాళ్ళకిచ్చె మా కిహము వరమ్ము
కన్నులపండువుగా జాతు మనుచు



వీరధర్మజుని భూవిభుని నందనుని
వీరధర్మజు నాగవిభుడు పరోక్ష
వీరుల జూచి సందేహింప వలదు
అన వలె నని వాడు హరి యాజ్ఞ వడసి
మాన్యుల రావించి మునుల రావించి
కపిలమునీంద్రుని గని కేలు మొగిచి
తపము ఫలించె నీతలపట్టులుండె
నాలస్య మింకేల అటు సేయుడనిన
పోలిచి శిష్యుని బుద్ధికి మెచ్చి
శతయోజనముల విశాలమైనట్టి
కుదురౌ త్రికోణంపు కుండాంతరమున
ననలు ప్రతిష్ఠించి అమ్మునివరులు
కొమరార నయ్యగ్నికుండమధ్యమున
వలనొప్పనాహుతుల్ వహ్ని కర్పింప
చెలరేగి దహనుండు చిటపటార్భటుల
పటుతరబ్రహ్మాండభాండముల్ పగుల
పెటపెట మని గిరుల్ బెగ్గిలి నిగుడ
భుగభుగమంటలు భూనభోంతరము
అగణితస్ఫూర్తిమై అందు దనర్ప
దశదిశల్ నిండి ఉదగ్రత సాగి
వితతమై నెఱి మంటవితతి బిట్టెగసి
అటు సూర్య చంద్రపథావళి కెగసి
కడువడి సత్యలోకంబును గడచి
తుదితుది మండ వీథులు సాగిసాగి
కడువడి దగ నాలుకలు కోసికోసి
భయపడ నొప్పారె పటుజవోన్నతుల
ఘోటకారూఢుడై గోవిందు డపుడు

గాటంపుఖడ్గ ముగ్రంబుగా బూని
పరిపూర్ణకృపతోడ  భక్తజనాళి
జయజయశబ్దముల్ సజ్జనుల్ పలుక
రూఢిగా తనకుమారుల కిట్టు లనియె
మంగళ స్నానముల్ మరి చేయవలయు
సంగతుల్ దొరసి నిశ్చలవృత్తి బూని
కావింపు మనవుడు కరములు మొగిచి
శతమఖు డనలుండు శమనుండు నిర్భతి
తడయక యావరుణుడు పవనుండు
యక్షాధిపతియు నీశానుండు వారి
సతులతో హితులతో చటుల మంత్రులతో
సేనాధిపతులతో చయ్యన వచ్చి
పదియారుకోటుల పది రెండు వేలు
వదలక రాజుతో వహ్నిలోపడిరి
అనలుండు బ్రహ్మాండ మంది మండగను
ఖుశలవపతి గని వహ్నియ జడిసి
హరికుమారుండు వీడలవిగా డనుచు
గరిమ కృశానుండు కడుచల్ల నయ్యె
జలధిలోపల నీదు చందంబు తోచె
సలలితకుశలవక్ష్మావల్లభుండు
సకలమంత్రంబులు శౌరిసత్కృపను
అకలంకముగ పదియారు ఘడియలను
ఆకుండ మధ్యంబునం దుండ వారు
బాగొప్ప వీక్షించి పద్మలోచనుడు
వలనొప్ప నీతి దివ్యజ్ఞానదృష్టి
కులశీలదాక్షిణ్యగుణవయోధర్మ
ములు నీతిమార్గముల్ మూడుమూర్తులకు



నలవిగానట్టి మహామహత్త్వములు
శతసహస్రములు లక్షలు కోటివేలు
ప్రతిలేని ఖర్వముల్ పద్మసద్మములు
మదనసుందరులైన మానినీమణులు
సదమల పతిభక్తి నత్యున్నతులను
పరిపూర్ణ సత్కళాభావుల జేసి
జలజాక్షు డరుదెంచె సత్కుమారకుని
ఆలింగనముచేసి యాసుమంతాది
శీలవంతుల కటాక్షించి వేవేగ
నందఱ దోడ్కొని హరిసంతసమున
సందడింపుచు దన సతులును దాను
చనుదెంచి రచ్చటి సన్నుతుల్ మెచ్చ.
శ్రీవీరధర్మజస్వామి విజయము
మహిమభారతి చెప్పమఱి భవిష్యంబు
విన్నవించెద నేను విశదంబుగాను
చెన్నొంద వినరయ్య చెవులపండువుగ
కమలాలయనుగూడి కమలనాభుండు
రమణీమణిని గూడి రామధర్మజులు
కదలివచ్చెడు జూడ కలికిరూపమున
ముదమందుచుండును మూడులోకములు
నలువంక రథములు నాలుగుకోట్లు
పదునెనిమిదికోట్ల భటవీరవరులు
పదములు పాడుచు పద్మినీస్త్రీలు
ముప్పదిముక్కోట్ల మూకలతోను
వీరగురుడు వచ్చి  యానందముగను
ముత్యాలఛత్రముల్ ముందర గొలువ
సత్వాత్ము లది చూచి సంభ్రమించెదరు
భేరి వేయించేరు భీకరంబుగను

ధారుణిలో ప్రజల్ తల్ల డిల్లగను
భానునందికి వచ్చు భక్తవత్సలుడు
భానుమండలపతి పాలించు జగము
అటమున్న వీరభోజాదినాయకులు
కృతయుగ ధర్మపద్ధతి నడిపింప
అమలనాగస్థలమందున దివ్య
యోగ మార్గంబున యోగీంద్రు లెల్ల
నొసగ దివ్యాస్త్రంబు లొగి వాని నంది
వసతిగా పదునాల్గు వర్షంబు లచట
చనిన పిమ్మట నాదిశక్తిని పంపు
తామసంబునను చింతన చేయ నరులు
కాలజ్ఞు లొనరించు గతి కానలేక
మూలంబు తెలియక మూర్ఖులై నరులు
గురుధర్మములు లేక కుటిలమానవులు
తిరుగుచుందురు దివ్య దేశంబులన్ని
చెడిపోవువారల చేపట్ట లేక
గడచిపోవుదు రనుకంపయు లేక
మారిపంపున కొంతమంది మడియుదురు
పాతికపాలు భూప్రజ సత్యజనులు
నియతిజ్ఞు లెల్లరు నిలిచియుండెదరు
తామసం బెడలించి తగ దినకరుడు
క్రమమున నుదయించు గతి వీరభోజు
డమిత తేజంబున నానందమునను
ప్రమదతోడుత రాజ్య భారంబు బూని
కృతయుగ ధర్మాలు కీర్తింప కవులు
శతదశసంఖ్యావర్షాలు పాలించు.

శ్రీవీరబ్రహ్మగురుబ్రహ్మణే నమః
బ్రహ్మార్పణ మస్తు !

# 1వ సౌజన్య పత్రిక

(శ్రీవీరబ్రహ్మేంద్రస్వాములవారి సంసార గృహమందు పుట్టపై పీఠములో పరీధావి సంవత్సర (1912) కార్తిక బ13లు శుక్రవారం రోజు పూజారి రామయ్యగారు పూజ చేయుచుండగా వారికి కన్పించిన కాలజ్ఞాన తాళపత్రము).

ఈ పత్రిక రక్తాక్షినామ సంవత్సర ఆశ్వయుజ శుద్ధ10లు నాడు ఉత్పత్తి అయినది. కనుక బదరికాశ్రమమందున్న మహాఋషులు, యోగులు, మునులు, మహాపురుషులు వీరయోగి, రామయోగి, నాగయ్య, శివచిదంబరస్వామి మొదలైన ఘనులు ఆనతి యిచ్చినారు. కనుక మహానంది శ్రీశైలపర్వతము మీద తపస్సు చేసి ముప్పదిమూడు కోట్ల దేవతలచేతను, మహామునులతోడను వరము తీసుకొని సిద్ధప్ప, అక్కనాగమ్మ, కనకదుర్గాంబ ఈ మొదలైనవారు ఆశ్వయుజ శుద్ధ10లు దశమినాడు నందికొండకు ప్రవేశించినారు. ఇక కొంతకాలమునకు భూమి పరిపాలన చేయవత్తురు అని ముగ్గురు మూర్తులకు (త్రిమూర్తులు) సెలవు ఇచ్చినారు. ఇక తడవు లేదు. త్వరగా వచ్చేరు గనుక ఈ వృత్తాంతము వ్రాయవలసి వచ్చెను. ఇంకా వెనుక మంచి కవితలు వ్రాయించి పంపిస్తూ ఉన్నాము. ఓ మానవులారా! మీరు పాపకార్యములకు జడియకుండా ఉన్నారు. ఇంకా ఒకచిత్రము పుట్టీని. క్రోధినామ సంవత్సరము మొదలుకొని ఉత్పాతాలు పుట్టీని. ఢిల్లీవారు తరలి ఆనెగొందికి చేర వచ్చెదరు. ఎర్రవారిని ఏనుగులచేత త్రొక్కించును. తొమ్మిదిమూరల ఆజానుబాహులు వచ్చేరు. అందరిని పట్టి కోసేరు. ఆకాశమందు వాక్కు వాక్కుమని శబ్దము పుట్టీని. ఆకాశమందు నాల్గుచుక్కలు ఎర్రగాను, ఎద్దు ప్రకాశముగా ఒకటి వెళ్ళివచ్చిన అవి చూచినవారు వెతపడి చచ్చేరు. దక్షిణమందు ఒక వింత పుట్టీని, పడమట మార్గమందు ఉత్పాతము పుట్టీని. ఢిల్లీవారు తరలి ఆనెగొందికి చేరవచ్చెదరు. అదివరనుండి ఉరుములు, పిడుగులు పడును. తూర్పు మార్గమున ఉత్పాతమైన శక్తితల ధూళియై పొయ్యాని. అవ్యయమైన వృక్షం వచ్చేననిపించి, వింత వింతలు చూపి ముగ్గురుమూర్తులు వచ్చేరు. మూలబ్రహ్మము అప్పుడు వచ్చీని. కులగోత్రాలు

వేదశాస్త్రములు వచ్చీని. షణ్మతాల నామం కలవారు ప్రతిష్ఠకు వచ్చేరు. శాపం నిలిచి చేరుదురు.నగరపాటికి ఉత్తర భాగమందు ఒకఋషి పుట్టీని. ఆయనతో కూడ అనేక ఋషులు పుట్టెదరు. ఆకాలమందు దివారాత్రిళ్ళు లేకుండను అక్కడ పుట్టే ఉత్పాతములు లెక్కలేదు. దక్షిణమందు మెరిసీని. ఉత్తరమందు ఉరిమీని. పిడుగులు పడును. అష్టదిక్పాలకులు అల్లకల్లోలమై, దేశములు తల్లడిల్లి, రాజులు రాజ్యములు విడచి, ప్రజలు పరభూములకు చేరుదురు. తల్లి ముఖము బిడ్డ, బిడ్డ ముఖము తల్లి చూడక నష్టమైపోదురు. ఈశాన్య దిక్కునుండి విషపుగాలి వచ్చీని. విప్రులు మూర్ఛలు పొయ్యేరు. వింత వింతలు పుట్టీని. అప్పుడు శివుని కంట మిణుగులు రాలును. పార్వతి నయనాల నీళ్ళు కారీని. శ్రీశైల శిఖరమందు నిప్పులు ధ్వని రాగా విని ఆశాకమంతయు వాక్కుమనే ధ్వని పుట్టీని. వీరభోగవసంతరాయులని దినం పిలుస్తూ వచ్చీని. పల్లెలపట్నాల రక్తవర్షం కురిసీని. వీరభోగవసంతరాయలు భూలోకానికి వచ్చే కాలమందు పుట్టే కార్యాలు అమావాస్యనాడు చంద్రోదయ మయ్యీని. పుష్పముల వాన కురిసీని. అవిచెప్పి స్త్రీలు నదులలో జోలలు పాడెదరు. భూమి నిరామయంగా ఉండే కాలమందు తండ్రి బిడ్డలకు, అన్న చెల్లెండ్రకు, అత్తలల్లుండ్రకు శ్మశానమందు లగ్నం నిశ్చయం చేసినారు. దక్షిణ మార్గం నుంచి ఒక వైష్ణవుడు పుట్టివచ్చును. జనుల సంహరించును. పాశాంకుశాలు విలిచికొని ఎనిమిది మూలల కత్తి పట్టని మహాత్ముల పట్టి కట్టి కోసేరు. అగ్నిలో వేదం పుట్టీని. అగ్నిలో లేచిన వారు వచ్చేరు. హరబ్రహ్మం విముక్తి అయ్యీని. గంగోదకం కురియును. అయిద్దాయివారి ప్రమాణం గెలిచీని. అయిదేండ్ల నాగయ్య వేదము చదివీని. రాజులతో వియ్యమందేరు. పెండ్లికొడుకును చేరవచ్చేరు. విజయ నగరం విస్తరించీని, బనగాని పల్లె మహాపట్టణ మయ్యేను. ఈ ప్రకారం కాబోవుచున్నది గనుక ఆయోగం విచారించి వ్రాయవలసి వచ్చును. ఇంకా ఒకనాడు అకాలశక్తి పుట్టును ; భూమి మీద నడుచును. మట్టి మిద్దెలు కలిగినవారు మారణమై పొయ్యేరు, ప్రజలు కూర్చున్నవారు కూర్చున్నట్లు పడుకొన్నవారు పడుకొన్నట్లు మాట్లాడేవారు మాట్లాడుతునూ ముఖాన నోటిలో పుండ్లు పుట్టి చచ్చేరు. ఈలాగున నష్టమైపోదురు. ప్రజలు ఆకురాలినట్లు రాలుదురు. భూమి మీదనున్న నిర్జితుల ధనం శ్రీశైల పర్వతము మీద చేరును. నరులలో వైరము మీద తర్కము పడును. పంచముఖబ్రహ్మ అప్పుడు వచ్చును. వారితో సంభాషించును.



తిరుగా రాయలు సింహాసనం చేరబోయేను. ముగ్గురు నరులకు గండకత్తెర ప్రమాణం చేయవలసి వచ్చును. పదివేలముగ్గురు పరబ్రహ్మ వంశమందు ఏక అవుపోసనతో పట్టుబడుదురు. వీరభోగవసంతరాయలు అహోబిళమునందు ఉత్పత్తి అయ్యీని. పుణ్యపురుషులు హెచ్చరికపడి దారి తెలుసుకొని మార్గంబు పట్టుకొని ఆజాతకానికి చేరవచ్చేది. కాలముసంఖ్య ఇంకామీకు తెలియదు.చూచినవారు చూచినట్లు, విన్నవారు విన్నట్లు స్త్రీలు బాలురతో లేచివచ్చేది. రాక గర్వాంధకారులై యుంటే వికారస్వరూపమైన శక్తివచ్చును.అందరిని దుప్పులు చేయును. తరిమి తరిమి కొట్టును. కొట్టి కొట్టి కోయును. అగ్నిస్నానం చేయించును. అంభోయని అరపించును. లేనిబాధలు పెట్టును. ప్రయాస చేయును. యమబాధలు వచ్చును. ఏటిలో బడద్రోయును. శిఖరము వెళ్ళదీయును. పంచశక్తులు వచ్చును. అప్పళించి మ్రింగును. నల్లగాలి వచ్చును. ఆమీదట బొబ్బలు పుట్టును. అష్టాదశ వర్ణాలవారు ఒక్క చోట నీళ్ళుతాగుదురు. నాల్గుజాతులవారు ఒక్కజాతియై యుందురు. ఈలాగున కాబోవుచున్నది యోగం తెలుసుకునే వారు తెలుసుకొని హెచ్చరిక పడి వస్తూ ఉండేది. వచ్చిన వారికి యమబాధలు తప్పును. పుణ్యపురుషులై గురుచెంత చేరుదురు. వారికి యమబాధ లుండవు. పాపాత్ములకు చింతలు పుట్టును. పుణ్యాత్ములకు భక్తి పుట్టును. దోషులకు అపోహలు తోచును. అమ్మలక్కలు అంతా వింతలై యుందురు. ఇందుకు సందేహము లేదు. ఆ వీరభోగవసంత రాయ లుండే క్రమము చెప్పేము. సువర్ణచ్ఛాయ బోలినవారు, విభూతి తిలకము ధరించినవారు, యోగదండము పట్టినవారు. కావివస్త్రాలు ధరించినవారు, వజ్రాల పాదుకలు తొడిగినవారు - మూలబ్రహ్మం. అతడు పుణ్యపురుషుడు. నూట ఎనిమిది సంవత్సరములు రాజ్యపాలన చేయును. వారిసాంప్రదాయకము వారు వెయ్యి ఏండ్లు ఏలుదురు. ఇందుకు సందేహము లేదు. పూర్వము నడచిన యోగఫలము సమసిపోయి స్వకార్యాలు చెప్పేము. అప్పుడు పరబ్రహ్మ వంశము ప్రఖ్యాతి చెయ్యవలెనని ఆదికాలమందు కాశిలో ఉత్పత్తి అయివచ్చును. భూమిలో నున్న వంశమువారిని ప్రఖ్యాతి చెయ్యవలెనని బెంగుళూరు అయ్యఅనే మహాత్ముడు శాపమిచ్చె గనుక ఇంతమటుకు జరిగెను. ఆ పుణ్య పురుషుడు నూటతొమ్మిది ఏండ్ల మూడు దినములున్ను అతిఘోరమైన తపస్సు చేసి శాపం విముక్తి చేసుకుని సమస్తము

పంచముఖ బ్రహ్మయై భూమి పరిపాలన చేయవస్తూ ఉన్నాడు. ఇందుకు సందేహం లేదు. ఈ మహత్యము ఎవ్వరైనను హాస్యము చేసిన వారికి వచ్చే కీడు చెప్పేము. వంక శిఖలవారు వచ్చేరు. వచ్చినవారు చూతురు, పట్టి పట్టి కోసేరు. అట్టహాసము చేసేరు. వీరగురుని ప్రార్థన చేసేరు. వీరబ్రహ్మము అప్పుడు వచ్చును. మూర్ఖుల ముక్కు కోసేరు. ముప్పు తిప్పలు పెట్టేరు. గట్టిగా మానవులు మ్రగ్గేరు. కొంకనక్క వచ్చేని. వచ్చి మానవుల మెక్కేని. బండిమీద కోడి వచ్చిని. దాని రెక్క విసరుకు లక్షలు చచ్చేరు. దానికూతకు కులక్షయమై మానవులు గట్టిగా మ్రగ్గేరు. ఇందుకు సందేహము లేదు. ఇకనైన జ్ఞానము తెలుసుకొని కనుగొని యుండేది. ఈ మహత్వం అయిన పత్రిక బ్రహ్మ క్షత్రియ వైశ్య, శూద్రాదులు మొదలైనవారు ఈ పత్రిక చూచిన తక్షణమందు కన్నుల కద్దుకొని ధూప, దీప నైవేద్యాదులనుంచి వడపప్పు పానకము చేయించేది. పంచ వాద్యాలతో కూడ నాలుగువీధులు ఊరేగింపు చేయించేది. బదులు పత్రికలు వ్రాసియుంచుకొని ఆవల గ్రామాదులకు పంపించేది. శుక్రవారం సముద్ర స్నానం చేసి ఆ సముద్రతీరమందున్న మహాశక్తి శక్తి దర్శనం చేసుకొని తిరుగా వచ్చి యొక విభూతిపండు ఒక కలశము పెట్టి హోమగుండం త్రవ్వుకొని యీ పత్రికలగుండా పూజలు చేస్తూ ఉన్నారు. ఎవ్వరు పూజలు చేస్తారో వారిని రక్షింతుము. చేయనివార్కు అక్కధర్మము చేయనివారు. దానధర్మాలు చేయనివారిని అక్క నాగమ్మ విచారించును. ధర్మం చేసినవారు, ఒకరిని దూషించనివారు, ఒకరి సొమ్ముకు ఆశపడని వారు పుణ్యపురుషులై యుందురు. ఇందుకు సందేహము లేదు. భగవత్ ధ్యానసంపన్నులై యుండేది.

సమాప్తము

# 2వ సౌజన్య పత్రిక

(శ్రీప్లవనామ సంవత్సర (1961) చైత్ర శుద్ధ౬లు సౌమ్యవారం పగలు 3 గం॥లకు కందిమల్లాయపల్లె శ్రీవిరాట్ పోతులూరు వీరబ్రహ్మేంద్ర స్వాములవారి జీవసమాధి ఉత్తర భాగమున స్వామివారి పాదుకా సన్నిధానమున మఠాధిపతులు శ్రీ శ్రీనివాస స్వాముల వారికి లభించిన తాళపత్రము)

ముందు ఒకనాడు దేవలోకమందు ముప్పదిమూడుకోట్ల దేవతలున్ను, నలువది తొమ్మిదివేల మునులున్ను, గరుడ, గంధర్వ, సిద్ధ, విద్యాధరులున్ను, సత్యరాగ, వీరభద్రస్వామిన్ని, ద్వాదశాదిత్యులున్ను వీరు మొదలగువారిని పిలువనంపించి దేవేంద్రుడు ఆజ్ఞాపించిన వైన మేమంటే -

ఓ దేవతలారా! ముందు భూలోకములో పాపము మూడు పాళ్ళున్ను పుణ్యము ఒక పాలున్ను నడుస్తూఉన్నది. దుష్టు లధికమై ధన మదాంధతచేతనున్ను గర్వాభిమానులై పెద్దతనం తెలియక నీతిదప్పి దుర్నీతులై వావివర్తనలు లేక గర్వించి యున్నందుకు ఇందుకు యోచన ఏమి చేస్తూ ఉన్నారని అడుగగా ఇంద్రునితో సురలు విన్నవించిన వైనం ఏమంటే ఓ దేవేంద్రా! నీకు తెలియని యోచన మాకు ఏమి తెలియును కనుక? అయితే మాకు తోచినంత మాత్రం విన్నపం చేస్తూ ఉన్నాము. దయచేసి వినరయ్యా! కలియుగంలో ఇదివరకు ఎక్కువ పాపం లేదు. ఇప్పుడు దుష్టులు అధికమైనందున వాండ్లను శిక్షించను ఒక పుణ్య పురుషుణ్ణి పుట్టించకుంటే భూమి నిలువనేరదని దేవతలందరు చెప్పగా విని దేవేంద్రుడు సమ్మతించి దేవతలను వెంటబెట్టుకొని వైకుంఠమునకు పోయి శ్రీ లక్ష్మీనారాయణ స్వామివారికి సాష్టాంగ నమస్కారములు చేసి స్వామీ! పరశురామా! ఆదిమధ్యాంత రహితా! అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! భూమిలో దుష్టు లధికమై నందున చిన్నతనం పెద్దతనం తెలియక నీతిదప్పి దుర్ణీతులై శ్వేతముఖుల రాజ్యం అయిపోయి నందున భూలోకం నిలువనేరదు. పైగా కలియుగ ప్రమాణము 4 లక్షల 32 వేలు

కనుక ఇదివరకు చెల్లిపోయినది. 4 వేల 992 ఆయెను. ఇంతలోగా పాపముమూడు పాళ్ళున్ను పుణ్యము ఒక పాలున్ను అయినది. కాబట్టి భూదేవి ఓర్వలేక దేవత లందరూ చెప్పగా విని శ్రీమన్నారాయణమూర్తి చెప్పినవైనం ఏమంటే - నేను భూలోకమున కాశ్మీరదేశం ఏలే జయసింగు మహరాజుకున్ను పుత్రుడనై జన్మించి దుష్టులందరిని పరిహారం చేస్తూ ఉన్నాను. మీరందరు మాకు జయప్రదం కోరండి. ఇదిగాక సాంబశివుడు చిదంబర దీక్షితుల వారున్ను, రామయోగి అయ్యవారున్ను అవతరించినారని చెప్పగా విని సాదృశ్యంగా దుష్టనిగ్రహ శిష్ట పరిపాలన చేసే నిమిత్తం కనకదుర్గాంబను పుట్టించి వారివారికి వినిపించి తమనిజస్థానములకు పొమ్మని, తాను కాశ్మీరదేశం ఏలే జయసింగు మహరాజుకు అతని భార్య తిలకమాంబ అనే మహపతివ్రతకును పుత్రుడనై జన్మించెదను. అప్పుడు నవగ్రహములు శుభస్థాన మందు ఉందురు. వారి శరీరం పులకింప మూర్తిమంతు డాయెను. కాళయుక్తినామ సంవత్సరము మకరరాశియందు ఈశాన్య దేశానకు గౌతమీ తీరం కేదారిక వనములో ఒక ఉత్పత్తి బిలము ఆయెను. ఆబిలములో ఈ బాలుండు దిగి అక్కడనున్న మహాత్ముల నందరిని దరిసెనం చేస్తూ నిలబడి యుండగా మహాత్ములు కనులు దెరచి చూచి ఈ బాలుండు ఎవరోయని యోగదృష్టి నిదానించి చూచి ఆదినారాయణమూర్తి ఈ ప్రకారం అవతరించినారని తెలిసి సంతోషాంతరంగులై వారిని పూజించి ఓయీ ! రాచకుమారుడవు నీవు ఈ భూలోకము ఏలే కొరకు నారాయణాంశము చేత కాశ్మీరదేశం ఏలే జయసింగు రాజుకున్ను అతని భార్య తిలకమాంబ అను మహపతివ్రతకున్ను, పుత్రుడై జన్మించి ఏనూరుకోట్ల భూమండలం ఏలే ఏకచ్ఛత్రాధిపతివై యేలబోతూ ఉన్నావు. నీనామధేయం ఏమంటే వీరభోగ వసంతరాయలు అని చెప్ప విని ఓ మునులారా? నామీద కటాక్షించి సకల విద్యలు, చెప్పన్నారు భాషలు, ధనుర్వేదాది విద్యలు నేర్పమని అడుగగా ఆమునులు సంతోషించి సకలవిద్యలు నేర్పిస్తూ ఉండిరి. అంతట కొండిరాయములో రామ నగరమందు మునుకోటి అగ్రహారములో రామయోగి పుట్టి పెరుగుతూ ఉండెను. ఒకనాడు రామయోగి అయ్యవారి సముఖానకు వచ్చి (చిదంబర దీక్షితులు) పూజించి నమస్కారము చేయగా ఓయీ చిదంబర దీక్షితులవారు ఈ భూమి పరిపాలనము చేసే నిమిత్తార్థమై అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుండైన శ్రీమన్నారాయణమూర్తి



కాశ్మీర దేశం ఏలే జయసింగు రాజుకున్ను అతని భార్య తిలకమాంబ మహపతివ్రతకు పుత్రుడైజన్మించి ఈశాన్య దేశమున సకలవిద్యలు నేరుస్తూ ఉన్నాడని నాతో నారదమహాముని చెప్పినాడు గనుక మనమందరమున్ను అవ్వారి సముఖానకు పోయి అక్కడున్న దివ్య తేజోవంతుడైన బాలుని జూచి వత్తమని వారిద్దరు బదరికాశ్రమమునకు బోయి అక్కడనున్న దివ్యతేజోవంతుడైన బాలుని జూచిరి. ఈ బాలుడు భూమండలము ఏలేకొరకు వీరభోగవసంతరాయలున్ను, రామయోగి అయ్యవార్లున్ను, చిదంబర దీక్షితులవారున్ను మీరు ముప్పురు మూడు రూపంబుల అవతరించినారు. చైత్రశుద్ధ సోమవారంనాడు రాత్రి నేను లేచి వస్తూన్నాను, నేను లేచి వచ్చేవరకు పాపాత్ములందరు నష్టమైపోదురు. శ్రేష్ఠులు మాదరిసెనం చేసుకొని సుఖంగా ఉందురు. పాపాత్ములు ఏలాగు నష్టమైపోదురంటే అన్యోన్య కలహములచేత నశింతురు. కొండల శిఖరము మీద మంటలు కనిపించును. ఇదిగాక ఒక ఉత్పాతమైన కనకదుర్గాంబను పుట్టింప దానిచేత కొందరు నశింతురు. గుళ్ళలోనున్న దేవతల కనుల్లో ఉత్సవము లధికమౌను. గ్రామదుల మీద నాట్యమాడుదురు. ఆలాటి వేళల్లో పాపిష్ఠుల మనస్సు చంచలమగును. మల్లికార్జునస్వామి జనులతో ఇష్టాంతరముగ మాట్లాడును. అట్లా కొందరు నశింతురు.వీరభోగవసంతరాయలు భూమి పాలించవస్తాడని జనులు ఆడుకొందురు. వడగండ్ల వానలు అధికమై కురియును. అందువల్ల కొందరు నశింతురు. కాంచీపురి కామాక్షమ్మ దక్షిణరాజ్యం జనుల నష్టం చేయును. కర్నాటకదేశానికి కాళికా దేవిన్ని, తురకారణ్యానకు దుర్గిన్ని, అరవదేశము నకు వీరభద్రుడు, నందిరాజ్యమునకు నాగేంద్రుడు, బాలురు మొదలుకొని వృద్ధుల పాపాత్ములను నష్టం చేయును. అర్ధరాత్రివేళ కాకులు కూయును. వింతలు అధిక మవును. దుష్టులనోళ్ళలో మల్లెలు (పురుగులు) పడిచత్తురు. పగలు ఆకాశాన చుక్కలు కన్పించును. నాల్గు దిక్కులున్న ఆకాశాన అంధకారమై ధ్వని వినబడును. అందున కొందరు నశింతురు. నక్కలు, పమిడికంటెలు రాత్రి పగళ్ళు కూయును, నీళ్ళలో జలజంతువులు అన్నియును భూలోకానికి వచ్చి చస్తిమని కూయును. అందున కొందరు నశింతురు. శ్రీశైలమునకు ఒక మొసలి వచ్చి భ్రమరాంబ గుడిలో మేకకూత కూసి మరుగై పోవును. అందున కొందరు నశింతురు. శక్తులు బెబ్బులులై ప్రజల కరచి చంపును, కుమారస్వామి గుడి తలుపులు తీసినా రాకుండా మూసుకొని

యుండును. విషపుగాలిచేత కొందరు నశింతురు. సూర్యమండలము నుండి ధణధణమని భూమిలో పడును. మల్లికార్జునస్వామి కన్నులలో నిప్పులు రాలును. బసవేశ్వరుడు గడగడ వణకును. ఆకాశాన దేవతలు పలుకులు పలుకుదురు. వారి వారి వాక్కుల శబ్దము పుట్టును. అందున కొందరు నశింతురు. వారి వారి వాక్కుల శబ్దము పుట్టును. అందున కొందరు నశింతురు. కొక్కిరాయలు ఏలూరు అరణ్యములో నష్టమై పోవును. తిరుపతి వెంకటాచలపతి గుళ్ళో మ్లేచ్ఛులు చొరబడుదురు. కపిధ్వజంలో ఝూంకారనాదము పుట్టును. జగమంతయు వణకును. గరుడధ్వజం విరిగి నలుదిక్కులకు పడును. తిరువళ్లూరు వీర రాఘవస్వామికి చెమటలు పట్టును. జగమంతయు నష్టమై పోవును. లక్ష్మీదేవి కన్నులలో నీరు కమ్మును.వినాయకుని మంత్రం ఊర ఊర చదువుదురు. నీళ్ళలో స్త్రీలు జోలపాడుదురు. కనుల్లో రక్తము కారును. దండిస్థలాలన్ని తురకల పాలై పోవును. పెద్ద పెద్ద తురకలంతా పెద్ద పెద్ద గోరీలు కట్టుదురు. సమస్త జనులంతా వీరబ్రహ్మము గారి చరిత్రములో తగులుదురు. అమావాస్యనాడు చంద్రుడు పుట్టును. ఆకాశము ఎర్రనగును. అష్టాది గోకర్ణంబులు ఆజ్యమిచ్చును. పట్నాలలో గ్రామాలలో వనములలో రక్త వర్షము కురియును. పట్నాలలో లక్ష్మీదేవి దుఃఖించును. వీరభోగవసంతరాయలు వస్తున్నాడని భూదేవత పలుకును. సముద్రాలు ఉప్పొంగును. వెనుక ముందర ఏ ప్రకారం ధర్మం నడిచెనో ఆ ప్రకారం ధర్మాలు నిండా నడుచును. సకల వర్ణములవారు సంతుష్టులై యుందురు. ఈ బాలుండు ఇక్కడికి వచ్చి ఆరునెలలు ఆయెను. ఇక్కడ మూడునెలలుండి కేదారి ఉపదేశించి సాంబశివుని గూర్చి రెండునెలలు తపస్సు చేసి అతని చేత మూడు వరములు తీసుకొని ఇంద్రకీలాద్రికిపోయి మహాత్ముల దరిసెనం చేసుకొని గంగాతీరమందు చేరి తమ వంశకర్తలైన ధర్మరాజాదుల ముద్రికలు గైకొని తొంబై అయిదు సంవత్సరములు రాజ్యపరిపాలన చేసుకొని ఏకచ్ఛత్రాధిపతియై రాజ్యము నేలును. భూలోకం పరిపాలన చేసుకొని ఏకచ్ఛత్రాధిపతియై రాజ్యము ఏలును. భూలోకం పరిపాలన చేసేటందుకు వస్తాడు. ముందు దుష్టులు నష్టమై పోదురు. మిగిలిన పుణ్యపురుషులు ధర్మము నడుచుకుంటూ సుఖంగా నుందురు. అటు తర్వాత నెలకు మూడు వర్షాలు కురియును. పైర్లు పంటలు అభివృద్ధిగా నుండును. ధర్మము నిండుకొని సుఖంగా నడుచును. నాల్గు జాతులవారు లెస్సగా నుందురు.



సకల భోగభాగ్యులై సుఖంగా ఉందురు. ఈ సౌజన్య పత్రికను భూమిమీద ఎవరు ప్రబలం చేస్తూ ఉన్నారో వారు సౌభాగ్యములు కలిగి వర్ధిల్లుదురు. ఈ పత్రికను వ్రాయక పాలుమాలి గర్వించిన సకల పాపంబులు సిద్ధించును. ఈ పత్రిక ఎవరు కోడిగం (హాస్యం) చేస్తూ ఉన్నారో, వారినోట్లో వజ్రదొండి పురుగులు పడును. ఓయీ చిదంబర దీక్షితులవారు రామయోగి అయ్యవార్లున్ను మేము చెప్పిన మాటలు తెలుసుకునేది. ఎంచగల మహిమలన్ని చూస్తిరిగదా? ఈ లోకములో నున్న ప్రజలంతా విన్నారు గదా. ఈ పత్రికను ఎవరు ఆక్షేపణ చేస్తూ ఉన్నారో వారిని కనక దుర్గాంబ ఖండించును. శక్తులకు ఆహుతి ఇచ్చును. భూమండలము మీదికి వ్రాసి పంపించినామని బ్రహ్మంగారు ఆజ్ఞాపించినారు. కనుక మహాఋషులున్ను, మహా పురుషులున్ను ఆజ్ఞాపించినందువల్ల మేము భూలోకములో నున్న పుణ్యపురుషులైన వారికి తెలియచేసే కొరకు ఈ సౌజన్యపత్రిక వ్రాసి పంపించినాము. మీరంతా జ్ఞానము వహించి నాభక్తులై యుండవలసినది. ఈ పత్రికను శ్వేతముఖులు చూచి మమ్ములను పట్టుకరమ్మని మావద్దకు వారి దూతలను పంపించినారు. కనుక వారి దూతలు మావద్దకు వచ్చి మమ్ములను పిలువగానే మేము యోగదృష్టితో నిదానించి చూచి, శ్వేతముఖులు బలిష్ఠులై యున్నారు. కనుక వారితో చెప్పరాదని వారివద్దకు పోతిమి. వారు మ్మమ్ములను చూచి 'మీరు మాకు ఎట్లు వ్రాసి ఎంపించినారు? అయితే భూలోకానకు' దైవము ఎవరని అడుగగా ' ఇపుడు సాంబశివుడు ప్రత్యక్షమై చెప్పి నారు. మీకున్న దైవమేకదా' అన 'మేము దైవమే' యని చెప్పినాము. కనుక బ్రహ్మము గారైతే మేము ఒక విధము చేస్తూఉన్నాము. దానికి నిలువమని అడిగిరి. ఆ ప్రకారము చేయమంటిమి. మామీద జోడుఫిరంగిగుండ్లు కాల్పించినారు. రెండు ఫిరంగిగుండ్లు మా హస్తాలను పూలచెండ్లయి తాకెను. అది చూచి శ్వేతముఖులు భయపడి పారి పోయిరి. ఆ సమయమందు మహాఋషులున్ను, మహాసిద్ధులున్ను, దేవతలందరు వచ్చి చిదంబరులు భగవద్భక్తులని తెలియక శ్వేతముఖులు వింతచేసినారు. అయితే ఇప్పుడు వారికి కైలాసము ఇప్పించ మని అడుగగా ఇట్టి దుర్బుద్ధులు పుట్టించినందున వారికి హతమయ్యే కొరకు కాబట్టి యీ వర్తమానం యావత్తు భగవద్భక్తులైన వారికి పుణ్య పురుషులైన వారికి తెలియవ్రాసినాము. సిద్ధార్థి నామ సంవత్సర ఆషాఢ శుద్ధ సప్తమి శుక్రవారం నాడు 3వ పత్రిక ఉత్పత్తి

ఆయెను. ఈ పత్రికను పుణ్యపురుషులైన వారు చూచుకొనేది. పోతులూరు వీరబ్రహ్మాన్ని నాలుగు వీధులు ఊరేగింపు చేసి జ్ఞాన మార్గంగా ఉన్నకోర్కెలు ఇవ్వనాయెను. ఈ పత్రిక హాస్యం చేసినవారిని కనక దుర్గాంబ దండించును. నేనున్నూ ఆ దేశానికి రెండవ నెలలో వస్తున్నాను. ఈ ప్రకారం ఎవరు పూజలు చేస్తూ ఉన్నారో వారికి పుష్ప మిచ్చిన జోడు పుష్పము లవును. వారి ఇంటిలో రెండు వింతలు అగుపడును. ఈపత్రికను వ్రాయక పాలుమాలి చదువక ఊరికెయున్న కనకదుర్గాంబ దండించును. గ్రామ గ్రామ గ్రామమునకు ఈ పత్రిక వ్రాసుకొని పూజలు చేయవలసినది. నామీద భక్తికలిగి యుండవలసినది. ఏమో వ్రాసినారని మీరు మరచి యుండవద్దు. ఈ పత్రికను తీసుకొని వచ్చిన భక్తులను గ్రామములోనికి పిలుచుకొని పోయి ఆభక్తునకు భత్యము ఇచ్చి మఠానికి దక్షిణయిచ్చి పంపవలసినది. ఈ ప్రకారం యోగులున్నూ మహా పురుషులున్నూ బ్రహ్మముగారున్నూ సాంబమూర్తిగారున్నూ ఆజ్ఞాపించినారు. జగత్తు మీదికి వ్రాసి పంపించినాము. ఈ పత్రికను పూజ చేసినవారు ఆయురారోగ్యైశ్వర్య వస్తువాహనములు కలిగి యుందురు.

చిదంబర దీక్షితులున్నూ, రామయోగి అయ్యవార్లున్నూ బ్రహ్మము గారున్నూ వ్రాయించిన కాలజ్ఞాన పత్రిక.

శ్రీ గోవిందమాంబా సహిత శ్రీ వీరబ్రహ్మణే నమః

# జీవైక్య బోధ

పరమందు శివం, శివమందు శక్తి, శక్తియందు నాదం, నాదమందు బిందువు, బిందువందు సదాశివం, సదాశివమందు మహేశ్వరుడు, మహేశ్వరునియందు రుద్రుడు, రుద్రునియందు విష్ణువు, విష్ణువునందు బ్రహ్మ, బ్రహ్మయందు ఆత్మ, ఆత్మయందు ఆకాశము, ఆకాశమునందు వాయువు, వాయువునందు అగ్ని, అగ్నియందు ఉదకము, ఉదకమునందు పృథివి, పృథివియందు ఓషధులు, ఓషధుల వలన అన్నము, అన్నము వలన నర, మృగ, పక్షి, స్థావర జంగమాదులు ఉద్భవించును. ఉద్భవించిన క్రమముననే ఐక్యమగును.

మనుష్యుడు తన అంగుళిని 96 అంగుళముల పొడవు, 7 జానెల ప్రమాణము, నాలుగు జానెల వలయము, 33 కోట్ల రోమనాళములు, 33 మూళ్ల పేగులు, 63 సందులు, 90 పెద్ద యెముకలు, 8 ఫలముల యెత్తు గుండెలు, 4 ఫలముల రుధిరము, 260 ఫలముల మాంసము, నోలెడు పైత్యము, అరనోలెడు శ్లేష్మము, అరనోలెడు శుక్లం - ఇన్నిటితో కూడుకొని యున్నది ఈ శరీరము. ఇవి అన్నియు జాతిభేదాలు. ఇన్నిటికి జీవుడు సాక్షియైయున్నాడు గనుక ఇన్నిటికిన్ని కాంతిగలిగి మనుష్య ఆకారమాయెను. జీవునికి బ్రహ్మ సాక్షియై యున్నాడు గనుక సకల భూతాంతర్యామియై యున్నాడు పరమాత్మ.

ఈ శరీరమున 96 తత్వాలు గలవు.

వాటి వివరము: వాకిళ్ళు 9, శోత్రాదులు 5, వాగాదులు 5, వచనాలు 5, అంతఃకరణాలు 5, పృథ్వివి సంబంధాలు 5, ఉదక సంబంధాలు 5, అగ్ని సంబంధాలు 5, వాయు సంబంధాలు 5, ఆకాశ సంబంధాలు 5, వాయువులు 10, నాళ్లు 10, ధాతువులు 7, రాగాదులు 8, ఆధారాలు 6, ఉదక సంబంధాలు 3, గుణాలు 3, అవస్థలు 5, మండలాలు గుణములు అవస్థలు గాక తత్వాలు 96.

ఈ తత్వాలకు రూపనామ క్రియల వివరం:

ద్వారాలు 9 - వివరం: చెవుల ద్వారాలు 2, కన్నుల ద్వారాలు 2, మలమూత్ర ద్వారాలు 2, ముక్కు ద్వారాలు 2, నోటి ద్వారాలు 1. (*10 వ ద్వారాము బ్రహ్మరంధ్రము. ఆ ద్వారాము గోప్యముగా నుండును. అది ముందర వివరంచబోతున్నాము.*)

శోత్రాదులు ఐదు - అనగా జ్ఞానేంద్రియ పంచకము.

జ్ఞానేంద్రియములు అనగా : చెవులు, చర్మము, నాలుక, ముక్కు, కన్నులు.

వీటికి విషయాలు - అనగా * ఆధ్యాత్మ* అదిభూత * ఆదిదైవతల వివరం.

చెవులు::అధ్యాత్మ; వినవచ్చేది అదిభూతం; శబ్దభూతమైన వాయువుతో కూడిన ఆకాశము అధిదైవతం.

చర్మము::అధ్యాత్మ; చర్మమునకు సోకిన స్పర్శ అధిభూతం; ఈ వస్తూవు నన్ను సోకెనని తెల్పే వాయువు అధిదైవతం.

కన్నులు::అధ్యాత్మ; కానవచ్చే వస్తూవులు అధిభూతం; కనిపింపచేయు సూర్యుడు అధిదైవతం.

నాలుక::అధ్యాత్మ; షడ్రుచులను తెలిసికొనుట అధిభూతం; రుచులను తెలియచేయు వరణుడు అదిదైవతం.

ముక్కు::అధ్యాత్మ; సుగంధ దుర్గంధాలు అధిభూతం; సుగంధ దుర్గంధాలు తెలియచేయు భూమి అధిదైవతం.

ఇవి జ్ఞానేంద్రియ పంచకము.

వాగాదులు 5 - అనగా నోరు, చేతులు, పాదములు, గుదం, శిశ్నం.

కర్మేంద్రేయాలకు ఆధ్యాత్మాదుల వివరం.

పాదాలు::అధ్యాత్మ; నడిచేది  అధిభూతం; విష్ణువు అధిదైవతం.

గుదస్తానం::అధ్యాత్మ; మల విసర్జనం అధిభూతం; అధిదైవతం మృత్యువు.

శిశ్నం::అధ్యాత్మ; సంగమాదుల వలన గలిగిన ఆనందం అదిభూతం; ప్రజాపతి అనే బ్రహ్మ అదిదైవతం.

నోరు::అధ్యాత్మ; నోట పలుకబడిన శబ్ధం అదిభూతం; అగ్నిహోత్రుడు అధిదైవతం.

చేతులు::అధ్యాత్మ; చేతులు చేసే పనులు అధిభూతం; ఇంద్రుడు ఆధిదైవతం.

ఇవి కర్మేంద్రియ పంచకములోనివి.

అంతఃకరణ చతుష్టయాల వివరం - మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము.

ఈ నాలుగే శరీరాన ఉండేవి. కనుక అంతఃకరనాలని పేరు వచ్చేను.

బొడ్డు దగ్గర బుద్ధియుండును. హృదయమందు మనస్సు ఉండును. పరమందు చిత్తముండును. నేను నందు అహంకారము ముండును.

వీటికి ఆధ్యాత్మాదుల వివరము -

మనస్సు::అధ్యాత్మ; యేదైనా ఒక వస్తూవును చూచి ఆ వస్తూవు ఈ వస్తూవా?అని సంశయించేది అధిభూతం: చంద్రుడు అధిదైవతం.

బుద్ధి::అధ్యాత్మ; మునుపు సంశయించిన వస్తూవును నిశ్చయించుట అధిభూతం; పరబ్రహ్మ ఆధిదైవతం.

చిత్తం::అధ్యాత్మ; అనేకముగా చింతచేయునది అధిభూతం; బ్రహ్మ ఆధిదైవతం.

అహం::అనే రెండు అక్షరములు అధ్యాత్మ; సకల కార్యములు నా వలన అయినవి అనునది అధిభూతం; రుద్రుడు ఆధిదైవతం.

జ్ఞాతృత్వమనగా –

ఇప్పుడు చెప్పిన సకలేంద్రియాల ప్రపంచాలకున్ను తన యుక్తి చేత వాటికి శాంతి గల్పించి, ఇంద్రయాల చేత పుణ్య పాపాలు చేయిస్తూ, ఆత్మను ఒక కర్మము గూడ అంటకుండా సాక్షి మాత్రమే ఉపాదివశాన జీవుడనే పేరు గలిగిన పరబ్రహ్మమై జ్ఞాతృత్వమై యుండును. ఈ ఉపాధి గలిగిన పురుషునికి తాపర్య మేమిటంటే, నానా విధ చేటలు గలిగిన శరీరానికి జీవుడు బలిష్టమాయేను, గనుక శరీరానికి జీవునికి ఏకత్వము గనబడిన శరీరమే జీవుడని భ్రాంతి గలిగేను. ఆ భ్రాంతి వలన జన్మలెత్తి సుఖదుఖాలు అనుభవించవలయును. ఈ శరీరము నేను గదాయని సాక్షియైయుండే పరబ్రహ్మను కనవలయునని సత్పురుషుడు కారణ గురుసేవ జేస్తే క్షణములో ఇదిగోనని పరబ్రహ్మ దర్శనం చేస్తే జనన మరణాదులు లేక విష్ణులోకమందు బ్రహ్మ సౌక్యమును అనుభవించును.

బ్రహ్మ స్వరూపమైన జీవునికి, అత్యంత మలినమైన శరీరానికి ఏకత్వమేలాగంటే వివరుస్తూ ఉన్నాము.

జీవుడు దేహవాసనతో గూడుకొని అహంకారాన్ని బోదేను. అహంకారమై జడమైయున్న బుద్ధి కూడెను. ఆ బుద్ధి సకల వస్తూవులను కోరుతూ ఉండెను. మనస్సుతో కూడను మనస్సు సకల భ్రాంతి నొందును. ఇవి అన్ని ఏకమై చిత్తమును బొందును. ఆ చిత్తము అనేక చిత్తరూపమైన జీవునకు జనన మరణాదులు గల్పించెను. శరీరానకు నానా విధ చేష్టలని చెప్పితిమిగదా, ఆ చేష్టల వివరము విచారిస్తూ ఉన్నాము.

చెవులకు విషయము శబ్ధము. ఆకాశముతో కూడుకొని సకల ధ్వనులు వినును.

చర్మానకు విషయము స్పర్ష. వాయువుతో కూడుకొన్న స్పర్ష భేదాలు తెలుసును.

కన్నులకు విషయము రూపం. అగ్నితో కూడుకొని సకల రూప భేదాలెల్ల తెలుసును.

జిహ్వేంద్రియానకు విషయం రసం. ఉదక సంబంధాన షడ్రుచులు తెలుసును.

దానం చేతుల యందు, అగ్నియందు అణగును.ఇదియే ఉత్పత్తి – స్తితి - లయ హేతువు.

ఇప్పుడు చెప్పిన ఆధ్యాత్మ ఆధిభూత అధిదైవతాల మనుజునికి తాపత్రయాన, ఈ విషయాలందు వైరాగ్యం కలిగితే మోక్షమునకు హేతువు. విషయాలయందు ఆసక్తుడాయెనా సంసార బద్ధుడౌను.

ఇందుకు ప్రమాణం :

శ్లో: మోక్షో విషయవైరాగ్యం బుద్ధో విషయ కోరక*:*

ఏతావదేవ విజ్ఞానం యధేచ్ఛసి తథాకురు.

అనే న్యాయం ఉన్నది కనుక విషయాదుల యందు వైరాగ్య ముంచవలయును.

ఇంకా పంచవింశతి :

ఎముకలు, నరాలు, మాంసము, చరమము, వెంట్రుకలు. ఈ ఐదు పృథ్వి సంబంధము.

నెత్తురు, మూత్రం, శుక్లం, శ్లేషం, మేదస్సు. ఈ ఐదు ఉదక సంబంధాలు.

ఆకలి, దప్పిక, నిద్ర, ఆలస్యము, సంగమం. ఇవి అగ్ని సంబంధాలు.

చలన, గమన, ప్రసారణ, ఆకుంచన, ఆకర్షణాలు. ఇవి వాయు సంబంధాలు.

కామ, క్రోధ, లోభ, మోహ, మదములు. ఇవి ఆకాశ సంబంధాలు.

ఈ శరీరం పంచ భుతాల మయంగనుక అంగాంగాలు విభేదాలు వేరే విభజిస్తూ ఉన్నాము. అది యేలాగంటె -

జ్ఞానము, ప్రాణ వాయువు, చెవులు, శబ్దము, నోరు - ఇవి ఆకాశమందు పుట్టునవి.

మనస్సు వ్యానవాయువు, చర్మం, స్పర్శ, కాళ్ళు - ఇవి వాయువు నందు పుట్టునవి.

బుద్ధి, ఉదానవాయువు, కన్నులు, రూపాలు, చేతులు - ఇవి అగ్నియందు పుట్టునవి.

చిత్తం, సమానవాయువు, నానారసం, గుదస్థానం - ఇవి నీళ్ళ యందు బుట్టునవి.

ముక్కుకు విషయం వాసన, భూమి సంబంధాన సుగంధ దుర్గంధాలు తెలుసును.

ఇవి జ్ఞనేంద్రియ పంచకం.

## కర్మేంద్రియాలకు వివరము

నోటికి విషయం వచనము, ఆకాశముతో గూడుకొని పలు పలుకులు పలుకును. కాళ్ళకు విషయం నడిచేది. వాయువుతో కూడుకొని సంచారము చేయును. చేతులకు విషయం దానం. అగ్నితో కూడుకొని యిచ్చుట పుచ్చుకొనుట చేయును. వాయువు విషయం మల విసర్జనం. ఉదక సంబంధాన మూత్ర పురీషాదుల విడుచును. శిశ్నమునకు విషయం సంగం. భూమి సంబంధాన ఆనందించును. ఇవి కర్మేంద్రియ చేష్టలు.

## అంతః కరణాదుల వివరం

మనస్సు సంశయించును. బుద్ధి నిశ్చయము చేయును. చిత్తము చింతజేయును. అహంకారము నేను అగును. ఇవి యన్నియు ఎక్కడ పుట్టునో అక్కడనే అణుగును.

ఇది యేలాగంటే: శబ్దం ఆకాశ సంబంధమైన చెవుల యందు అణుగును. స్పర్శ వాయు సంబంధమైన చర్మమందు అణుగును. రూపం అగ్ని సంబంధమైన కనులయందు అణుగును. రసం ఉదక సంబంధమైన జిహ్వా యందు అణుగును. గంధం పృథివి సంబంధమైన ఘ్రాణయందు అణుగును. విసర్జనము గుదస్థాన మందు అణుగును. ఆనందము పృథివి యందు, శిశ్నమందు అణుగును. గమనం పాదముల యందు, వాయువునందు అణుగును. అహంకారము, అపానవాయువు, ముక్కు, గంధము భూమి యందు బుట్టునవి.

పంచభూతాలకు వర్ణాలు, అధిపతులు, స్థలాలు వివరిస్తూ ఉన్నాము.

భూమికి పసుపు వర్ణం, సదాశివుండు దైవము. పాదాలు మొదలు పిక్కలు దాకా పృథివి స్థానం.

ఉదకానికి తెలుపు వర్ణం. విష్ణువధిదేవత. పిక్కలు మొదలు తొడలు ఉదర పర్యంతరం ఉదకస్థానం.

అగ్ని నలుపు వర్ణం. రుద్రుడధిదేవత. తొడలు మొదలు ఉదర పర్యంతరం అగ్నిస్థానం.

వాయువు ధూమ్ర వర్ణం. రుద్రుడధిదేవత. ఉదరం మొదలు కంఠం పర్యంతరం వాయుస్థానం.

ఆకాశమునకు ఇంద్రనీల వర్ణం. బ్రహ్మ అధిదేవత. కంఠం మొదలు ముఖ పర్యంతరం ఆకాశస్థానం.

పృథివికి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు 5 గుణములు.

ఉదకమునకు శబ్ద, స్పర్శ, రూప, రసములను 4 గుణములు.

అగ్నికి శబ్ద, స్పర్శ, రూపములను 3 గుణములు.

వాయువునకు శబ్ద, స్పర్శములను 2 గుణములు.

ఆకాశమునకు శబ్దమను ఒక గుణం. ఇవి పంచ భూతముల యొక్క తన్మాత్మలు.

భూమికి 'ల'కారము మాతృక - ఆదిశక్తి.

వాయువునకు 'య'కారము మాతృక - క్రియాశక్తి.

ఉదకమునకు 'వ'కారము మాతృక - జ్ఞానశక్తి.

అగ్నికి 'ర'కారము మాతృక - ఇచ్ఛాశక్తి.

ఆకాశమునకు 'ఆ'కారము మాతృక – పరాశక్తి. ఇవి పంచభూతముల యందాశ్రయించి యుండే శక్తులు.

మాతృకలనగా బీజములు. వాటియందాత్మ యుండేడి. ఆ పరబ్రహ్మాణు కనుగొను విధము వివరిస్తున్నము.

ఆధారాదులు 6, అనగా షడ్చక్రాలు. వాటి వివరం - నామ రూప క్రమాలు వివరిస్తూ ఉన్నాము.

ఆధార, స్వాధిష్ట, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞ. ఇవి ఆరుచక్రాలు.

కాలియముకలు 2 కుదురు యముకలు 2 కూడిన దిక్కు శిశ్న ముండును. శిశ్నమునకు గుదస్తానమునకు నడుమ నలుచదరముగ నుండును. అక్కడ ఆధారచక్ర ముండును. వానికి నాలుగు రేకులు. వాటిమీద నుండే అక్షరములు వ,శ,ష,స. ఈ చక్రం పసుపు వర్ణం. భూముద్ర. గణపతి అధిదేవత. ఆ చక్రానికి రెండంగుళముల మీద స్వాధిష్టాన

చక్రముండును. దానికి ఆరు రేకులు. వాటి మీద నుండు అక్షరములు బ,భ,మ,య,ర,ల. వర్ణం తెలుపు. బ్రహ్మ అధిదేవత. ఉదక చక్రం పక్షి ముద్ర. దానికి మీద ఎనిమిది అంగుళముల దూరమున మణిపూరక చక్రముండును. అది కోడిగ్రుడ్డు వలె నుండును. దాని మీద 72 వేల నాడులు పారియుండును. ఆ నాడులకు వేరుగా చక్రముండును. రేకులు 10. వాటి మీద నుండే అక్షరములు డ,ఢ,ణ,త,థ,ద,ధ,ప,ఫ. కాంతి వర్ణం. విష్ణువధిదేవత. పీఠ ముద్ర. అగ్ని చక్రం. అందు పైన 10 అంగుళముల మీద అనాహత చక్రముండును. అదియే హృదయ కమలము. రేకులు 12. వాటి మీద నుండు అక్షరములు క,ఖ,గ,ఘ,ఙ,చ,ఛ,జ,ఝ,ఞ,ట. రక్త వర్ణం. లింగముద్ర. వాయుచక్రం. శివుడధిదేవత. దాని మీద 12 అంగుళాలపై విశుద్ధ చక్రముండును. గొంతు దగ్గర నుండును. దానికి 16 రేకులు వాటి మీద నుండు అక్షరములు అ,ఆ,

,ఈ,ఉ,ఊ,ఋ,ౠ,ఌ,ౡ,ఏ,ఓ,,ఔ,అం,అః. ఈ 16 అక్షరముల వర్ణం జ్యోతివర్ణం. జీవుడధిదేవత. మత్స్యముద్ర. ఆకాశ చక్రం. దానికి 10 అంగుళాల మీద ఆగ్నేయ చక్ర ముండును. స్థానం భ్రూయుగం. అనగా కనుబొమ్మల మధ్య రెండు రేకులుండును. వాటి మీద హం,క్షం అను రెండక్షరములు. వర్ణం బంగారు చాయ. ప్రకాశముద్ర. పరమాత్మ అధిదేవత. ఇది మనశ్చక్రం. దానిమీద కపాల పర్యంతం సహస్రార చక్రముండును. దానికి వెయ్యి రేకులుండును. దాని మీద అక్షరములు అ,వ,ర,ప లు వగైరాలుగా ఉండును. అదే మేరు శిఖరం. ఆకాశముద్ర. ఆధిదేవత గురువు.

మండలాల మూడింటికి వివరము: అగ్ని మండలం, సూర్య మండలం, చంద్ర మండలం.

అగ్ని మండల వివరము: భూమిన్ని ఉదకం గూడిన తావున నలు చదరముగా నుండును. దాని మీద త్రికోణాకారంబుగా నుండును. నాలుగుదళాల పద్మమందు పంచాక్షరి యుండును. ఓం, హ్రీం,హ్రాం, సం. ఇది అగ్ని మండలం.

సూర్య మండల వివరము: ఎనిమిది దళాల పద్మముగా నుండును. అరటి మొగ్గ వలె అధోముఖముగా నుండును. ఆదళాల మీద అక్షరాలు య,ర,ల,వ,శ,ష,స,హ. వర్ణం బంగారు వర్ణం. దాని నడుమ మనోన్మణియను శక్తి వాసమై యుండును. ఇది సూర్య మండలం.

చంద్ర మండలం వివరము: రవి చంద్రాదిత్యుల కాంతి గలిగి శిరస్సు నడుమ నుండును. అది అమృత కల. అగ్ని మండలము మీద సంతతధారగా అమృతము వర్షిస్తూ ఉండును. ఆ కమలము మీద పరాశక్తి వాసమై యుండును. ఇవి మండలత్రయము.

ఇక నాడుల వివరం:

ఈ శరీరమందు 72 వేల నాడులు గలవు. వీటిలో పరిశుద్ధమైన నాడులు 10. ఆ పదింటికి వివరము. ఇడ, పింగళ, గాధారి, హస్తి, జిహ్వా, అలంబ, పుష, క్రకుర, దేవదత్త, ధనుంజయ, సుఘుమ్న యను పదింటిలో ప్రసిద్ధమైనవి మూడునాడులు.

వాటి వివరం: ఇడ, పింగల, సుఘుమ్న. ఈ మూడింటిలో ప్రసిద్ధమైనది సుఘుమ్న నాడి.

ఈ నాడులు శరీరమందుండే విధము:

ఏలనగా మునుపు చెప్పిన సప్త కమలాలు గుదస్తానముందుండి కపాలము దనుక వీణాదండము వలె ఒక దాని కోకటి దొంతరలుగా నుండును. వీణా దండమువలె వెన్నెముక నడుమ రంధ్రముండును. ఆ వెన్నెముక గుదస్తానం మొదలు కపాల పర్యంతం, వీణ సొరకాయ దొంతర వలె షట్కమలాలుండును. ఆ వెన్నెముక రంధ్రమందు నడుమ ఉక్కుతంతి వలె సుఘుమ్న నాడి యుండును. ఆ నాడి గుదస్తానము మొదలు కపాలము వరకుండును. సుఘుమ్నా నాడికి కుడి దిక్కున పింగళానాడీ యుండును. ఈ పింగళా నాడి మూలాధారాము నుండి కపాల పర్యంతం వచ్చి తాకి అక్కడ నుండే అగ్నిమండలం వ్యాపించి, అక్కడి నుండి తిరిగి కుడి ముక్కు గుండా వెళ్ళును. సుఘుమ్నా నాడి కెడమ దిక్కున ఇడానాడి యుండును. అది మూలాధారము మొదలు కపాల పర్యంతం వచ్చి తాకి అక్కడి నుండే చంద్ర మండలం వ్యాపించి అక్కడ నుండి తిరిగి యేడమ ముక్కు గుండా ఊపిరి వెళ్ళిపోవును. ఇక్కడ యోగ మార్గము విచారించవలసినది కనుక విచారించు చున్నము. మునుపు సుఘుమ్న నాడి మూలాధారము నుంచి కపాల పర్యంతం ఉన్నదని చెప్పితిమి గదా, అందులకు ప్రమాణం యోగ శాస్త్రం చెప్పెను.

శ్లో: గుద పృష్ఠ స్య భాగేస్మిన్ వీణాదణ్డస్య దేహబృత్

దీర్ఘాస్థిమూర్ధ్ని పర్యంతం బ్రహ్మదండేతి కథ్యతే. ఉత్తర గీత -11-11-14 మంత్రశాస్త్రము యొక్క లక్షణం.

శ్లో: మూలాది బ్రహ్మరంధ్రాంతం ప్రవాళరాగ రమణీయం దండకాది

కారణాత్ ఖండన ముజ్వలంతి సకల దురిత తిమిర

నిరసన పటీయ సముద్యోత మయీ మూల విధ్యార్థి ధ్యాత్యా.

తా: పచ్చి పగడపు తేగవలె బంగారు కాచిన తీగవలె కోటి సూర్య ప్రకాశంగా వెలుగుతూ ఉండును. ఇదియే బ్రహ్మనాడి.

మూల విద్య:

సకల లోకాలకు ఆధారము త్రిమూర్తి స్వరూపము. ఈ సుషుమ్న నాడి సూర్య మండలం దాకా వచ్చి అక్కడ నిలిచి యుండును. ఈ నాడి కొసన సూక్ష్మమైన యొక రంధ్రముండును. అదియే దశమరంధ్రం.

బ్రహ్మరంధ్రం లక్షణం :

శ్లో: తన్మతే సుషిరం సూక్ష్మం బ్రహ్మరంధ్రేత్రిసూరిభి: - ఈ బ్రహ్మరంధ్ర మందు బ్రహ్మాండమంతా వ్యాపించియుండును. అని సకల వేదములుద్ఘోషించుచున్నవి గదా! వాటిని వివరిస్తూ ఉన్నాము.

సూర్యుడు, చంద్రుడు, అగ్నిహోత్రుడు, పరమేశ్వరుడు, పంచమహాభూతాలు, చతుర్దశభువనాలు, కాశి మొదలైన పుణ్య క్షేత్రాలు, సప్త సముద్రాలు, గంగ మొదలైన సకల నదులు, సప్తద్వీపాలు, చతుర్వేదాలు, మీమాంసాది శాస్త్రాలు, చతుష్షష్ఠి కళలు, పంచాశద్వర్ణాలు, షోడశస్వరాలు, గాయత్రి మొదలైన సప్తకోటి మంత్రాలు, అష్టాదశ పురాణాలు, రజ స్సత్వ తమో గుణాలు, మూల ప్రకృతి చతుర్వింశతి తత్వాలు, దశ ప్రాణ వాయువులు, జీవుడు ఈ చెప్పిన వన్నియును సుషుమ్నా నాడి యగ్ర రంధ్రమందుండును. ఇందుకు సందేహము లేదు. ఇదియే కుండలి. ఆ శక్తి సర్వతోముఖముగా నుండును. ఇందుకు ప్రమాణం

శ్లో: తస్య మధ్యగతాసూర్యం సోమాగ్ని పరమేశ్వరా భూతాలోకాది

సక్షేత్రం సముద్రా పర్వతా శిఖాదీపాక్ష నిమగ్నా వేదశాస్త్ర

విద్యాకళాక్షరా: సర్వమంత్ర పురాణాని గుణాస్సోదిత సర్వద:

బీజం బీజాత్మకం తేజం క్షేత్రజ్ఞే ప్రాణవాయవ:

సుషుమ్నాంతర్గతం విశ్వం తస్మిన్సర్వం ప్రతిష్ఠితం.

ఈ బ్రహ్మ రంధ్రముండే స్థలము మహాగోప్యము గనుక వివరిస్తూ ఉన్నాము.

ఈ చంద్రుడు, గంగా నది, ఇడ. ఈ మూడు యెడమ ముక్కున నడిచే ఊపిరి పేళ్ళు.

సూర్యుడు, యమున, పింగళ. ఈ మూడు కుడి ముక్కున నడిచే ఊపిరి పేళ్ళు .

అగ్ని, సరస్వతి, సుషుమ్న. ఈ మూడు బ్రహ్మ నాడికి పేర్లు.

ఈ మూడు నాడులు నాసాగ్రమున నుండును. చేవుల ద్వారాలు రెండు, ముక్కు ద్వారాలు రెండు, నోటి ద్వారము ఒకటి. ఇవి ఏకతావునసే కలసికొనును. ఇటువంటిది కనుక సకల శాస్త్రాల యందును కుందలీస్థానము ద్వాదశాంతం చతుష్టకం త్రికూటం ముక్తిద్వారం. నాద బిందు కళావాసం. అట్టి బ్రహ్మరంధ్రమందు మండల త్రయం కొల్హాట మండలం ద్విదళ చక్రమందుండే హంసరూపమైన పరమాత్మ యున్నాడు గనుక హంస స్థలమనిన్ని, శృంగాటకమనిన్ని, సకల వేదాల చెప్పబడుచున్నవి. ఇన్ని పేరులు గలిగిన నాసాగ్రమందు కనుబొమల నుంచి బ్రహ్మరంధ్ర పర్యంతం హంసరూప పరమాత్మ యుండును.

హంస యనగా? తన్ను నమ్మిన వారి సంసారమును హరించి మోక్షమిచ్చునది గాన హంస యని పేరు. ఈ రేండు పరమాత్మ యుండే స్థలాలు. యేవంటే మునుపు చెప్పిన సుఘుమ్నా నాడి సరే, బొడ్డు దగ్గర అరటి మొగ్గగా కమల మధోముఖముగా నుండును. కమలమందు జ్యోతి రూపముగా నుండును. హృదయ కమలమందు సూర్యరూపంగా నుండును. భ్రూయుగ మధ్యమందు రేండు దళాల కమల ముండును. హంసరూపంగా నుండును. శిరస్సు వెయ్యి రేకులు గల కమల ముండును. ఆ కమలమందు బ్రహ్మరూపంగా నుండును. ఇందుకు ప్రమాణము –

శ్లో: నాభి కమల మధ్యే జ్యోతి రానందరూపం

హృదయకమల మధ్యే సూర్యబింబానురూపం

భ్రూయుగ కమల మధ్యే హంస మార్గానురూపం

సకలమిదం సూక్ష్మేరూపం పాతుమాం నారసింహం.

ఈ బ్రహ్మ స్వరూపము ఇటువంటి నారాయణ స్వరూపం ధ్యానం చేసి దర్శనమై సంసార సముద్రం దాటి ముక్తుడయ్యే విధము.

పదునాలుగు లోకములలో గూడ శ్రీమన్నారాయణుని చేత వివరింపబడినది. యోగీశ్వరులకు పరబ్రహ్మను దర్శనము చేసే నిమిత్తమై నాలుగు యుగాలు, నాలుగు యోగములు, నాలుగు ముద్రలు ఏర్పరచినారు.

వాటి వివరం: షణ్ముఖి, ధ్యానముద్ర, శాంభవీముద్ర, రాధాముద్ర. యివి నాలుగు ముద్రలు.

ఇక యోగాలు: మంత్ర యోగము, లయ యోగము, హఠ యోగము, రాజ యోగము.

వీటికి సాధన క్రమము:

పాప పుంజములలో గూడిన మనుష్యుడు కించిత్ జ్ఞానము కలిగి శుచియైన స్థలమందు పద్మాసనం వేసుకొని కూర్చుండి దృష్టుల అనగా చూపుల రెండు నాసికాగ్రమునందు నిలిపి కన్నులు మూసి తన కభీష్టమగు దేవతను ధ్యానము చేయుచు గాయత్రి మొదలైన మహామంత్రము జపము చేసి బ్రహ్మార్పణము చేసేది. ఇట్లు ఉండేది మంత్రయోగం. ఇదే ధ్యానముద్ర. ఈ మంత్ర యోగి మిగిలిన యోగులకన్న అధముడు.

ఇక లయ యోగము - దిగువ నాసికాగ్రము చూస్తూపైన ఉండేది సాధించేది. పైన ఉండే నాసికాగ్రము చూస్తు దిగువ ఉండేది సాధించేది. తర్జని రెండు వేళ్ళ చేత రెండు చేవుల రంధ్రాలు లెస్సగా మూస్తే అచ్చట మహాధ్వని వినబడును. ఆ ధ్వని వినంగా వినంగా 1.చిఱుగజ్జలనాదం 2.గొప్పగజ్జలనాదం3.ఘంటానాదం 4.శంఖనాదం 5.వీణానాదం 6.తాళనాదం 7.వేణునాదం 8.మృదంగనాదం 9.భేరీనాదం 10.మేఘనాదం, ఇవి దశవిధనాదములు. ఇందులో 9 నాదాలు త్యజించి 10 మేఘనాదమభ్యసించి వినంగా మనస్సు అచట లీనమగును. ఇదయే మోక్షమునకు హేతువు. ఈ నాదమే ప్రణవనాదము. ఓం - అకార ఉకార మకారంబులుంగూడి ప్రణవరూపమై అనాహత చక్రమందు పుట్టి అచట నుండి ప్రజ్వలించి కపాలమందు మహాధ్వనియై మ్రోగుతూ ఉండును. చేవులు మూసుకుంటే ప్రత్యక్షం అందరికి సరేకదా! ఇందులకు ప్రమాణం

శ్లో: అనాహతస్య శబ్దస్య తస్య శబ్దస్యయో ధ్వని రంతర్గతజ్యోతి

జ్యోతి రంతరగతం మన: తన్మనోనిలయం యాతి తద్విష్ణో:

పరమం పదం. ఇదే రాధాయంత్రం. ఇదియే లయ యోగము.

ఎడమ కాలి మడమ రెండు పిఱ్ఱల నడుమగా నుంచి కుడికాలి మడమ బొడ్డు దగ్గరగా నుంచి గడ్డము రొమ్ము మీద నుంచి బొటన వ్రేళ్ళతో రెండు చేవులను మూసి అనామికలు రెండు వ్రేళ్ళతో రెండు ముక్కులను మూసి మధ్యముతో రెండు కన్నులు మూసి వాయువును రేచక పూరక కుంభకాల చేత సాధించి మూలబంధోడ్యాన జాలధ్రంబులనే మూడు గ్రంధములు భేదించి షట్కమలాలు శోదించి వాయువును సుషుమ్నా నాడి గుండా సహస్రార పర్యంతం తెచ్చియుంచి అక్కడ నుండే జ్యోతి స్వరూపము నందు జీవును పొందించేది. ఇదే హఠ యోగము. షణ్ముఖి కేవలం కుంభకం. ఇదే సిద్ధాసనం. ఈ యోగి రాజయోగి కంటే మధ్యముడు, కడమ వారి కంటే ఉత్తముడు.

ఇక రాజయోగము సకలమైన యోగాలకు రాజుగా అయినది గనుక రాజయోగమని పేరు గలిగెను. ఈ యోగానికి పర్యాయ నామములు గలవు. ఉన్మణీ, మనోన్మణీ, జాడ్యోన్మణీ, అజాడ్యోన్మణీ. దీనికి లక్షణం.

శ్లో: జ్ఞాని: పశ్యతుదృష్ట్యేతు నిర్మలం గగనోపమం

యత్ర యత్ర మనో యాంతి తత్ర తత్ర

పరమం పదం అని భగవద్వాక్యం. ఈ శ్లోకము భగవద్గీతలోనిది. అతిగోప్యమైన సకల శాస్త్ర సారమయినది గనుక పరమ గురు కృపాకటాక్షము వలన తోచినంత వివరిస్తూ ఉన్నాము.

ఏలాగంటే మనిషి మంచి సాత్వికుడైతే, వేదశాస్త్రములు చదివి గురుసేవ చేసినందు వలన జ్ఞానము గలవాడయిన వాడు జ్ఞాని అనిపించుకొనును. అటువంటి జ్ఞాని తన యొక్క దుశ్చేష్టలసే మనస్సును నిర్మలంగా కడిగివేసి, గగనోపమం పశ్యతి = ఆకాశముతో సరి అయిన రూపం గలిగి పరమాత్మను చూస్తూ ఉండును.

శ్లో: యత్రయత్ర మనోయాతి తత్రతత్ర పరమంపదం.

ఎక్కడేక్కడ మనస్సు పోయునో అచ్చటచ్చట ఆపరమపదం కనపడును. ఇది ఆత్మ దర్శనం గల వారికి యధార్ధమై తోచును. ఈ ప్రకారము పెరుగులో వెన్న యున్నట్లు ఉన్నాడు గనుక, పెరుగు మధించక వెన్న కనబడనట్లు గురుకటాక్షం గలవారు గురునాజ్ఞనే కవ్వము చేత పిండాండం శోధించిన వారికి బ్రహ్మాండం సరికిదే. పిండాండం మందుండే పరబ్రహ్మ కనపడును. కనుక యోగ నిద్ర, జాడ్య నిద్ర, అజాడ్యనిద్ర యని రాజయోగానికి మూడు విధాలయి యుండును. అవి యేవంటే సాంఖ్యం, తారకం, అమనస్కం.

ఇందులో తారయోగం పూర్వ యోగం. అమనస్కం ఇహపర యోగం. ఇవి పూర్వా పరాలు అని పేర్లు. తారక అమనస్కాలలో కించిద్భేదమెగాని విషేషబేదం లేదు. అది వివరిస్తూయున్నారము.

ఈ యోగం సాధించే క్రమము.

ఈ శరీరమందు మునుపు చెప్పిన పంచ వింశంతి తత్వాలు లెస్సగా సాధించి యేర్పరచి యీ తత్వాలకన్నిటికిన్ని ప్రధాన తత్వమయిన పరబ్రహ్మమయిన శ్రీమన్నరాయుణుని యందు భక్తి గలిగి యుండేది. ఏదికద్దో అదే సాంఖ్యమని పించేను. ఇది శ్రీమద్భాగవతకార్లకు ముఖ్య ఇష్టము.

ఇక తారక యోగం: శరీరమందు పరమాత్ముడు లోపల వెలుపల అంతట ఉన్నాడని సకలమైన స్మృతులు చెప్పుచున్నవి.

శ్లో: అంతర్బహిశ్చ -తత్సర్యం వ్యాప్య నరాయణ స్థిత: - అని శ్రుతి వ్యాక్య మున్నది గనుక

ఆ నారాయణ స్వరూపాన్ని తెలియ సాధకమయినవి తారక అపమనస్కములు గనుక తెలియ వివరిస్తూ ఉన్నాము.

శుచి అయిన స్థలమందు గూర్చుండి ఆచారపు కట్టుకట్టుకొని రెండు కన్నుల దృష్టిచేత వెలుపలి నాసికాగ్రమందు కనుబొమల నడుమగా నుంచి దిన క్రమేణ చూడగా చూడగా చంద్రమండలం ఇంద్రధనస్సు మాణిక్యదీపాలు, అగ్ని మినుగురులు ధూమకింజరులు, ఇంకా విచిత్రాలుగా కనబడును. ఇవియన్ని ఆత్మప్రయత్నాలు అవి అన్ని మెరుగైపోయి చూచేకొలది వెన్నెలగపడును. ఆ వెన్నెలలో చిన్మయరూప మగుపడును. అదియె పరబ్రహ్మరూపమని సకలశ్రుతి స్మృతిపురాణాలు చెప్పుచున్నవి. ఇదె తారకయోగం.

ఇక రాజయోగం వివరించుచున్నము.

రాజయోగము పరమాత్మరూపము చూచేటందుకు హేతువైనది. శాంభవీముద్ర పార్వతీదేవికి ప్రియమయినది గనుక శాంభవీముద్ర అని పేరు. ఈ శాంభవీముద్ర చేత ధ్యానం చేయగా చేయగా పుట్టిన చిదగ్ని చేత పురుషుడు అనేక కోట్ల జన్మాలయందు త్రికరణములచేత జేసిన బ్రహ్మహత్య సురాపానాదులు మొదలైన మహా పాతకములు అనేక సముద్రాలను బడబాగ్నివలె దహిస్తూ ఉన్నవి. కనుక శాంభవీముద్ర అన్ని ముద్రలకంటె ప్రసిద్ధమాయెను. ఇందుకు ప్రమాణం-

శ్లో: బ్రహ్మ హత్య సహస్రాణి వీరహత్యాశతానిచి ఏకేన ధ్యానయోగేన దహాశ్చాగ్ని ర్వెంధనం.

అని శాస్త్రమున్నది గనుక శాంభవీముద్ర అవశ్య మభ్యసించవలసినది. ఈ శాంభవీ ముద్రలో చూచే చూపులు మూడు విధాలయి యుండును. అది యెట్లాగంటే అమావాస్యదృష్టి, పాడ్యమిదృష్టి, పున్నమిదృష్టి యని మూడు విధాలు.

అమావాస్యదృష్టి లక్షణం: కనురెప్పలు రెండు కదియమూసి నాసికాగ్రాన్ని చూస్తూ లోదృష్టి మనస్సున ఉంచి చూచే లక్షణం పేరు అమావాస్యదృష్టి. ఇది అధమము.

మూడుపాళ్ళు వెలుపలి నాసిగ్రామునందు దృష్టిపెట్టుకొని రెప్పపాటులేకుండా చూచే లక్ష్యం పేరు పాడ్యమిదృష్టి. ఇది తారయోగానికి అనుకూలము. ఇది మధ్యమం.

పున్నమిదృష్టి వివరము - శుచి అయిన స్థలమునందు కృష్ణాజినమయిన దర్భాసనమయిన పర్చుకొని కూర్చుండి ఆచారపు కట్టు కట్టుకొని గురువును స్మరిస్తూ ముఖం కొంచెముగా వంచి నల్లగుడ్డును కనుపడకుండా పై రెప్పలో మరుగు పరిచి అడుగురెప్పలో నుండే తెల్లగుడ్డు మాత్రము వెలుపల కనుపించునట్లుగా నుంచి, స్థిరమైన మనస్సు గలవాడై ఈ ప్రకారాన దినదినము చూడగా మునుపు చెప్పిన తారక చిహ్నాలు అగుపడును. ఝూమో

రెండురుభ్రూములో దృష్టి నిలిచేటట్లు చేయగా గాఢాంధకారమయిన చీకటి కనబడును. ఆ చీకటిలో చూడగా మునుపు చెప్పిన తారక చిహ్నాలు అగుపడును. అవి అన్ని నిలచి మంచి పున్నమ వెన్నెల కనబడును. మరి చూడగా ఆ పండు వెన్నెలలోగా సకల లోకేశ్వరుడైన నారాయణుండైన పరమాత్మ పరబ్రహ్మ కోటి సూర్య ప్రకాశంగా అభిన్న వలయాకృతియై తాలుమూల ద్వాదశాంతరముల నడుమ అగుపడును. అది దర్శనమయిన పురుషుడు పరబ్రహ్మను బొందును.

తాలుమూల ద్వాదశాంత ముఖం నడుమ ననగా = తాలుమూల లనగా దవుడల మూలము. అనగా కన్నులక్రింద బొడును ఎముకలు. ద్వాదశాంతములనగా కనుబొమలకుపైన నాలుగంగులాలకు పైన ఉండేది. ద్వాదశాంతము ఈ నడుమనే పరమాత్మ కనబడేది. ఇదే పున్నమిదృష్టి. శాంభవీముద్ర, ఖేచరీముద్ర. అర్ధావలోకనము. ఇదియే రాజయోగము. ఖేచరీనగా ఆకాశము. ఆకాశమందు చరింపబడ్డది గనుక ఖేచరి ముద్రయని పేరుగలిగెను. ఆకాశము అనగా ఈ ఆకాశము గాదు. పరమాత్మ స్వరూపమైన దహరాకాశము. అదియే నాసికాగ్రానికి పేరు.

లక్ష్యం – శ్లో: బలిశోస్త్రి స్త్రితం నిత్యం, నాసాగ్రే చావ్యవస్థితం నిష్కలకం విజానీయం షడూర్మిరహితం శివం.

ఈ రాజయోగమే బ్రహ్మ,విష్ణు రుద్రులు మొదలైన వారు జీవనము. ఇటువంటి రాజయోగి యెచట నున్న పరబ్రహ్మ స్వరూపమే గాని సామ్మన్యపు యోగీశ్వరుడు గాడని తెలియవలెను. ఈ అర్ధావలోకానికన్న ఎక్కువయిన యోగాలు లేవు. ఇందుకు లక్షణం

శ్లో: అర్ధోధ్యా నితలోచనో స్థిరమనో నాసాగ్రదం తీక్షణం

చంద్రార్కానలలీలతా ముపనయన్నిష్యంద భావాతతే

జ్యోతీరూప విశేష బాహ్యరహితం దేదీప్యమానం సదా

తత్వం తత్వరమంతిజీవచపలం కింవాద మత్రాధికం.

ఈ శ్లోకము శుకులు చేసిన యోగావళి లోనిది. శుక్రవాక్యం ఈ అర్ధమే శ్రుతిస్మృతి ఇతిహాస పురాణ ఆగమాదుల యందు పలుక బడుచున్నది. ఇదియే సకల మర్మమున్ను. ఇది తెలియక యెన్ని వేదాలు చదివిన యెన్ని శాస్త్రాలు చదివిని యెన్ని యోగాలు ప్రయాసపడ్డ షట్కర్మపరులయిన ఎంత సాహిత్యపరులైన నిష్ఫలంగాని ఫలములేదు.

శ్లో: చతుర్వేదధరో విప్ర:సూక్ష్మబ్రహ్మ నవిద్యతే

వేదభారే భరాక్రాంతం సదైవ బ్రహ్మణ గార్ధభం

శ్రీ మతే గురవే నమ:

సకలమైన చదువులు పుస్తకములు చదివి ఆ రహస్యము గుర్తెరుగక యేలాగంటే గాడిద గంధపు చెక్కలుమోసి పరిమళము గుర్తేరుగనట్లు అని తెలిసేది. ఇప్పుడు పున్నమ దృష్టిచేత పరంజ్యోతి గనపడుచున్నదని చెప్పితిమి గదా: ఈ రాజయోగముచే సాధించే సత్పురుషులకు 5 సంవత్సరములకు నిర్మలదర్శనుడగును గాని ఈలోగా కాదు. త్వరగా అగుపరుచుకొనేది యేలాగంటే బహుదిక్కుల విచారించి కార్య గురువు కాకుండా కారణ గురువును కనుగొని త్రికారణ వంచన లేకుండా నాలుగు విధాల శుశ్రూష చేస్తే, వారికి కటాక్షము వచ్చి కాన రాని పరమాత్మను రాజయోగానుభవముచేత అరక్షణములో కనబరచును. అనేక కాలం ప్రయాస పడితేగాని కనబడని పరమాత్మ యర్ధక్షణం కనబడును అంతే సమ్మతి.

శ్లో: ప్రాప్తేజ్ఞానేన విజ్ఞానం ధ్యాయతే హృది సంస్థితే లబ్ధశాంతి ఫలే దేహి నయోగో నచధారణ:

ఈ శ్లోక తాత్పర్యమేమని తెలిసేది. గురుసేవ జేసిన వారికి యోగం అక్కరలేదు, ధారణ అక్కరలేదు అనుట.

భగవద్గీత శ్లో: షడంగా నను పై నబుద్ధం అష్టాంగ యోగా ననువైన

బుద్ధం మనోవినాశనం నను పై న బుద్ధం స్వయంచ

తత్వం స్వయమేన బుద్ధం.

అనగా ఎమంటే షండగ యోగాలు, అష్టాంగయోగాలు తెలియలేదు. మనస్సున శంకలేదు. పరతత్వమయిన పరమాత్మ కానబడెననుట. ఈ శ్లోకమునకు అధ్వర వేదములోని సిద్ధాంత గీతలోనిది. సద్గురుడు ఆత్మోపదేశము చేసేటప్పుడు చెవుల దగ్గర నుండే రెండు జ్యోతులు కానవచ్చును. అదియే మోక్షహేతువని తెలియవలెను.

మనుష్యులకు అవసానకాలము సమీపమయిన పక్షమందు శరీరములో నుండే జీవుడు వెళ్లిపోవు విధము వివరించుచున్నాము:

అహింసారూపకమయిన బ్రహ్మయగ్నము మొదలు షట్కర్మలు చేసి బ్రహ్మార్పనం చేసిన మహా పుణ్య పురుషులకు కుడిదిక్కున నుండి పింగళానాడి మార్గాన బ్రహ్మలోకము చేరి బ్రహ్మతో కూడి ముక్తుడవుననియనుట. ఇదియే

దేవమార్గం. ఇంకా క్రమముక్తి మార్గము అర్చిరాది మార్గాలని కూడా గలవు. ఈ మార్గాన పొయ్యే దినాలు ఏవి యంటే ఉత్తరాయనం శుక్లపక్షం పగలు పున్నమ మొదలయిన దినములు. పునరావృత్తి మార్గము, ధూమమార్గము, పితుర్యానము ఈ మార్గాన పొయ్యే దినములు ఏవంట దక్షిణా క్రిష్ణ పక్షం దశమి, అమావాస్య మొదలైన దినములు. ఇది సద్యో ముక్తి మార్గము.

శ్రీమన్నరాయణుని సగున నిర్గుణాలు సదాభక్తి జేసినందున ఆయన యనుగ్రహుచేత సుఘుమ్నా నాడి గుండా బ్రహ్మరంధ్రంచించుకొని, యజరామర రూపమయిన బ్రహ్మ పదము బొందును. ఇందుకు సందేహము లేదు.

శ్లో: అంతకాలేచ మామే సరన్ కళేబరం

య: ప్రయాతి సమద్భావం యాతి నాస్త్యత్రసంశయ:

భగవద్గీత 8 అ 5 శ్లో అని భగద్వాక్యం. కనుక ఈ బ్రహ్మాండమందెంత యున్నదో అంతపిండాండ ముందున్నది. అని వేదములయందు చెప్పబడి యున్నదిగదా! అది వివరిస్తూ ఉన్నాము.

శ్లో: చంద్రంవినా చంద్రకళానుపూర్ణం సూర్యంవినా సూర్యమహత్ప్రకాశం

తేజో వినా తేజపర్స్వరూపం నేత్రం విన నేత్రసుపద్మ సంస్థితం:

యని సిద్ధాంత గీతలో యున్నది గదా! చంద్రుని వలే నుండును, చంద్రుడు గాడు. సూర్యుని వలే నుండును సూర్యుడు గాడు. మహాతేజోరూపముగా నుండును. తేజస్సుగాదు. ఈ కన్నులుగాకనే పరమాత్మ గానవచ్చును. ఇది పురుషోత్తముని స్వరూపము. ఈ పురుషోత్తమునిచే కల్పితమయిన బ్రహ్మాండ పిండాండాలకు అభేధము ఏలాగంటే నాసాగ్రదేశానకు పూర్వదిక్కు ఇంద్రలోక ముండును. కనులయందు తేజోలోకము ముండును. కుడి చేవి యమనగరం. వీపున వరుణ నగరం. కంఠమందు వాయునగరం. ఎడమచేవి వామభాగమున కుబేర నగరం. ఎడమ కన్ను శివలోకం. శిరస్సు బ్రహ్మలోకం. అడుగులు శేషులు. శివుడు కాలాగ్ని రుద్రుడు నిండును. అరికాళ్ళు అతలం, పిక్కలు రసతలం, మోకాళ్ళు మహాతలం, తొడలు తలాతలం, కటి పాతాళలోకం. ఇది నడుముదాక సప్త పాతాళ లోకాలనిపించు కొనును. ఈ నడుము దగ్గరనే ఆధార చక్రముండును. ఆ చక్రము మీద ఆదిశేషుడు పడగ ఉంచి తోక సహస్రార పర్యముంచి బ్రహ్మరంధ్రమందుంచుకొని పాతాళలోకాలకు దొరయైయుండును. అఘోరమయిన నరక మనిపించుకొనును. ఆవడిగ అథ:కుండలి అతడే జీవుడని పేరుగలిగి పాతాళలోకమెల్ల వ్యాపించి యుండును.

సూర్యుడు మొదలుకొని ధృవమండలం పర్యంతం స్వర్లోకం.

వాటి వివరం: బొడ్డు దగ్గర భూలోకం, కుక్షి జనలోకం, కనుబోమలసందు తపోలోకం. శిరస్సు బ్రహ్మలోకం. ఈ ప్రకారం బ్రహ్మాండమంతా పిండాండమున్నది. ఇందులకు లక్షణము.

శ్లో: దివం బ్రహ్మాండ నిలయం అస్మిన్ దేహే ప్రతిష్ఠత:

బ్రహ్మాండ మావృతం దేవం మంద మధ్య ప్రతిష్టితం

అని సిద్ధాంత గీతానుభవము. మునుపు చెప్పిన పదినాడులలో పింగళ, సుషుమ్నల వివరం చెప్పితిమి గదా.

కడమ ఏడునాడుల వివరం: ఆస్తి,జిహ్వకలు రెండున్ను కన్నులయందు నుండును. ఆలంబ,పుష యీ రెండును చేవులలో నుండును. కుకురు,దేవదత్త ఈ రెండున్ను నాభిస్థాన ముందుండును. ఇడ,నాగ ఇది మలమూత్రద్వారాల సందున నుండును.

దశవాయువుల వివరం: ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనుంజయ.

వీటిలో ప్రాణ వాయువులు అయిదు. ఈ వాయువులు గాక ఇంకా పది వాయువులు గలవు. అవి యేవంటే వజ్రుడు, ముఖ్యుడు, అంతర్యామి, ప్రాపంచికుడు. ఈ వాయువులు నడిచే క్రమం.

ప్రాణవాయువులు 72000 నాడులు చుట్టుకోని మూలాధారము 'ఓం' అని వెళ్ళి నాభిచక్రమందు 'హుం' అని తాకి 'సం' అని ఇడ, పింగళ గుండా కపాలానకు చుట్టి అక్కడి నుంచి నాసికమున పండ్రెండు అంగులములు వెళ్ళి 4 అంగుళాల ప్రమాణం వాయువు లయమయి 8 అంగుళాల ప్రమాణం లోనికి పోవును. కనుబోమల నడుమ లయ మగున ప్రకారం 60 గడియలకు 21600 శ్వాసలు నడుచును. ఇందులో 7200 శ్వాసలు లయములవును. 14400 శ్వాసలు నడుచును. ఈ ప్రకారం మనిషి మొదలు ప్రాణాలకు ఆయుర్దాయం క్షీణించును.

అపాన వాయువు గుదస్థాన ముందుండి మలమూత్రము విసర్జించును. వ్యాన వాయువు చర్మమందుండి స్పర్శభేధము తెలుస్తూ కలలు నిండించును. ఉదానవాయువు ఉదరాగ్నిని రేపి భుజించిన అన్నోదకాలు పచనముచేసి నాడులకన్నిటికి పంచిపెట్టి అన్నిటిని పోషించును. సమాన వాయువు అన్నింటిని సమానముగా పోషించును. ప్రాణవాయువు కర్మ వాయువుల వివరం. నాగ వాయువు దు:ఖించేది. తుమ్మేది కన్నులు తేరిచేది,ఎక్కిళ్ళు వచ్చేది, వాకరించేది. కూర్మవాయువు సుఖము వికసించేది, కన్నులు మూసేది, గగుర్పాటు కలిగించేది. ఆవలింతలు వచ్చేది. కృకురవాయువు హాస్యము చేసేది. దేవదత్త వాయువు పరుగు బారేది, తిరిగేది, యుద్ధము చేసేది. ధనుంజయ

వాయువు శరీరాన్ని విడిచి ప్రాణము పోయిన తాను మూడు దినములుండి శరీరము వ్యాపించి దేహము చెడిన తరువాత తాను పోవును. వజ్రుడనే వాయువు కాళ్ళు యేముకలు రెండు, కుదురు యేముకలు రెండు, ఉన్నతాదులు నిలిచి శరీరానికి వాతము, దగ్గు శరీరము చిక్కి పొయ్యేదిన్ని చేరును. ఇంకా నానా నాదాలు కలుగచేసును. ముఖ్యుడనే వాయువు చేతుల యేముకలు రెండూ కూడిన తావున నిలిచి భుజము నందుండి శరీరాన ఉండే తత్వాల నెల్ల ఒక వంకకు తెచ్చును. అంతర్యామి వాయువు పురుషునకు శోషనమై నిలిచి ప్రాణ వాయువును ప్రేరేపణ చేసును. ప్రపంచ వాయువు శరీరానకు అచ్చు చీల బిగించినటులుండును. శరీరము చేడితే తాను చేడును.

ధాతువు లేడింటికి వివరము: రసము, రుధిరము, మాంసము, మేదస్సు, ఆస్తి, మస్తిష్కము, శుక్లము.

పంచకోశాల వివరము: అన్నమయ, ప్రాణ్మయ, మనోమయ, విజ్ఞానమయ, అనందమయ కోశాలు.

వీటి వివరము:

అన్నమయమనగా సప్తధాతుమయమై స్తూల శరీరమందుండు అన్నరసముతో కూడి జీవుడాయెను గనుక అన్నమయ కోశము. పంచప్రాణాలు కర్మేంద్రియాలను కూడినందున ప్రాణమయ కోశం. పంచప్రాణాలను కర్మేద్రియాలను వేరు చేయగా మనోమయ కోశము. ఆ మనస్సు. జ్ఞానేంద్రియాలతో కూడుకోనగా విజ్ఞానమయ కోశం. జీవుడు సుఘుమ్నయందు అవిద్యతో లీనమవుతున్నాడు గనుక అవిద్య ఆనందమయ కోశము. ఈ పంచ కోశాలు ఆత్మను తెలియకుండా పోదవలె కప్పుకొని యుండును. ఇది కోశాల వివరం.

ఇక దశావస్తల వివరం:

దశావస్త అనగా జాగ్రత్ స్వప్న, సుఘుప్తి, తుర్య, తుర్యాతీతం, జాగ్రతలో జాగ్రత, జాగ్రతలో స్వప్నము, జాగ్రతలో సుఘుప్తి. ఈ ప్రకారము స్వప్న సుషుప్తులకు కాగా తొమ్మిది. తుర్యం పదియవది. తుర్యాతీతం అతీతం.

వీటికి వివరం:

జీవుడు భ్రూమధ్యమందు నిలిచి సబ్ద, స్పర్ష, రూప, రస గంధాదులు అయిదు. వచన, దాన, గమన, విసర్జన, ఆనందాలు అయిదు. మనో, బుద్ధి, చిత్త, అహంకారాలు - ఈ పదునాలుగు తమ సమీపమున సేవకులు. సేవలు చేయగా పరమాత్మ అనుగ్రహమున జీవుడు సుఖదు:ఖాలను చూస్తూ రాజుగా ఉండగా జాగ్రదవస్థలనిపించుకొనును.

స్వప్న మనగా అంతఃకరణాలు నాలుగు తీసుకోని కడమ పదిన్ని మధ్యమందు నిలిపి జీవుడు ఆనాలుగింటిలో కంఠస్థానమందుంచి మనో బుద్ధులు రెండు తీసుకోని జీవుడు వెరే యోక స్థలము చేరి కార్యమగుచుండగా సుషుప్తి

తప్పించుకొనును. ఆ రెండింటిలో మనస్సు అక్కడి నుంచి బుద్ధితో గూడ జీవుడు మరియొక తావునకు పోయినపుడు తుర్యమని పించుకొనును.

అప్పుడు శ్వాసలు త్వరగా వచ్చును. కనుక తుర్యమన బడును. తుర్యాతీతమనంగా ఆ బుద్ధి అక్కడి నుంచి జీవుడు తాను అజ్ఞానమందు బడి తన్నుతాను మరచి పైన పాము పారినను తెలియక యుండేది. తుర్యాతీతము. ఇది గాక మధ్యావస్థలని కలవు. వాటికిన్ని జాగస్వప్న సుషుప్తులు గలవు. ఎలాగంటే మునుపు ఒకరిని గుర్తేరిగియుంటే వాడు కొన్ని దినములకు వచ్చి  నన్ని గుర్తెరుగువాయనియంటే యెరుగు నన్నది తుర్యావస్థ. ఇతడెవరోయని సందేహము చేత తెలియనిది సుషుప్తావస్థ. కొంతసేపటికి ఫలాని పేరు ఆనాటి వ్యాపారాలు చెప్పునది జాగ్రదవస్థ. జాగ్రతలో జాగ్రతనంగా అంతఃకరణాలు ఇంద్రియాలు అనుభవిస్తు అన్నికూడ ఉండి జ్ఞానపరిపూర్ణుడై యుండేది యేదో అది జాగ్రతలోని జాగ్రత. జాగ్రతలో స్వప్నముగ్గా మునుపు ఒకరికి ఒక మాట చెప్పియుండి వాడు అడిగిన మరచి తిరుగా అవుననేది. స్వప్నావస్థ మరచిపోయి నేను గుర్తేరుగ వనేది జాగ్రత్తలో సుషుప్త్యవస్థ ఉచ్ఛ్వాసలు అదనముగా వెళ్ళేది. జాగ్రతలో తుర్యావస్థ సకలమగు తలంపులు అణగి బ్రహ్మమయియుండేదిన్ని. కన్నులు తేలవేసి తూగు వచ్చేదిన్ని జాగ్రతలో తుర్యాతీతం.

అవస్థలన్నిటికిని జాగ్రతలో స్థలాలేవంటే, వాటి వివరం:

భ్రూమధ్యమందు జాగ్రత. దానికి రెండంగుళాలమీద సుఘుప్తి. దానికి రెండంగుళాల మీద తుర్యం. ఇదియే మేళన అవస్థ యనిపించుకొనును. ఇదిగాక కేవలావస్థ, సుకలావస్థ, శుద్ధవస్థ యని మూడు విధాలు. ఇందులో కేవలావస్థ మూలాధారనబడి సర్వాంగములను తెలియక ఆణవమలమనేది కప్పుకోని యుండేది. అంతఃకరణాలను ప్రాపుగా చూచేది సిద్ధావస్థ.

ఓం తత్ సత్

సంపూర్ణం

# గోవింద_వాఖ్యాలు

శ్రీ శ్రీ శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి వారు కాలజ్ఞానాన్ని పద్యాల రూపంగ వ్రాసారు. అవే గోవింద వాక్యాలుగా పిలవబడుతాయి. అవి మొత్తం 320 పద్యాలు.

1.మేషరాశిలో శని ప్రవేశమైతేను మేలు కొందరికి అయ్యేనిమా

దోషకారులెల్ల ధూళయ్యి పొయ్యేరు ధూమ కేతువు మింట బుట్టీనిమా

When Saturn enters Aries sign, some people get benefited.
False talkers will perish, comet shall appear in sky.

2.వసుధలో  బహుధాన్య వత్సరమందున ఉత్పాతములు బహు గల్గీనిమా

ఎమ్మె కర్ములకు చింతలు పుట్టిని దుర్మదించిన నరులు సమసేరుమా

On Earth in year Bahudanya, calamities will happen more.
Lavish sinners will feel bad, Fools and egoists will perish.

3.కల్లలాడే వార్ని కిర్రు గానుగలలో మళ్లించి పొర్లించి గూల్చేనుమా

తొల్లి చండికదేవి శనివద్ద జేరింది కల్లయుగమున వింత గల్గీనిమా

4.ముడుపు వెంకటప్ప ఉత్సాహమయ్యాని ముడుపులు తిరుమలకు నడచేనుమా

కడప వద్దనున్న కమలాపురములోన కప్ప కోడికూత కూసీనిమా

For sake of Lord Venkateswara, people start offerings at Tirumala.
In Kamalapuram near Kadapa, Frog will shout like hen.

5.జాతిజాతికి చాల పైరముల్ గల్గిని జనయోగము తల్లడిల్లీనిమా

పెన్న యొడ్డున నుండు చెన్నూరు గ్రామము వరదల పాలయి  పొయ్యేనిమా

Difference arises between sects, unity will trouble.
Village Chennuru on banks of Penna river will get floods.

6.ఈశాన్యముననుండి విషపుగాలి వచ్చి విపరీత నరులంత చచ్చేరుమా

కపట కిరాతుల ఖండించివేయను కల్క్యవతారుడు వచ్చీనిమా

From north-east, poisonous gas will come and kill uncontrolled people.
To punish evil doers and cheaters, kalki avatar will come.

7.పొగరుబోతులంత భవిష్యమంతయు బూటకమని పల్కుచుండేరుమా

కాగల కార్యముల్ కనురెప్పపాటులో జాగులేక జరిగి పొయ్యేనిమా

Arrogants say these prophecies are all false,
Things that have to be done, will be done in less time without delay.

8.భారతభూమిని పరిపాలనముజేయ పరదేశవాసులు వచ్చేరుమా

ఆరువత్సరములు ఏకరీతిగ అంబయొక్కతె అవని నేలేనియా

Foreign people will come to rule indian land,
For six years, “Amba” will rule the indian land.

9.కల్లలాడే వార్ని కిర్రు గానుగలలో మళ్లించి పొర్లించి గూల్చేనుమా

తొల్లి చండికదేవి శనివద్ద జేరింది కల్లయుగమున వింత గల్గీనిమా

10.విశ్వంబులో విష్వనాథావధుతయగు విశ్వబ్రాహ్మణు  డొకడు పుట్టెనుమా

విశ్వంబులో తాను శశ్వతంబుగ నుండె విశ్వనాథుండనని పల్కెనుమా

In this universe, a viswa-brahmin avadhuta named Viswanatha will be born,

In universe, he says he will remain always as Iswara.

11.భుతకాలంబున రేపల్లెమూలను ఈతచెట్టుకు పూజ జేసేరుమా

ధాత పార్థివ మధ్య దేశాదిపతులెల్ల పాతకంబగు రణము చేసేరుమా

In time period of earth, near repalle area people will pray to Eetha chettu.

In between Dhata & Parthiva years, Countries shall fight worst wars.

12.ఉల్లిగడ్డకు ఉపదేశమిచ్చేటి కల్లగురువులు కలిని ఉండేరుమా

కల్ల గురువులు నెల్ల కాలదన్నును యముడు కల్లలేని నరుల కరుణించేనిమా

In kaliyuga, teachers who can teach even to onions will exist.

Those false teachers will be taken care by Yama-God, innocent people will be graced.

13.అయిదువేల   నాల్గు సంవత్సరములకు అవనీంద్రుడు అస్తమించేనుమా

అయిదువేల ముప్పదారింటి మీదను అమితముగ యుద్ధములు జరిగెనిమా

In kaliyear 5004, a great man will be left.

After kaliyear 5036, more wars will happen.

14.బాగుగా అనంద వత్సరంబునను నగుమల్లె నశిఈంచెనుమా

నగుమల్లె రీతి నరులంత చచ్చేటి యోగంబు ముం దింక వచ్చేనుమా

In the year Ananda, ‘Nagumalle’ Flowers  will become extinct.

Like ‘Nagumalle’, people extinction will be coming soon.

15.బహుధాన్య విక్రమ   వత్సరంబులో న బహు యుద్ధములు జరిగేనుమా

రహుకేతుల వలె రారాజు లిద్దరు రనరంగమున కలు దువ్వేరుమా

In years bahudanya & Vikrama, many wars will be fought.
Like Rahu & Ketu, those two kings will do get ready for battle.

16.అయిదువెల మీద అన్ని రాజ్యములలో అమిత కష్టము లనుభవించేరుమా

భావ   యువల మధ్య పరరాష్ట్రములలోను బహు ప్రళ్లయములు గల్గి యుండెనుమా

After kaliyear 5000, all countries will face severe troubles.
Between Bhava & Yuva years, middle and outside regions will have great calamities.

17.ఉత్తర దెశమున వైశ్యకులమునందు ఉత్తమ గంధొకడు పుట్టీనిమా

హత్తుగ నన్నియు దెశములవారంత సత్తుగ పూజలు చేసేరుమా

In North country, in Vaishya community, a good ‘Gandh’ will be born.
People of all countries will be inspired by him in a good way.

18.లోకమంతయు ఏకంబుగా జేసి ఏకుపట్టెడువాడు వచ్చీనిమ

ప్రాకటంబుగాను  లోకంబులో తాను మేకై నిలిచి జనుల మేలెంచునుమా

To club the regions by forces, one will come.
On this land, he will remain as a nail popularly because of his good deeds.

19.కోయరాజ్యంబంత గొడవలపాలౌను కోయనాయకు డతి కోపంబుతో

కువలయపతికి బలు కష్టములు గల్గించి అవనిలో నదృశుడయ్యీనిమా

‘Koya’ land will be filled of disputes. Koya leader will great anger
Will trouble ‘Kuvalayapathi’(elephants) and will disappear on earth.

20.అయిదువేలమీద బహుధాన్య లోపల అన్ని జాతము లొక్కటయ్యీనిమా

అవనిలోగల బీద ధనవంతు లొకటిగ అయ్యెయోగము కూడ వచ్చేనిమా

After kaliyear 5000, before year bahudanya, all sects will become one.

A situation of poor and rich become one on earth will arrive.

21.పల్నాటిసీమకు బాటసారొక డొచ్చి పల్నటిద్రవ్యము దోచేనుమా

పల్నాటినరులంత పచ్చియాకంతయు మేకలరీతిగ మేసేరుమా

To ‘palnadu’ area, a traveller will come and steal of its wealth.

‘Palnadu’ people will eat dry leaves as goats.

22.అయిదువేలమిద పదురెంటిలో నొక్క అవనీంద్రుడు దివి కేగునుమా

సైదపెటలోని సాహేబు లందరు సమరంబునందున సమసేరుమా

After 5012, one great soul will go to heaven.

All sahebs of saidupeta, will perish in war.

23.అద్దంకి సీమలో బీద యాదవునింట బుద్ధుడంతటి వాడు బుట్టేనుమా

ఇద్దరుజనుల కనేక భవిష్యత్తులు అయిదేండ్ల ప్రాయమున దెల్పేనుమా

Near ‘Addanki’, in a poor yadava family, a child like ‘Buddha’ will be born.

To two people, he will say future at the age of five.

24.దాసులు యోగులు ధరలోన దాగేరు మోస దాసులు భోగులు మించేరుమా

మీసము లేనోడు దెశాని కొచ్చీని మహిమకొండలకు జెండా లేసీనిమా

Good people and saints will hide in shadow, cheaters and lavish people will become more.

A man of no mustache will emerge to country, Flag will fly on great mountains.

25.మానవ సీమకు మారెమ్మ వచ్చీని మనుజుల తర్వత మ్రింగీనిమా

కోనసీమలోన కలతలు పుట్టిని సుఖ సన్నిరోధాల సమసేరుమా

To the land of humans, ‘maremma’ will come and swallow them.
In ‘Konaseema’ disputes will arise. Happiness and relationships will diminish.

26.కర్నాట భూములకు కాళిపంపు ,తురకవాని సీమకు దుర్గి వచ్చీనుమా

మొరస రాజ్యానికి భద్రకాళి పంపు ధర భద్ర దేశాని కొచ్చీనిమా

Kali war will come to Karnataka lands, Durgi will come to Turaka land.
Bhadrakali war to Morasa kingdom, ‘Dharabhadra’ will come to country.

27.అక్కిదేశానికి అర్క సోముల పంపు అష్టదిక్కులకు వచ్చీనిమా

పెక్కులు పల్కేటి పామరజనులను అక్కచ్చి పంపొచ్చి అణచీనిమా

Sun-Moon war will come to Akki country, also to 8 directions.
Sorrowful war will come and trouble loose talking and pride people.

28.వీరభద్రుని పంపు వచ్చీని మాలకు భైరవుని పంపూ వచ్చీనిమా

ఉరగేంద్రుని పంపు మహానంది కొచ్చీని కర్నూలుకు నందిపంపొచ్చీనిమా

Veerabhadra war will come to mala, Bhairava war too.
Uragendra war will come to Mahanandi, Nandi war to Kurnool.

29.ఆనందాబ్దముల అంత్యము నందున అంతకుని దూతలు వచ్చేరుమా

పీనుగు పెంటలు పృథివి మీ దయ్యీని భేది వాంతు లయ్యి చచ్చేరుమా

In end of year Ananda, Yama Dhootas will come.
Pile of corpses will fill earth, people die of vomits and diarrhoea.

30.దనుజనామ సంవత్సరమందున వాంతిభేదులచేత వాలేరుమా

హూణముఖుల వంశమున కొంత పొయ్యాని కాని జాగని భూమి గొలిచేరుమా

In Dhanuja year, people die of vomits and diarrhoea.

Land after losing some to Huns-face, remaining will be measured.

31.ప్రభవ పార్థివ మధ్య పరదేశము లన్ని బలు ప్రళయములు చేత నిండీనిమా

ప్రభు వీరవసంతరాయ లోచ్చెడిలోగ ప్రళయము లన్నియు పండీనిమా

Between years prabhava & parthiva, countries will face many calamities.

Before arrival of vira vasantaraya, many calamities will ripe.

32.తల్లులు బిడ్డల తగువులు నడచీని తల్లడించే దినము లోచీనిమా

కల్లగా దీ మాట ఉల్లము సాక్షిగా గద్ద నొడిసి కాకి తన్నీనిమా

Mothers & children will apart, days of troubles will come.

Not a false statement this is: Crow shall hit Eagle.

33.బ్రాహ్మలకు పీటలు మాతలలకు మంచాలు మహిని వేసే దినము లోచ్చీనిమా

మధుర తంజావూరు మరి హరణ మయ్యాని మహనంది శిఖరము విరిగీనిమా

Days of looking brahmins low, and low caste people high comes soon.

Madhura & Tanjavur will change and perish. Mahanandi’s hill & tree will break.

34.హంపీ విరూపాక్షి రెండూళ్ళ నడుమను అగ్ని వర్షములు కురిసీనిమా

పెంపుతో పదునాల్గు గ్రామము లుండీని భూమి వణికి,లదరీనిమా

Between Hampi & Virupaksha, rain of fire will fall.

With war and destruction, 14 places shake and trumble.

35.నాల్గువేల యెనమన్నూట   ముప్పదియేండ్లు కలియుగాబ్దములు జరిగినిమా

కలియందు శ్వేతముఖులు దొరలయ్యేరు మెలకువతో రాజ్యమేలెరుమా

4832 kaliyuga years will go and in kaliyuga White-face people
Will become rulers and rules places with smartness.

36.శ్వేతముఖులు ధూమశకటముల్ గల్పించి భూతలమున ఇనుప కమ్ములపై

సూత్ర మెరిగి పశ్చిమోత్తర దిశలందు ఆత్రముగా నడిపించేరుమా

White-face people runs rails on iron bars in a linear manner,
And will head towards western side hurriedly on this earth.

37.హరి లోహ తామ్ర దారు శకటముల పైన అన్ని జాతు లొకటై అందులోను

స్వకులాచారముల్ దప్పి ఒకరిపైన ఒకరు పైబడి ఊళ్ళ కురికేరుమా

In this iron metal wagons, all sects becoming one and
forgetting own traditions will travel villages trembling one man on another.

38.తూర్పు పశ్చిమములు దుంజాలచేతను ధూమశకటంబులు తిరిగినిమా

తూర్పుసీమంతాను   శ్రీరంగేశ్వరుల సేవించాననువారు వచ్చేరుమా

In east and west, smoke-wagons travel everywhere.
In east, people worshipping ‘Sri rangeswara’ will come.

39.అయిదువేల ముప్పెదెనిమిదింటిలో రాజు అవని వదిలి దివి కేగునుమా

ఆయురారోగ్య   అయిశ్వర్యములు క్షీణ యోగము జనుల కొచ్చీనిమా

In kaliyear 5038, king shall leave earth to heaven.
Health and wealth decaying scenario will come to humanity.

40.మబ్బుమాయల్ బడి దబ్బర లాడేరు మబ్బునడతలు బహు నడచేరుమా

గొబ్బున వారెల్ల నాశన మయ్యేరు గునవంతులీ భువిలో నిలిచేరుమా

Unknowingly quarreling people will do unknown mistakes.

Fast result expected people perish and good character people remain on earth.

41.ఏనూరుకోట్ల భూ మండలములోను పొట్టు పోయి గట్టి నిలిచీనిమా

ఏడూళ్ళ కొక్కూరు ఏకాంత మయ్యిని ఏకాంగులూ అరుదయ్యేరుమా

On this 700 crores people earth, husk goes and grains remain.

One of seven villages remains, alone people cannot be seen.

42.ముండమోపులెల్ల ముత్తైదు లయ్యేరు ముందొచ్చె గతి మీకు తెలిసీనిమా

బండాట లాడేటి పాపిష్టినరులంత పండాకు రీతిగా రాలేరుమా

Widows will get marriages again, coming situations will be known.

Liars and sinned people, will fall like leaves of trees.

43.కుంభకోణమందు గోవధ జేసేరు కొల్లాపురము కొల్లబుచ్చేరుమా

కంభము  చెరువులో కలపొన్న పూసీని కందుకూర చెరలు బెట్టేరుమా

Cows are slaughtered at Kumbakonam, Kollapuram will get infame.

Kalaponna flowers in Kambamcheruvu, In Kandukur either jails or troubles will emerge.

44.శంకరాచార్య   శ్రీవ్యాసుల   వాక్యాలు శాశ్వతంబుగ నడువ బొయ్యీనిమా

శంకరుని సన్నిధిని విద్యారణ్యులవారి శాసనము సత్యము అయ్యీనిమా

Words of Shankaracharya and Sri Vyasa going to happen soon.

Vidyaranya writings in presence of Lord Shiva will occur truly.

45.ఆదవేణిలోను కప్ప కోడికూత అందరు వినగను అరచీనిమా

మేదిని మీదను తాడిపర్తిలోను మేక మనిషి రూప మయ్యీనిమా

At Adaveni, Frog shouts as Hen is heard by everyone.
On this earth, in Tadipatri goat becomes human form.

46.మైసూరునం దుండి మారెమ్మ వచ్చీని మాయవాదుల బహు మ్రింగీనిమా

దాస వర్యులకు తాపత్రయము లేక గాసి లేక గురుని గొల్చేరుమా

From Mysore comes maremma, and swallows illogical people.
Pupil who dont know spirituality and hard work, serves to teachers.

47.వావి వరుస లేకపొయ్యేరు జగములో వసుధలో పంటలు ఎండీనిమా

శ్రీయుతుని మతము సమకూడి వచ్చీని సత్యవాదులు కొంద రుండేరుమా

People forgets relationships, on this earth crops will dry.
Sriyutha's religion comes together, some truth speakers still exists.

48.కందుకూరులోని స్త్రీ పురుషు డయ్యీని కలకోడి తర్వాత గూసీనిమా

సందేహమే లేదు సామగానము చెవుల సకలమైన వారు వినేరుమా

In Kandukur woman becomes man, stone hen will shout later.
No doubt, samaganam heard by ears of good people.

49.రుద్రసీమనుండు రోధాన మనుజులు రూపహీనులై పొయ్యేరుమా

రుద్రుడు కరుణాసముద్రుడు శ్రీ వీరభద్రుడు భక్తుల బ్రోచేనుమా

In battlefield sky people becomes shapeless.
Fearful kindful Sri Veerabhadra will help devotees.

50.భువిలోన మానవులు దుష్కర్ములైరని దివిజేంద్రుడు బ్రహ్మమునులను మా

శ్రీవైకుంటము  కేగి శ్రీనివాసుల గని ఆ విష్ణు మూర్తిని పొగడేరుమా

Lord Indra along with Divine sages reaches sri vaikuntam,
And prays to Lord Sreenivasa about sins of earth people.

51.స్వామి  కలియుగ మందు నీచులు ప్రభులయి సాధుల బాధలొనర్చేరుమా

ఏ మందు మన్యాయ కార్పణ్యములచేత కర్కోటకులై ఉన్నారుమా

O'Lord, in kaliyuga sinners became rulers and troubling innocent people.
What to say about earth people, their heart filled with darkness.

52.మాల మాదిగలు భూపాలు రగుటచే నీలవర్న నీతులు నీతులయ్యె

మేలు కీడై తారతమ్యము లేకను మత్తులై చరియించుచుండేరుమా

Normal people have become rulers, haste laws have become rules.
Bad became good, people live their life in giddiness and folly.

53.మ్లేచ్ఛ   నీచులను నిర్వంశము చేయను పుట్టించవలె పుణ్య పురుషు నొకని

పుట్టించకున్నను భూలోకమునందు మట్టుమీరి గోల అయ్యేనుమా

To eliminate the sin people, we have to send a great man.
If not, on earth it becomes turmoil and chaos.

54.ఆ వాక్యములు ఆదిభూతు డాలకించి దివిజేంద్రులను జూచి యిట్లనియె

ఓయి విరించి వీరవసంతుడనై పుత్తి కావరాత్ముల   నెల్ల ఖండింతును

After hearing those words, Lord Vishnu says to Indra
Oh Indra, I will take birth as Vira Vasanta to eliminate arrogants and egoists.

55.మీరు మీ నిజస్తానంబుల జేరంగ కొరత లే దిక చనుం డనగ వారు

బిరబిర జని స్వస్థానంబుల జేరంగ హరి హర బ్రహ్మలు జనిరి త్రిమూర్తులు

On hearing this, they took birth with God Vishnu at their original places.
The trinity gods- Brahma, Vishnu and Parama Shiva also took birth soon.

56.జనియించు విధములు చెప్ప శక్యముగాదు గనుక గురుకృపవల్ల తెలిసీనిమా

పనుపడి పల్కెద పరమాత్మ లీలలు పంచ సహస్రాణి పై తెలిసీనిమా

Birth ways cannot be said, so can be known only with help of Guru.
Works of God can be known only after 5000 years.

57.యామాన కోకచుక్క చొప్పునను నాల్గు యామాల చుక్కలు పుట్టినిమా

ఇమ్మహిలో నుండు పుణ్యులను రక్షింప శ్రీమాన్ వీరయోగి పుట్టినిమా

With a star on each side, all four sides four stars will be born.
To save good people on this earth, Great man is being born.

58.కేదారేశ్వరుని కీర్తి విద్యుతమైన కిరనము మీదట అయ్యీనిమా

నాదాంతర్యమి శ్రీనారాయణస్వామి నాడె అవతరించి వచ్చేనిమా

59.విదర్భ దేశాధిపతి వెంకటాద్రి శ్రీ వీరయోగి వెంట వచ్చీనిమా

భూదేవి పల్కీని భూరాజు పట్టుకు భూములంతా నొంత మయ్యీనిమా

Ruler of Vidharba area, will come along with Veera Yogi.
Mother earth says emperor shall unite all the lands under him.

60.విశ్వావసులోన ఉద్భవమయ్యాని కాశ కులములోన బుట్టినిమా

పశు సంవత్సరం ప్రాకృతమయ్యాని పశ్చిమ   దిశలందు ప్రబలీనిమా

In year Vishwavasu, he comes onto, takes birth into ‘kasha’ community.
In year Pashu, he becomes normal and shines in western sides.

61.మామ మామయని పిల్చును అల్లుడు మారేడు బుర్రలో ఉండీనిమా

మామ పేరు మార్గశిర శుద్ధ చతుర్దశి మంగళవారమని పాడేరుమా

62.వాసుదేవుడు  పుట్టి వర్ధిల్లిచుండియు వసుధ భారము మాంప వచ్చీనిమా

కాశ్మీర స్థలముల హరి జన్మించి కదలక ఆర్నెల్లు నిలిచీనిమా

After birth, He shines and comes to decrease earth burden.
Born in Kashmir area and stays there for six months.

63.లోగాను మాగని లోకాలోకములెల్ల కాలజ్ఞానము  చూడ తెలిసీనిమా

వాక్కున దైవము లేదన్న వరెల్ల ఆకు రాలి నట్లు రాలేరుమా

Up and down, everything on this earth can be known from these prophecies.
Fools who speak of No-God with tongue, will fall like dry leaves.

64.ప్రత్యక్షమైన మీదట కొన్ని వత్సరాల్ సత్యంబుగా ప్రకాశించేరుమా

కూత కుయ్యని నోర కూసేరు జనులెల్ల కుంపటి బెట్టి నట్లయ్యానిమా

65.ఆత్మారాములెల్ల వచ్చి కంకణమును అమరులందఱు వచ్చి కట్టేరుమా

ఆ తర్వతను భక్తులందఱు కానుకల్ అలవిగాని ముడుపు లిచ్చేరుమా

Atmaramulu will come and people come to tie wrist bracelets.
After that devotees all will offer gifts and offerings.

66.ధనువు మీద గురుడు ప్రవేశమయితేను ధనువు చేతను హరుడు బుట్టీనిమా

మనసిజ హరణుడు పాశుపతాస్త్రము మన వీరయోగికి ఇచ్చేనుమా

When Jupiter enters Bow, Lord comes with bow.
Lord Paramasiva, gives pasupatrasta to our Veera Yogi.

67.ఎనిమిది ముద్దలు తొమ్మిది కాకలు ఉనికితో దిరుగు సుదర్శనంబు

కత్తి బట్టేవాడు వీర వసంతుడు కర్ముల చెండాడ వచ్చీనిమా

Eight weighs Nine lengths, motion sensor movable Sudarshan sword carrier
Sri Vira Vasanta will come to kill karma people.

68.కుంభమందు గురుడు ప్రవేశమయితేను కుంభిని కుదురుగ నుండీనిమా

శంభు ననుమతి చేత శంఖచక్రధరుడు  శాంభవీపట్టణ మేలేనిమా

When Jupiter enters Aquarius, Aquarian stays still.
After permission from Shiva, He rules shambavi town.

69.బిరుదైన పెనుగొండ మీదను ముందర భేరీధ్వని వినవచ్చీనిమా

కరములు పదహారు గల్గిన కామిని గండికోటమీద తిరిగినిమా

On famous Penugonda fort, and in front great sounds are heard.
16 handed Kamini wanders on fort of Gandikota.

70.పాంచనన కులములో ప్రఖ్యాత మయ్యాని పార్వతీ నేత్రము తోడుతను

పాశుపతాస్త్రము చేతబట్టుకొని పర్వతము మీరు జేరెరుమా

Becoming famous among Panchanana caste, with the eye of Parvathi,
And with Pasupatastra, Mount Meru he will reach.

71.ఉత్తర దేశమున  సత్తుగ ప్రజలంతా కత్తులతో పేట  లాడేరుమా

ఉత్త మాటలు గావు నదీ నదములు పొంగి ఊళ్ళన్ని కొట్టుక పొయ్యినిమా

In North, people hunt each other with knifes cruely.
Fake words are not these, rivers will flood submerging many villages.

72.భాగవతములోన శుకయోగి  పలికిన భావికాలము  దృష్ట  మయ్యానిమా

మాఘ బహులయందు మా వారు వచ్చేరు మహిమీద సంభ్రమము లయ్యినిమా

In bhagavatham, Sage Shuka said situations will resemble.
In February my people will come and wars will happen on earth.

73.కన్యలోన శని ప్రవేశమైతేను  కమలనాభుడు  పయన మయ్యానిమా

సన్న జాజుల వన సాయంసమయమందు శతమన్యుడు కురిపించేనుమా

When Saturn enters Virgo, Lord starts journey.
In evening, rain of flowers will be rained by Indra.

74.వినుకొండదుర్గమ్మ వీడు వెడలి వచ్చి వీధుల వెంబడి తిరిగినిమా

కనకగిరి వద్ద కలహంబు లయ్యాని కాంభోజ దేవియు బుట్టినిమా

Vinukonda durgamma will leave fort, and wander in streets.
Fights happen at Kanakagiri, Goddess Camboja will be born.

75.హేమాద్రి రజతాద్రి తర్కవాదము వల్ల రామధర్మజులు వచ్చేరుమా

హేమాద్రిహేమీలు కొలిచేరు ముందర హేమ పీఠముమీద జేరెరుమా

From gold people and silver people logical debate, Rama dharmaja comes.
Gold people strength is tested in front, on golden place they shall reach.

76.ప్రేమతో వీరవసంతుని వెంబడి పెద్దలెల్ల తరలి వచ్చేరుమా

సోమ సిద్దంతము సొంపుగా నడచీని శుభాశుభంబులు అయ్యీనిమా

Many elders follow the vira vasanta with love,
Soma siddhanta will work, good and bad occurs.

77.కుండలిశయనుడు ఘోటకము  నెక్కి శ్రీకూర్మగిరి కేగ వచ్చీనిమా

కొండయ్యదాసుని శ్రీఘ్రముగ   బంపి పెండ్లికొడుకును బిల్వ బంపేరుమా

Lovely man on his horse reaches Sri Kurmagiri hill temple
Bridegroom is call for hurriedly sending kondaiah dasu to.

78.కూర్మగిరి వద్ద గుడార్ల వేయించి వీరుని పెండ్లచట జేసేరుమా

కూర్మగిరికి వేగ గంధర్వులు వచ్చి నిర్మల గానము జేసెరుమా

Tents are made at Kurmagiri, and vira’s marriage is made there.
To kurmagiri, gandharvas comes to sing and dance.

79.కేశవుని పెండ్లి కీర్తిగ జేసెరు ముత్యాల తలబ్రాల పోసెరుమా

కేశవుని వశము జేసి దేశాన్ని  దేశాలవారికి వ్రాసేరుమా

Kesava marraiage will happen greatly, pearls are poured on new couple.
To kesava, the country and countries are being written to him.

80.ఈశ్వర వత్సరము మాఘశుద్ధదశమి రోహిణి ఇందు వారంబున

సర్వేశ్వరుని వశము దేశాలుచేసేరు దేశాల వారికి వ్రాసేరుమా

In year Iswara, On Maghamasa suddha dasami Sunday of Rohini star,
To the Lord, Countries are made and written to him.

81.కాలము వచ్చిన దనుక ఈ మాటలు కల్ల యని జనులు కూసేరుమా

కాలము మొదలు ఆషాఢాని కొచ్చీని కల్లలెల్ల నిజము లయ్యీనిమా

When time comes, people say this as stupidity.
When time starts and comes to July, stupidity becomes truth.

82.మకర కుంభముల మాసాల లోపల ప్రకటన ప్రకాశ మయ్యీనిమా

ప్రకటన జేసియు పలుమారు దెలిపిన ప్రజలు ప్రారబ్ధము తెలియరుమా

In months of January & February, announcements are made.
After announcements also, people will not recognize their fate.

83.ఉత్తరాది జనులు దక్షినాభిముకులై ఉత్తరాయనమందు వచ్చేరుమా

కత్తి కత్తి పరచి ఘనయుద్ధమయ్యీని కలి భూదేవియు వణకీనిమా

North people south facing comes in Uttarayana (jan to july),
War happens with sword to sword, kaliyuga's earth will tremble.

84.ఉదయగిరి తుదను మఱ్ఱిచెట్టు క్రింద సుద తేడునిలువుల బుట్టీనిమా

సాధుజనుల గాచి జూడగా బొయ్యీని భేద జనుల బట్టి మ్రింగీనిమా

From Udayagiri foot, under a banyan tree, a flood will emerge.
Leaves innocent people and swallows sinners.

85.హంపీ విరూపాక్షి రెండూళ్ళ నడుమను అగ్ని వర్షములు  కురిసీనిమా

పెంపుతో పదునాల్గు గ్రామాలు మండీని భూమి వణికి గ్రమా లదరీనిమా

Between Hampi & Virupaksha, rain of fire will fall.

With war and destruction, 14 places shake and tremble.

86.హంపీ విరూపాక్షి రెండూళ్ళ నడుమను అరచి బసవన రంకె వేసీనిమా

విరూపాక్షి వద్ద వీరంగ వాద్యము మారెమ్మ గుళ్ళోను మ్రోగీనిమా

Between hampi & virupaksha, Basavana shouts and shakes legs.

Near virupaksha, war sounds are heard in maremma temple.

87.శత్రు సం హారుల వెంట బెట్టుకొని శేషాద్రివాసుడు వచ్చీనిమా

గురుదైవములు రెండు నెఱుగని వారిని గ్రుచ్చి యీటె మొనుల వ్రచ్చేరుమా

Lord shall come along with enemy destroyers.

People who don’t know guru and god, are pierced and pierced again.

88.మూడుకోట్ల ముత్తైదుల శాపము ముందర పరిహార మయ్యీనిమా

మూడుకోట్ల ముత్తైదులు పురుషులు ముకుందుని వెంట వచ్చేరుమా

3 crores married women curse will occur soon.

3 crores married women and men will walk along with Lord.

89.రేవతి కన్యక వెంట మూడుకోట్ల దేవకన్యలు వేగ వచ్చేరుమా

రావించి భక్తుల రామధర్మజస్వామి రక్షించి అభయము లిచ్చీనిమా

Along Revathi virgin, comes 3 crores of angels.

Ramadharmaja swamy cares his devotees and secure them.

90.హంపీలో నుండేటి హనుమంతరాయుడు అరచి వీధుల కేక వేసీనిమా

ఆ కేక తగ్గట్టె మహనంది మూలంతా ఆకురాలి నట్లు రాలేరుమా

Hanumantharayaudu from hampi, shouts and cries in streets.

On that shout, near the corner of mahanandi people fall as dry leaves.

91.ఓరుగంటిలోను  ప్రతాపరుద్రుడు వీరుడై బహుకేక వేసీనిమా

ఆరడి తగినట్టె ఆ పార్శ్వ నరులెల్ల ఆకురాలిన రీతి రాలేరుమా

Prataparudra from Oruganti becomes victorious and makes great shout.

With that energy, weaponed soldiers falls like dry leaves.

92.ఆకశవీధిని రాకాసి పంపులు కేకలు వేయుచు దుమికేరుమా

చీకాకుపడి నరుల జడమతుల్ చచ్చేరు శమనుని దూతలు వచ్చేరుమా

From sky way, comes destroyers making great souds.

Men senses goes irritated and dies. Yama’s soldiers arrive.

93.శ్రీ రంగపట్నము వారికి తిప్పలు వచ్చీని శ్రీఘ్రముగా బ్రహ్మ లోచ్చేరుమా

వీరవసంతుని ప్రకాశపు వింతలు వెంకటాద్రివారితో బల్కేరుమా

Trouble comes to Sri Rangapatnam people, soon brahmas too come.

explains vira vasanta’s shining wonders to venkatadri.

94.పప్పూరి వారికి తిప్పలు వచ్చీని నిప్పుల వర్షము కురిసీనిమా

తప్పు చెసినవారి తల ద్రుంచి వేసేరు ధర్మాత్ములను రక్షించేరుమా

Trouble comes to pappur people, rain of fire pours onto.

Sinners are beheaded unto, innocents are saved.

95.శ్రీరామధర్మజులు సృష్టి భారము దాల్ప శృంగారమూర్తులై వచ్చేరుమా

ఘోర దురితము లణగి కుంభిని మీదను పుష్ప వర్షములు గురిసీనిమా

Sri Ramadharmaja to eliminate human sins, comes in human form.
Wild sins are cleansed, on aquarius flower rain happens.

96.అరడాలు జెల్లులు పులితోలు గొడుగులు ధరియించి ముందర నడచేరుమా

మొరయుచు వీరవసంతుడై వచ్చీని మొత్తించి కర్మల మొరపెట్టగా

97.అల్లుడు పేరయితే ఆదికేశవుడు అవని గర్భమునం దుండీనిమా

కల్లయుగము పశు సంవత్సరమందు ఘనుడు బయలుదెరి వచ్చీనిమా

Son-in-law's name is adikesava, in earth's womb he shall be.
Kaliyear Pasu, he shall start his journey.

98.నాలుగువేల తొమ్మన్నూట డేబ్బెత్తొమ్మిది వత్సరములందు తెలిసీనిమా

వెలుగుచు భర్గుని వత్సరమందున వీరయోగిచంద్రు డిచ్చీనిమా

After 4978 years of kaliyuga on earth, shiningly
In year named Bharguni, Veera Yogi will come to us.

99.కల్లయుగము అయిదేవేలేండ్ల లోపల కలికి రూపుడు తరలి వచ్చీనిమా

ఎల్లలోకము లేలుచు చతుర్యుగ సద్ధర్మములు మహి నిలిపేరుమా

Kaliyuga before 5000 years, Kalki avatar start to come.
Ruling all worlds, establishes justice on earth.

100.తోకచుక్కలు పుట్టి దాని వృత్తాంతము తూర్పుతల పశ్చిమ దిక్కందున

తోకాయె ; శిరస్సు బండి కల్లంతటి చుక్క పెడల్పుతో నుండీనిమా

Comets come with different angular measurements.

A east headed and west tailed comes, seems like a star.

101.ఇరపై బార్ల పొడవు తోక ఈ రీతిని నరుల కనుల కానుపించీనిమా

విరివిగా ముప్పైమూడు  రోజు లుండీని ఎరుగని చోద్యాలు ఎరిగేరుమా

20 measures length tail will be seen by all humans.

For 33 days it can be seen, many wonders are seen too.

102.గగనమందున నాల్గుచుక్కలు ఎదురుగ ప్రకాశ తారలు బుట్టినీమా

ప్రకాశ చుక్కలు చూచిన ప్రజలు దిగులుపడి అదిరిపడి చచ్చేరుమా

In sky, 4 stars facing shining stars are born.

Looking those stars, people die in grief and fear.

103.శ్రీశైలనాధుడు సాక్షాత్కారముగాను దాసజనులతో మాటలాడీనిమా

శ్రీశుడు వీరవసంతు డొచ్చునని ఆ సితికంఠుడు పల్కీనీమా

Srisailam God, truly will speak to normal humans.

Speaks of arrival of Son of Man, Sri Vira Vasanta.

104.మకరమొకటి శ్రీశైలాని కొచ్చీని మకర మెన్మిది దినము లుండీనిమా

తెగువతో భ్రమరాంబ గుడిలో మేకపోతు తీరు గూసి మాయ మయ్యీనిమా

A Makaram will come to Srisailam, stays there for 8 days.

Courageously shouting like Male goat, enters into Brahmaramba temple and disappears.

105.శ్రీనగ మల్లికార్జునుని వీపునందు పొగలును మంటలు ఎగిరీనిమా

ధ్వని పుట్టి గురుమూర్తి వింతలు ఏడూళ్ళ కును వచ్చి నాట్యము లాడీనిమా

On back area of Srinagar Mallikarjuna, fire and smoke raises high.

Wonderful gods comes with sounds and dances in seven villages.

106.మల్లికార్జును గుడి శిఖరాన నిప్పులు జల్లు జల్లున అగ్ని రాలీనిమా

కల్లగాదు శక్తి బెబ్బులివలె రేచి ఉల్లము ఉప్పొంగి అరచీనిమా

On Mallikarjuna temple hill, rain of fire falls.

Truly, Shakthi gets up like roaring tiger, with broken heart shouts greatly.

107.గరుడధ్వజము మీద ఒక ప్రతిమ గూర్చుండి పరి పరి భాషలు పలికీనిమా

గిరిజ గుడి ముందర నందీశ్వరుడు తోక బిర బిర విదలించి ఎగిరీనిమాఏ

Sitting on Garuda dwaja, a sculpture speaks different languages.

Nandeswara in front of Girija devi temple, moves its tail and jumps.

108.నానా తోయముల వాక్యములన్నియు నగరము మీద మరి నిలిచేరుమా

మృడేశుని నొసటి కంటను మిణుగుర్లు విడిబడి వింతగ   ప్రాకీనిమా

Information changed in different ways reaches to cities.

Glowing flys or Ambrosia comes from eye of Mrudesha, and spreads wonderfully.

109.యాదగిరి యేటి జలచరము లన్నియు బాగుగా భువిపల్కు పల్కీనిమా

భోగి వీరయోగి వస్తాడనే వార్త భువిని జంతువు లెల్ల పొగడీనిమా

Beings of Yadgir river, will speak of earths words.

The arrival of Veera Yogi will be spoken by all animals on earth.

110.కుమార స్వాముల గుడివాకిలి యేడు దినములు మూసుక యుండేనిమా

అమరులందరు వచ్చి ఆ వాకిలిని దీసి ఏడు దినములు నచట నుండేరుమా

The doors of Kumaraswamy temple will be in closed manner for 7 days.
People get to open the door and stays there for 7 days.

111.యువవత్సరమందు శ్రావణమాసమున యామ్యదిశ వింతలు బుట్టీనిమా

ఇనుపదారియందు నిప్పుఘోటకములు వోని ఫిరంగు లారంభించేరుమా

Of year Yuva, Shravana masa in south direction miracles happen.
Fire horses and Firangs start in iron paths.

112.గండినుండి యూరుపాకకు బొయ్యాని గూడూరు మీదుగా సేగీనిమా

మెండుగ జని చెంగల్కోటకు బొయ్యి అందుండి దక్షిన దిశ కేగీనిమా

From Gandi goes to Vurupaka, via Guduru he goes.
Many people goes to Chengal fort, from there goes to south direction.

113.ఆ నెల ఆదివారము తిరునల్వేలి ఆమహాలింగేశునివద్దకు వాడుక

చోపున్న సాయం సమయమందు అనేకులు వచ్చేరుమా

On Sunday of that month, to the place of Mahalingesha for the
sake of Festival, that evening many people gather there.

114.ఆడవారు మగవారు బాలురు నచ్చట అద్రి నది గట్టున తిరిగేరుమా

కూడు గుడిచి వస్త్రధారణ మొనరించి వేడుక అర్ధములతో నుండేరుమా

Men, Women and children there will wander on the banks of river Adri,
Cooks food, wears clothes and enjoys the festival.

115.సంతోషముతోడ నాటలాడుచును పాటలందరు పాడుచుండేరుమా

కొందరు కాలక్షేపం చేయుచుండగ మరి కొందరు కోళ్ళు గోసేరుమా

Sings and dances all people there with joy,
Some may pass their time there, and some do animal sacrifices.

116.మేకలు కోళ్ళు ఆర్నూరువర కచట కేకలు వేయుచు నుండేనిమా

తెగువతో వాటిని చంపిన వాళ్ళంత కేక వెయుచు కిలారించేరుమా

Goats and hens of nearly 600 will be there shouting
Men sacrificies them with guts, screaming in joy.

117.అచ్చట కొందరు యాత్రికు లంత ప్రదక్షినంబు నాచరించేరుమా

ప్రచురముగా కొంద రనేక విధముల భక్త్యారాధనముల జేసేరుమా

Some devotees there will be rounding the temple,
Some people sings in name of God for publicity.

118.సమయమునకు తగిన సేవల జేసేరు దుముకు లాడుచు కొంద రుండేరుమా

సాయంకాలమున నైదు గంటలకు సుజనులు గాన మొనరించేరుమా

Some people there act as agents running hurriedly to perform duties.
By evening 5 p.m. some good people starts to sing.

119. ఆ సమయమునందు దిగులుపడునట్లు అపార వర్షము కురిసేనిమా

ఆ జనసముదాయం నిలిచిన తావున అపుడు తొగలకుండా నిలిచేరుమా

Exactly by that time, a heavy rain starts sadly there.
The crowd there will stand still, where they where in that rain.

120.పదినిమిషంబులు కాళి అడుగు లుండిన నేల ,గున్నాగిరి కొండ నదియందున

నూతన ప్రవాహ మకస్మాత్తుగాను నిష్కలుషమయి వేగ వచ్చీనిమా

From Gunnagiri hills, a new water course will unexpectedly flow to there,
Where for 10 minutes land is filled with foot steps.

121.నిండు మిక్కిలి యురవడితోడ నచటికి అపారమైన గంగ ఎగసీనిమా

మెండుగ జనులను జేర్చి వారు కొన్ని కొండచరియలు కొంచు బొయ్యేరుమా

With heavy speed much water comes to there,
Crowding many people, they will take hillslides with them.

122.ప్రవాహ మధికము గాక మునుపే జను లావలి దరికేగ జూచేరుమా

పొవదలచిన సంగు లనేకులను గిలుబాడ బోలే కుండేరుమా

Before water flowing speed increases, people tries to cross it
But of fear of subdue, many people cant go.

123.నిబిడముగా నుండి యంద రావలకు పోలేక జనులంత భ్రమసేరుమా

గుబగుబ మని గంగ పెరిగేటప్పుడు జనులు కలవరపడి భయ మొందేరుమా

People imagine to go from dense to other side of it.
But when water flow starts to increase, people start to fear more.

124.జనకుల భర్తల భార్య తల్లిదండ్రుల కుమారులను రోసి కుందేరుమా

అనుమానమున తప్పించుకొను తమకును సాధ్యమై నట్టుల కోరేరుమా

People starts to abuse their husbands, wifes, children and their parents.
Frightening of situation, people doubt of their escape from it.

125.జల ప్రవాహ మొదిరింప మరి యెవరి వల్లకాదు మునుల కయ్యీనిమా

బలు ప్రవాహము యొక్క వేగము చేతను ప్రజలు దొర్లుచు పారి పొయ్యేరుమా

None can escape from fury of water, except for saints.

To the speed of water, people start to get carried away by it.

126.వారు వారు నట్టి భాద యనుభవించు వారే గదా యది తెలియదుమా

నరు లొకరి కంటికి నొకరు కనబడకుండ నపుడు చీకటి కమ్మి యుండీనిమా

Those who suffer it are the those who should suffer it, and they cant understand it.

Men cant see eachother as the night darkness starts to cover them.

127.చీకటి గమ్మిన అరగంట సేపులో అకస్మాత్తుగా జలము లింకీనిమా

ఒకగంట సేపైనా తోడ్తో మునుపటి వలె వట్టి నేలగ పడి యుండీనిమా

After the 30 minutes of darkness, suddenly water flow stops.

After one hour, water dries up and the ground there seems as dry land.

128.నదిలో కొట్టుకొని పోయిన వారలు  లక్షకు పైలెక్క యుండీనిమా

అదిగాక చెట్ల వేళ్ళను  పొదలందు ప్రేతములు బహు ఉండీనిమా

People carried away by the water will be more than one lakh,

Many corpses will be under the trees and plains there.

129.ఏరు దీసిన వెనుక అక్కడక్కడ   జూచి శవాలను మరి యెత్తేరుమా

లోతైన ఆయేటి పొడుగున నుండేటి చెరువులో శవాలు తేలీనిమా

After river dries, corpses are searched and found.

Many corpses are found in that river’s end deep lake.

130.కొన్ని పీనుగులు రాళ్ళసందున నున్నవి యెత్తి బైట పూడ్చేరుమా

విన్న వారు దుష్టవర్తనలు భువిలో నున్న వారెల్లరు అణగేరుమా

Corpses between the stones are found and buried away.
Sinners hearing this got annexed all over the earth.

131.భువిలో దక్షిన అమెరికా దేశమున భూకంపం బహుగాను బుట్టీనిమా

అదిరిన ఆ నగర మందు సర్వాత్ములు బెదిరియు నశన మయ్యేరుమా

On earth, in country of South America great earthquake happens.
People of that trembled city, frighteningly perishes.

132.అందులో నైదు కుటుంబాల వారు అచటను తప్పియు బ్రతికేరుమా

నంది యానాం కరము విహ్వాలు లైరి సోమనగరి గిరి నగ్ని పెరిగేసుమా

Five family people escape there and lives hence.
'Nandiyanam' people hands get paralysed, Fire increases on hill of Somanagari(Mooncity).

133.కకుతిల్గా నగరము కారాము అవలోక మగ్నివల్లను భస్మ మయ్యీనిమా

సెగ నిప్పుల్ పడి నగరం కారాము తోడేడు నగరాలు నాశనమయ్యీనిమా

Jail of 'Kakutilga' city, will be ashed by seen fire.
By fierce falling fire, with that city's jail, burns 7 cities too.

134.మేలోరు నగరమునందు కాపరి వంశ మున నొక బాలుడు బుట్టీనిమా

తోలు వన్నె ముఖము తెలుపు నలుపు ఛాయ కలబిడ్డ డచటను పెరిగీనిమా

In 'Maylore' city, a boy borns into a shepherds family.
Glowing skin, face of black and white shade, the boy grows up there.

